మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్త లందరికీ స్వాతంత్ర్య దినోత్సవశుభాకాంక్షలు

★ ★ ★ —సం




### వేయిపడగలు

సీరియల్ వేయిపడగలు సీరియల్ చదువుటకు చాలా ఆసక్తికరముగా ఆకర్షణీయముగా వుంది

యార్లగడ్డ సత్యవతి మండపేట

★ ★ ★

కవిసామ్రాట్ గారి వేయి పడగలు నవల అందిస్తున్న మీకు మరో వెయి కృతజ్ఞతలు

—టి రమునాదన్ పాండిచ్చేరి

### సీరియల్స్

డి యస్ ఎ విజయ్ ఆదిలోనే మమ్ము ఎంతో ఆకట్టుకుంది రచయిత్రి గారి రచనా శైలి చాలా బాగుంది రచయిత్రి ఆదూరి సావిత్రి గారికి మా అభినందనలు —వై తులసీరామ్ చిత్తూరు

★ ★ ★

సర్వకొత్త సీరియల్ డి ఎస్ ఎ విజయ్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది పోలీస్ వ్యవస్థలోని లోపాలతో సామాజిక వ్యవస్థలో

పోలీసుల బాధ్యత ఎలాంటిదో రచయిత్రి అర్థవంతంగా ఈ సీరియల్లో ముమ్ముందు తెలియజేస్తారని మా నమ్మకం రచయిత్రి ఆదూరి సావిత్రి గారికి మా అభినందనలు

—నాగిసీప్రియ డోర్నకల్

★ ★ ★

ఆదూరి సావిత్రి గారి డి ఎస్ పి విజయ్ సీరియల్ ప్రారంభం చాలా బాగుంది

—చామర్తి సాయిగంగాధర్ విజయవాడ

★ ★ ★

క్రొత్త సీరియల్ డి ఎస్ ఎ విజయ్ ఆదిలోనే ఆకట్టుకుంది

—చో డవరపు నాగేశ్వరరావు హైదరాబాదు

( 74 వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938 1972)

21 27 ఆగస్ట్ 87

శ్రీ ప్రభవ నామ సం శ్రావణ బ ద్వాదశి

సంపుటము 79 సంచిక 51

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు | 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు | 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం విజయవాడ 520 003




## విషయానుక్రమణిక

### ముఖచిత్రం

జయదేవుని గీత గోవిందం లో దశావతారవర్ణన ప్రళయ పయోధిజలే ధృత వానసివేదం (చిత్రం డా సిహెచ్ మురళీకృష్ణారావు)

### కథలు



### సీరియల్ నవలలు



### వ్యాసాలు, శీర్షికలు

# మీరు సిమెంట్ కొనబోతున్నారా?



అయితే అమీర్ పేట్, హైదరాబాద్‌లోని ప్రముఖ డీలరు శ్రీ ఏ. లక్ష్మీనారాయణ గారు ఏమంటున్నారో చూడండి!

"నా వ్యాపారానికి వినియోగదారుల సంతృప్తి, టర్నోవరు, చాలా ముఖ్యం. ఎన్నో పెద్ద కంపెనీల సిమెంట్ అమ్మే నాకు ఎంతో ఆశ్చర్యకరంగా అతికొద్ది కాలంలో చాలా మంది వినియోగదారులకు సంతృప్తి, నాకు లాభాలను చేకూర్చిన సిమెంట్ – విష్ణు సిమెంట్."




# విష్ణు సిమెంట్

# ఆనవాలైన ప్రజాస్వామ్యం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

వాషింగ్టన్ వైట్‌హౌస్ లోపలికి వెళ్ళడానికి ముందు దాదాపు రెండు గంటల సేపు క్యూలో నిలబడాలి కాని మొదటి అంతస్తులోని ఓ అరడజను బ్రహ్మాండమైనటువంటి గదులు చూడగానే అంతసేపు పడిగాపులు పడడం అవసరమా అని సందేహించవలసి వస్తుంది మన రాష్ట్రపతి భవన్‌లో కొన్ని వందల గదులున్నాయి వైట్‌హౌస్‌లో కొన్ని డజన్ల గదులకన్నా ఎక్కువలేవు కాని వాళ్ళకూ మనకూ తేడా ఏమిటంటే, వారానికి ఐదురోజులు ఉదయం వేళల్లో వైట్‌హౌస్‌లో ఎవరైనా ప్రవేశించవచ్చు పెన్సిల్వేనియా అవెన్యూ దగ్గర మొదలయ్యే క్యూలో నిలబడితే చాలు కాని ఆహ్వానం ఉంటేనో, ఎవరో ఒక గుమాస్తా నుంచి ఒక అనుమతి పత్రం సంపాదిస్తేనో తప్ప మన రాష్ట్రపతి భవన్‌లోకి మీరు ప్రవేశించలేరు వాషింగ్టన్‌లో ఎక్కడా అనుమతి పత్రాలు లేవు ఆ మాట కొస్తే యూరప్‌లో ఎక్కడా అనుమతి పత్రాలులేవు ఎందుకంటే అన్ని ప్రభుత్వ భవనాలు అమెరికా అధ్యక్షుని నివాస గృహమైనటువంటి వైట్‌హౌస్ వంటి ప్రైవేట్ భవనాలు కూడా ఎవరైనా ప్రవేశించడానికి వీలుగా ఉంటాయి అంటే, నిజంగా ప్రజలకు చెందిన భవనాలుగా ఉంటాయి

అమెరికన్లు గత రెండు శతాబ్దాలుగా బహిరంగ సమాజాన్ని కలిగి ఉన్నారనేటటువంటి విషయాన్ని గుర్తించకుండా కమ్యూనిస్టులు మిఖయిల్ గోర్బచేవ్ ప్రతిపాదించిన గ్లాస్‌నోస్ట్ లేదా బహిరంగ విధానం గురించి పెద్ద ఎత్తున గగ్గోలు పెడుతున్నారు అమెరికాలో మీరు ఏ కార్యాలయంలోనికయినా అది ప్రభుత్వ కార్యాలయమైనా ప్రైవేట్ కార్యాలయమైనా సరాసరి వెళ్ళిపోవచ్చు మీకు అక్కడ స్వాగతం లభిస్తుంది కూడ చివరికి సి ఐ ఎ కార్యాలయంలో కూడా ఇంత బహిరంగంగా వెళ్ళగలిగినటువంటి రోజులుండేవి వైట్‌హౌస్‌లో అధ్యక్షుని కుటుంబ భోజనాల గది కుటుంబ గ్రంథాలయం వంటి ప్రైవేట్ గదులు కూడా మీకు చూపెడతారు వాటిని చూడమని మిమ్మల్ని ప్రోత్సహిస్తారు క్యూ సింహద్వారం చేరుతుండగా వైట్‌హౌస్ చరిత్ర మీద అంటే నిజానికి అమెరికా చరిత్రమీద ప్రత్యక్ష వ్యాఖ్యానం మీకు వినిపిస్తుంది ఈ సారి నేను వైట్‌హౌస్‌ను జులై 4న సందర్శించాను మనకు ఆగస్ట్ 15 ఎటువంటిదో అమెరికన్లకు జులై 4 అటువంటిది పైగా ఈ సంవత్సరం జులై 4కు అమెరికన్ రాజ్యాంగం మీద సంతకాలు జరిగి సరిగ్గా 200 సంవత్సరాలు నిండాయి అమెరికన్ రాజ్యాంగం గురించి ప్రతి అమెరికన్ పాఠశాల విద్యార్థికీ తెలుసు వాషింగ్టన్ స్మారక చిహ్నం సమీపంలో ఉన్నటువంటి సరస్సు దగ్గర ఈ జులై 4న ప్రత్యేకంగా బాణ సంచా కాల్చారు కాని ప్రభుత్వ భవనాలు వేటినీ దీపాలతో అలంకరించలేదు వైట్‌హౌస్‌లోని రెండో అంతస్తు నుంచి అధ్యక్షుడు, కుటుంబంతో సహా ఈ బాణ సంచాను తిలకిస్తారని పత్రికలలో వచ్చింది ఆ కిటికీలలో ఏదో ఒక కిటికీలోంచి రీగన్ కుటుంబాన్ని చూడవచ్చుననే ఆశతో నేను వైట్‌హౌస్ ముందు నుంచి సాగిపోయాను గాని వాళ్ళు కనబడలేదు

అమెరికన్లు సృష్టించినటువంటి బహిరంగ సమాజంలో బలవంతులకు తమ డబ్బుతో కొనుక్కోగలిగిన ప్రత్యేక సౌకర్యాలు తప్ప మరే ఇతర ప్రత్యేకాధికారాలు అంతగా ఉండవు అధ్యక్షునితో పాటు పని చేసే ఉన్నతాధికారుల కార్లు ఆపుకోవడానికి ప్రత్యేకమైన స్థలమేది ఉండదు మిగతా వాషింగ్టన్ వాసుల లాగే వాళ్ళు కూడా తమ కార్లను వీధిలో ఆపుకుంటారు నిజంగానే అక్కడ ఎవరి గురించీ అంత ప్రత్యేకంగా చెప్పుకోదగినదేమి లేదు అధ్యక్షుడు న్యూయార్క్‌కో లాస్ ఏంజెల్స్‌కో వెళ్ళినప్పుడు ఆయా రాష్ట్రాల గవర్నర్‌లతో ఉండడు అందరిలాగే ఒక హోటల్‌లో బస చేస్తాడు కెనడాలోని టొరంటోలో అక్కడి మాజీ ప్రధాన మంత్రి ఎయరీ ట్రూడో విమానాశ్రయానికి టాక్సీలో రావడం చూసి నేను ఆశ్చర్యపోయాను ఆయన సామాన్లు ఆయనే మోసుకొచ్చుకున్నాడు (కెనడాలోగాని అమెరికాలోగాని ఎక్కడా కూలీలు కనబడరు బాగా దక్షిణాన న్యూ ఆర్లీన్స్‌లో ఒకళ్ళిద్దరు కనబడతారు) ఇతరులందరి లాగానే చెకింగ్ కౌంటర్ దగ్గర క్యూలో నిలబడ్డాడు ఆయనను చెక్ చేసిన యువతి కూడా ఆయన ట్రూడో అని గుర్తించలేదు ఆయన నా ముందే ఉన్నాడు గనుక నేను గుర్తించాను అప్పుడు విమానంలో చికాగోకు వెళుతున్న మా అందరిలాగనే ఆయన కూడా తన బోర్డింగ్ కార్డు తీసుకుని భద్రతా సిబ్బంది వాళ్ళను దాటి విమానం ఎక్కేముందు కాఫీషాప్‌కు వెళ్ళాడు ఆయనకు అంగరక్షకులు లేరు ఆయన కోసంగాని మరెవరి కోసంగాని ప్రత్యేకంగా ముఖ్యమైన వ్యక్తుల విశ్రాంతి గదులు లేవు మా అందరి లాగనే ఆయన కూడా కాగితం కప్పులో కాఫీ తాగాడు ఆయన ఎకానమీ తరగతిలోనే ప్రయాణం చేశాడు

ప్రతి అమెరికన్ సంస్థలోనూ అది వాషింగ్టన్‌లోని ప్రభుత్వశాఖ ఐనా కొలరాడోలోని డెన్వర్‌లో పత్రికా కార్యాలయం అయినా మీరు ఈ బహిరంగ లక్షణాన్ని గమనించగలుగుతారు అట్లాగే అమెరికన్లు చాలా దేశభక్తి గలవారు వాళ్ళు మనకంటే ఎక్కువ దేశభక్తులు నేను జులై 4న వాషింగ్టన్‌లో ఈ మధ్య కాలంలో ఢిల్లీలో ఆగస్ట్ 15న చూసినటువంటి వాటికంటే ఎక్కువ సంఖ్యలో జాతీయ పతాకాల్ని చూశాను దాదాపు ప్రతి బాలుడి చేతిలోనూ బాలిక చేతిలోనూ ఒక్కొక్క కాగితపు జెండా ఉంది దాదాపు



ప్రతి కారు మీదా జెండా రెపరెపలాడుతున్నది వాళ్ళ సంచా కాల్చుడానికంటె ముందు మేం వర్జీనియా లోని ఆర్లింగ్టన్ సమాధి దగ్గరికి వెళ్లాం అక్కడ తన ఇద్దరు చిన్నారి పిల్లలతో సహా ఖననం చేయబడిన జాన్ కెన్నెడీకి శ్రద్ధాంజలి ఘటించడానికి మేం వెళ్లాం ఆ రోజు అక్కడికి మేం మాత్రమే వెళ్తున్నామని మేమనుకున్నాం కానీ చిటచిటలాడే ఆ మిట్ట మధ్యాహ్నం వేళ అక్కడ కనీసం వెయ్యిమంది ఉన్నారు వాళ్ళు కేవలం అమెరికా నుంచి వచ్చినటువంటి వాళ్ళు మాత్రమే కారు ప్రపంచం నలుమూలల నుంచి ముఖ్యంగా ఆసియా నుంచి వచ్చిన సందర్శకులు అక్కడ ఉన్నారు కొందరి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి

ఏ అధ్యక్షుడైనా, ఆ మాటకొస్తే ఏ ప్రభుత్వాధికారి అయినా ఈ బహిరంగత్వాన్ని ఉల్లంఘిస్తే ఇబ్బందిలో పడతాడు నిక్సన్ ఆ పనే చేసి పదవి పోగొట్టుకున్నాడు ఇరాన్- కాంట్రా వ్యవహారంలో రీగన్ ఆ పనే చేశాడు బహుశా ఆయన కూడ పదవి పోగొట్టుకోవచ్చు ఆయన మీద ప్రధాన ఆరోపణ ఆయన ఇరానియన్లతో లావాదేవీలు ప్రారంభించాడని కాదు, ఆ పనిని ఆయన కాంగ్రెస్‌కుగాని, ప్రభుత్వానికిగాని తెలియకుండా రహస్యంగా చేశాడనేదే ఐతే కాంగ్రెస్‌కు ఆ విషయం చెప్పి ఉంటే ఆ పని చేయడంలో ఎక్కువ కృతకృత్యుడు కాగలిగి ఉండేవాడు కాదనేది వేరే విషయం అమెరికన్లకు అయతుల్లా అంటే ప్రేమ ఏమీలేదు రీగన్ గనుక




ఆయన వెనుక లావాదేవీలు జరిపి, అమెరికన్ బందీలను ఆ బేరంలో విడిపించుకుని ఉంటే తప్పులన్నిటి నుంచి క్షమించబడేవాడే కాని ఆయన ఆ పనిని రహస్యంగా చేశాడనేది, లేదా చేయడానికి ప్రయత్నించాడనేది ఆయన మీద మచ్చ అయిపోయింది ఇంతకూ దానివల్ల ఆయనగానీ, ఆయన అధికారులుగాని స్వంతంగా లాభపడిందేమీ లేదు

మొత్తం అమెరికన్ ఆర్థిక వ్యవస్థ ఇట్లా విషయాల పట్ల బహిరంగ వైఖరి తీసుకోవడంపై ఆధారపడి ఉన్నది ఎందుకంటె ఒక మార్కెట్ ఆర్థిక వ్యవస్థ విలసిల్లాలంటే ఇటువంటి బహిరంగత్వం లేకుండా అసాధ్యం అమెరికన్ సంస్థలు తమ గణాంకాల్ని ఏడాదికొకసారి ప్రకటించవు అది కూడ మన దేశంలో లాగ ఆ లెక్కలకు సంబంధించినటువంటి సంవత్సరం గడచిపోయి ఎంతో కాలమయ్యాక ప్రచురించవు అక్కడ ఆ గణాంకాల్ని ప్రతి మూడు నెలలకొకసారి ప్రకటిస్తారు ఒకసారి నుంచి ఇంకోసారికి జనరల్ మోటార్స్ సంస్థ ఎంత వ్యాపారం చేసిందో, ఎన్ని కార్లు ఉత్పత్తి చేసిందో ఒకపాఠశాల విద్యార్థికూడా చెప్పగలడు ఎందుకంటే ఆ వివరాలన్నీ ప్రతి వార్తా పత్రికలోనూ వ్యాపార విషయాల పుటల్లో అచ్చయి ఉంటాయి ప్రతి ఉదయం మొదటి కప్పుకాఫీ తాగుతున్నప్పుడే డాలరు విలువ ఎంత ఉందో తెలిసిపోతుంది ఆ విలువను రిజర్వ్ బ్యాంక్‌లోని ఏ అధికారో నిర్ణయించడు అది బహిరంగ మార్కెట్‌లోనే నిర్ణయమవుతుంది వార్తాపత్రికలలో ఆ సరుకు గురించీ, ఈ సరుకు గురించీ ధరలతో సహా పెద్ద పెద్ద ప్రకటనలు వస్తాయి దుకాణంలో ధర వేసిన చీటీలేని వస్తువు ఒక్కటి కూడా ఉండదు మీరు అరటి పళ్ళు కొంటున్నా, టి వి సెట్టు కొంటున్నా ధర స్పష్టంగా తెలిసిపోతూ ఉంటుంది ఆ మాటకొస్తే, ఒక అధ్యక్షునికి వోటు వేసేటప్పుడైనా అంతే అది ఒక బహిరంగ సమాజం అందువల్లనే అది అంత బాగా విజయవంతమైంది □

# అవినీతిపై వి.పి.సింగ్ పోరాటం!

కేంద్ర ఆర్థిక రక్షణ మంత్రిత్వశాఖల మాజీ మంత్రి శ్రీ విశ్వనాద్ ప్రతాప్ సింగ్ ఇప్పుడు అవినీతిపై ధర్మ యుద్ధం ప్రకటించి తమ ఉద్యమానికి మద్దతు కోసం దేశం అంతా పర్యటిస్తున్నారు మంత్రి పదవికి రాజీనామా చేసిన తర్వాత ఆయన తమ మిత్రులు పార్టీ నించి బహిష్కరింపబడిన వారు అయిన శ్రీయుతులు అరుణ్ నెహ్రూ వి సి శుక్లా, ఆరిప్ మహమ్మద్ ఖాన్‌లతో కలిసి కాంగ్రెసు (ఐ) లోని అసమ్మతి వాదులని కూడగట్టుకునే ప్రయత్నం చేసారు శ్రీ సింగ్ పార్టీ నించి బహిష్కరించిన తర్వాత అంతకు ముందు అటూ ఇటూగా ఉన్న అసమ్మతి వాదులలో చాలా మంది రాజీవ్ గాంధీ నాయకత్వం పట్ల విశ్వాసాన్ని ప్రకటించారు పార్టీలో ఉంటూనే క్షాళన కార్యక్రమాన్ని నిర్వహించాలనుకున్న ఆయన ప్రయత్నాలు కొనసాగ లేదు

అత్యున్నత స్థాయిలో అవినీతిని రూపుమాపాలన్న ధ్యేయంతో శ్రీ సింగ్ తమకు మద్దతు నిచ్చే ఏ పార్టీ



అరుణ్ నెహ్రూ

వారితోనైనా చేతులు కలపటానికి సిద్ధమైనారు అందుకే ఆయన ఇటీవల హైదరాబాదు వచ్చి శ్రీయుతులు ఎన్ టి రామారావు దేవిలాల్‌తో సమావేశం జరిపారు శ్రీ సింగ్‌లాగే శ్రీ దేవిలాల్ కూడా ఒకప్పుడు కాంగ్రెసు వాదే ఆయన ఇప్పుడు లోక్‌దళ్ (బి) నాయకుడుగా హర్యానా ముఖ్యమంత్రి అయినారు

శ్రీ సింగ్ నిన్న మొన్నటి వరకూ తాము కాంగ్రెసు (ఐ) పార్టీకి చెందిన వారమనీ తమ నాయకుడు శ్రీ రాజీవ్ గాంధీ అనీ నొక్కి చెబుతూ వచ్చారు ఇప్పుడు ఆయన తమకు ఒక పార్టీ అంటూ ఏదీ లేదని అంటున్నారు పార్టీ రహిత ప్రజాస్వామ్యాన్ని తాము కోరటం లేదని కూడా అన్నారాయన అంటే ఆయనకు ఒక కొత్త పార్టీని పెట్టే ఆలోచన ఉన్నట్లే అనిపిస్తున్నది నిర్దిష్టమైన కార్యాచరణతో కొత్త పార్టీ ఒకటి రూపొందుతుందని శ్రీ సింగ్ సూచన ప్రాయంగా తెలియ చేసారు కూడా



వి పి సింగ్

ప్రాంతీయ పార్టీలతో చేతులు కలపటం కొన్ని సమస్యలపైన వారి సహకారం తీసుకోడానికేనని శ్రీ సింగ్ అంటున్నారు వాళ్ల సహకారం ఎంత ఉంటుందో వేచి చూడాలి

శ్రీ వి పి సింగ్ తమ మంత్రి పదవికి రాజీనామా చెయ్యటానికి కొద్ది రోజుల ముందు తమ నాయకుడు శ్రీ రాజీవ్ గాంధీ ఎలాంటి సవాళ్లని అయినా ఎదుర్కో గలరని అన్నారు కాని ఇప్పుడు తమని పార్టీ నించి బహిష్కరించిన తర్వాత ఎదురయ్యే సవాళ్లని కూడా ఎదుర్కోగలరా అన్న ప్రశ్నకు ఆయన సమాధానం చెప్పలేక పోయారు

శ్రీ సింగ్ అత్యవసర పరిస్థితిలో కూడా శ్రీమతి ఇందిరాగాంధీకి బాసటగా నిలిచారు ఆమె అనుచరులుగా ఉన్న ఆ రోజుల్లో ఎప్పుడూ ఆయన అవినీతిని గురించి ఒక్క మాట కూడా మాట్లాడ లేదు శ్రీమతి ఇందిరా గాంధీకి ఎప్పుడూ ఆయన విధేయులుగానే ఉన్నారు తర్వాత ఆయిన శ్రీ రాజీవ్‌గాంధి మంత్రి వర్గంలో కేవలం ఒక మామూలు మంత్రిగా కాక రెండవ స్థానంలో ఆర్థిక మంత్రిగా ఉన్నప్పుడే బోఫోర్స్ తదితర బేరాల ఒప్పందాలపై సంతకాలు జరిగాయి ఆర్థిక

వి సి శుక్లా



మంత్రిగా ఆయన రాజీవ్ మిత్రుల జోలికి వెళ్లకుండా పలువురు వాణిజ్య వేత్తలపైనే దాడులు జరిపించారు రాజకీయవాదులపై చర్య తీసుకోటానికి తగిన ఆధారాలు లేవని అన్నారు ఎప్పుడైతే ఆయన అమితాబ్ బచ్చన్ వైపు తమ దృష్టిని సారించారో అప్పుడే ఆయనకు ఉద్వాసన జరిగింది అంతవరకూ శ్రీ సింగ్ శ్రీ రాజీవ్ గాంధి చెప్పినట్లు చేసారు అమితాబ్ బచ్చన్‌పై ఆయనకు ఉన్న అయిష్టమే శ్రీ సింగ్‌ని బాగా కదిలించి ఉంటుందని కొందరు అంటారు

పరిశ్రమల నిర్వహణలో కార్మికుల భాగస్వామ్యం రైతులకు గిట్టుబాటు ధరలు గురించి ఇప్పుడు ఆయన చెబుతున్నారు ఇవే కోరికలని ఒకప్పుడు ఆర్థిక మంత్రిగా ఆయన తిరస్కరించారు దాన్నిబట్టి ఆయన చెబుతున్న మాటలు కేవలం ప్రచారం కోసమేనని అనుకోవాల్సి ఉంటుంది

అవినీతిపై యుద్ధం ప్రకటించామని చెపుతున్న శ్రీ



ఆరీఫ్ మహమ్మద్‌ఖాన్

సింగ్ అనేక రకాలుగా అవినీతి ఆరోపణలకు గురైన వ్యక్తులతో చేతులు కలపటం సమంజసం ఎలా అవుతుంది? దానికి ఆయన ఇల్లు తగలబడుతున్నప్పుడు బకెట్ నీళ్లు ఎవరిచ్చారు అన్నది ముఖ్యం కాదని అన్నారు ఆయన అన్న ఆ మాటలు ఎవరికైనా ఎన్నో సందేహాలని కలిగిస్తాయి అవినీతి ఆరోపణలకు గురైన వారు ఆర్థిక నేరాలకు పాల్పడిన వారు ఏదో ఒక విధంగా అక్రమ సంపాదన ద్వారా పైకి వచ్చిన వారు, రాజకీయ జీవితంలో కాని రాజకీయేతర జీవిత భాగంలో కాని నిష్కళంకమైన చరిత్ర లేనివారు అయిన వ్యక్తులతో చేతులు కలిపి నిన్నటి దాకా కాంగ్రెసు (ఐ) లో ఉండి ఇప్పుడు బహిష్కృతులైన శ్రీ సింగ్ దేశంలో ఒక కొత్త తరహా అవినీతి వ్యతిరేక ఉద్యమాన్ని చేస్తారనుకునే వారికి ఆదిలోనే ఎన్నో అనుమానాలు కలుగు తున్నాయి మరి ఏం చేస్తారో వేచి చూడాలి

– ఎం ఆర్

# చూడలేను!!!

చూడలేను
ఈ లోకం పోకడ నే చూడలేను
విద్యలోన నారితేరి పరీక్షలో ప్రతముడయ్యు
ఉద్యోగం నోచుకోని మందబాగ్యు చూడలేను
విద్య ఉండి రూపముండి గుణం ఉండి డబ్బులేక
వివాహమ్ము నోచుకోని కన్యను నే చూడలేను
చక్కని రూపమ్ము ఉన్న సద్గుణయౌ సతిని విడిచి
సంతలోని వెలయాండ్రను చేరు మగనిచూడలేను
పరాసక్తి పెరిగిపెరిగి బర్తను చంపించే
పతిత అయిన వనితను నే చూడలేను -చూడలేను
దన మోహం మితం మీరి దాన్యంలో రాళ్ళు గలుపు
దర్మబాహ్య వణిజుల నే చూడలేను చూడలేను
నీతిమారి కార్యాలయ రహస్యాలు అమ్ముకొనే
నీచులయిన ఉద్యోగుల చూడలేను చూడలేను
నాపదవికి బంగమేల? అనుకొని తన క్రింది వారి
నాపదలకు గురి చేసెడి అదికారుల చూడలేను
స్వార్ధ దృష్టి పెరిగిపోయి ప్రజావళిని కన్నొరంగు
వంచకులగు నాయకులను చూడలేను చూడలేను

- కనమలూరు వెంకటశివయ్య





సీరియల్

# రేపటి మహిళ

## సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

"ఇవాళ ప్రొద్దున్న మనింటికెవరేనా వచ్చారా? వంటమనిషిని అడిగాడు బాగవతార్

వచ్చారన్నట్టు తలూపింది

మగవాళ్లేనా? మళ్ళీ అడిగాడు

మళ్ళీ తలూపింది ఔనన్నట్టు

అనుబవం మీద బాగవతార్ మాటలకి సమాదానం చెప్పడం కంటే తలూపడమే మేలని గ్రహించింది ఎందుకంటే మాటలతో సమాదానం చెప్తే తన మనసులో వున్న దానికి బిన్నంగా సమాదానం వచ్చినప్పుడు చిరాకుపడిపోయి ఏదో వంకతో నోటికొచ్చినట్టు తిట్టేస్తాడు తలూపితే ఆ ఊపడాన్ని తన మనసులో బావానికి అనుగుణంగా అన్వయించుకొని తనే ప్రశ్నలేసుకుని – తనే సమాదానాలు చెప్పేసుకుంటాడు

తెల్లగా పొడుగాటి గౌను వేసుకుంటాడు ఆ మింగియారా?

మళ్ళీ ఔనన్నట్టు తలూపింది

తెల్లటి పాంట్ షర్టు వేసుకుంటాడు అనంగా?

ఔనన్నట్టు తలూపింది

ఏయ్ నిజం చెప్పు వచ్చిందెవరు? అబద్ధాలాడేవంటే పోలీసుల కప్పగించి జైల్లో పెట్టిస్తాను

ఈ మాటలకి వంటమనిషి బయపడలేదు ఎందుకంటే జైల్లో పెట్టిస్తాననడం అతడికో ఊతపదం లాంటి బెదిరింపు

పైట కొంగు నడుంలో దోపుకొని ఒక అడుగు ముందుకేసి ఏంటండీ! మీ యింటికెవరొచ్చారో ఎవరు పోతారో నాకెలా తెలుస్తుంది వచ్చినాళ్ళు నన్ను కాపీ పట్రా టీ పట్రా అంటారేగాని ఊరూ పేరూ చెప్తారా? అడిగితే మీరూరుకుంటారా? జైల్లో పెట్టిస్తారా? ఎందుకొచ్చింది గాని మా ఇంటికి నే పోతాను అమ్మగారొచ్చాక మీరిట్టా విసిగిస్తున్నారని చెప్పి జీతం డబ్బులు పట్టుకుపోతా! సాంబారు మరుగుతోంది తాళింపేసుకోండి కుక్కర్లో అన్నం వుంది ఉడగ్గానే స్టౌ ఆర్పుకోండి నే పోతన్నా చరచర వీది గుమ్మం దగ్గిరకెళ్ళి పోయింది బాగవతార్ బంగారుపడిపోతూ వంటమనిషి వెనకాలే వెళ్ళి తలుపు తెరవబోతున్న ఆ అమ్మాయి చెయ్యి గట్టిగా పట్టుకుని ఉండుండు వెళ్లకు ఇది తీసుకో అంటూ పది రూపాయల నోటు దాని చేతిలో పెట్టబోయాడు

వంటమనిషికి యాభైయేళ్ళు తల మూడు వంతులు నెఱిసింది ఎత్తు పళ్ళు మొహం మీద మశూచికం మచ్చలు

ఆవిడ బాగవతార్ చెయ్యి విడిపించుకుని ఎడంగా జరిగి చ చ ఇవేం బుద్ధులయ్యా! ఎద్దో మర్యాదస్తుల యిల్లని చేరాను ఇంట్లో బార్య లేని సమయం చూసుకుని నా చెయ్యి పట్టుకుంటావా? పైగా పది రూపాయలు చేతిలో పెడ్తావా? ముష్టి పది రూపాయలు అమ్మగారితో చెప్పి నిన్ను జైల్లో పెట్టిస్తాను అని విరుచుకుపడింది

కొయ్య బొమ్మ అయిపోయాడు బాగవతార్ అతడి ఊహకందని సంఘటన ఎదురైనప్పుడు మాట్లాడలేడు కొన్ని నిముషాలు గడిచాక వంట మనిషి చెయ్యి జాపి యాభై రూపాయలు యియ్యి అంది

తెప్పరిల్లి ఈ లోకంలోకి వచ్చాడు బా గవతార్ చీదరించుకుంటూ పో పో! అన్నాడు వంటమనిషి పోకుండా పోనీ ముప్పై అంది

పోతావా మెడబెట్టి గెంటమంటావా?

అమ్మగారికి వంట రాదు నా వంట తప్ప ఆవిడ తినలేరు మీ యిష్టం పొమ్మంటే పోతాను నేనెందుకు మానేసానని అమ్మగారడుగుతే నేను బలాత్కారం చేస్తే బరించలేక వెళ్ళిపోయింది అని చెప్పండి ఎందుకంటే నేనెలాగూ చెప్తాను మీరో మాట నేనో మాట చెప్తే బాగుండదు కదా మరి

తెల్లబోయిన బాగవతార్ ఒక నిముషం నోరు తెరచి మళ్ళీ మూసుకుని పది రూపాయల నోటు ఆవిడ మీదికి గిరాటేసి లోపలికి ఫో అన్నాడు కంపరంగా

తిప్పుకుంటూ వంట గదిలో కెళ్ళిపోయింది వంట మనిషి

స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు బాగవతార్ ఆకలితో కడుపు నకనకలాడుతోంది అంత కాండ జరిగాక వంటమనిషిని టిపిన్ కావాలని అడగలేక పోయాడు ఆవిడంత ఆవిడ పెడితే తినేవాడే కాని ఆవిడ బాగవతార్ మొహం చూడలేనట్టు – బాగవతార్ ఏదో మహాపరాదం చేసినట్టు అతన్ని చూడగానే మొహం తిప్పుకొంటోంది ఆ గొడవ పడలేక ఆకలి కడుపుతోనే బయటికి నడిచాడు ఎదేనా హోటల్‌కి వెళ్దామనుకున్నాడు మొదట కాని తొందరగా మృదుల యెక్కడికెళ్ళిందో తెలుసుకోవాలి వీలైతే రెడ్ హాండెడ్‌గా పట్టుకోవాలి ఆ రోజు డ్రైవర్ సెలవడిగితే యిచ్చేసాడు అందుకని కారు తనే డ్రైవ్ చేసుకుంటూ మొదట మింగియార్ ఇంటికి బయలుదేరాడు సరూర్‌నగర్ దాటాక సిటీ ఔట్ స్కర్ట్స్‌లో వుంది మింగియార్ బస చేస్తున్న బంగళా అక్కడంతకు ముందే ఎవరో సన్యాసి శిష్యులతో వుంటున్నాడట మింగియార్ కూడా వాళ్లతో కలిసి వుంటున్నాడు వీళ్లంతా కలిసి ఏవో పూజలు చేస్తారని చుట్టుప్రక్కల వాళ్ళు చెప్పుకుంటారు మింగియార్ ఇంటి ముందు అప్పటికే ఎన్నో కార్లు స్కూటర్లు పార్క్ చేసి వున్నాయి

ఈ ఇంట్లో ఏదేన పార్టీయా? అనుకున్నాడు బాగవతార్ కారుని ఇంటికి కొంచెం దూరంలో పార్క్ చెయ్యవలసి వచ్చింది చోటు లేక కాలింగ్ బెల్

జరిగిన కథ – 2 స్వేచ్ఛా జీవి మృదుల కర్నాటక సంగీత విద్వాంసుడు భాగవతార్‌ను తనంత తానే కోరి పెళ్ళి చేసుకుంటుంది. తన కంటె ఇరవై సంవత్సరాలు చిన్నదైన మృదుల ప్రవర్తన బాగవతార్‌కు విచిత్రంగా కనబడుతుంటుంది ఆమె మరి ఎవరినో ప్రేమిస్తున్నదేమోనని అనుమానిస్తాడు ఒకరోజు కచేరీ తర్వాత ఏండెటో ఇంటికి వెళ్ళి వెతకబోయి బంగపడతాడు

నొక్కాడు నౌకరు తలుపు తెరిచాడు హాయి ఖాళీగా వుంది

కూర్చోండి అన్నాడు నౌకరు

కూర్చుని చుట్టూ చూస్తూ ఎవరూ లేరా? అడిగాడు బాగవతార్ నౌకరు మాట్లాడలేదు

మింగియార్‌గారు లేరా? మళ్ళీ అడిగాడు

నౌకరు అనుమానంగా చూస్తూ మీరెవరు అన్నాడు

మృదుల అని ఆగిపోయాడు బాగవతార్

మృదుల భర్తని అని చెప్పబోయాడు ఎందుకంటే మింగియార్ మృదుల ద్వారానే పరిచయమయ్యాడు ఇంటికొచ్చినా మృదులతోనే ఎక్కువగా మాట్లాడేవాడు

తనొక పెద్ద సంగీత విద్వాంసుడు మరొకరి భర్తగా పరిచయం చేసుకోవటం అవమానంగా తోచింది నౌకర్లో గమ్మత్తైన మార్పు కనిపించింది అతడొక్క మాట మాట్లాడకుండా ముందుకు కదిలి గోడకి అల్మారాలా కనపడుతున్న ఒక తలుపు తెరిచి లోపలికెళ్ళమని సౌంజ్ఞ చేశాడు బాగవతార్ లోపలికడుగు పెట్టగానే తలుపు మూసుకుపోయింది డిమ్‌గా వుంది లోపల లైటు దిగువన మెట్లున్నాయి బాగవతార్ ఆశ్చర్యపడుతూ మెట్లు దిగి కిందికెళ్ళాడు కింద విశాలమయిన హాలు అక్కడ ఆడ మగ చాలామంది సర్క్యులర్‌గా కూర్చుని వున్నారు ఆడవాళ్ళ ముఖాలకి మేలి ముసుగులు మగవాళ్ళ కళ్ళమీద నల్ల గుడ్డలు వున్నాయి ఎవరు మట్టుకు వాళ్ళే తమ ముఖం ఎదుటివాళ్ళు గుర్తు పట్టకుండ జాగ్రత్తలు తీసుకున్నట్టున్నారు బిత్తరపోయి వాళ్ళందరినీ వింతగా చూడసాగాడు కళ్ళ చుట్టూ నల్లటి గుడ్డ కట్టుకున్న పొడుగాటి వ్యక్తి బాగవతార్ ముందుకొచ్చి –

ఎవరు మీరు? ఇక్కడికెలా వచ్చారు? అన్నాడు కరుగ్గా

ఈయన నాకు తెలుసు అలాగే కళ్ళకి గంతలు కట్టుకున్న మరో పొడుగాటి వ్యక్తి అన్నాడు

మీరు రమ్మన్నారా ఈయనని మొదటి వ్యక్తి అడిగాడు

లేదు లేదు ఎందుకొచ్చాడో? ఎలా వచ్చాడో నాకూ అర్ధం కావడంలేదు అయితే యివాళ నేను ఏర్పాటు చేసిన మన పాస్‌వర్డ్ యీయన బార్య పేరు

ఉలక్కిపడ్డాడు బాగవతార్ విదేశీయుడు – ముసుగుల్లో గుమికూడిన మనుష్యులు– గదిలో– బయటికి కనిపించని రహస్య ద్వారం– పాస్‌వర్డ్– మృదుల పేరు వీళ్ళంతా ఎవరు? విదేశీ గూడచారులా?– గాంగ్‌స్టర్సా– స్మగ్లర్సా – వీళ్ళతో మృదుల ఎలా కలిసింది– ఆ పేరునే పాస్‌వర్డ్‌గా ఉపయోగించేటంత ప్రాముఖ్యం యీ గ్రూప్‌లో మృదులకుందా?

నేను మృదుల భర్తని అని చెప్పబోయి మృదుల అని ఆగిపోయాడు అందుకే తలుపులు తెరచుకున్నాయి లేకపోతే ఇలాంటి రహస్య లోకం ఒకటి వుందని తనకి తెలిసేదే కాదు

వీళ్ళంతా ఎవరు? శాసిస్తున్నట్టు అడగాలనుకున్నాడు కాని గాంగ్‌స్టర్సేమోనన్న అనుమానంతో గొంతు వొణికి బెదురుతున్నట్టు వచ్చాయి మాటలు

రెండోసారి మాట్లాడిన పొడుగాటి వ్యక్తి ముందుకొచ్చి చనువుగా బాగవతార్ భుజంమీద చెయ్యి వేసాడు అతని ముఖంలోకి చూడాలనుకొని



## రేపటి మహిళ

నల్లని గంతలు కట్టిన కళ్ల వైపు చూడ్డానికి బయం తోచి ముఖం తిప్పుకున్నాడు

వీళ్లంతా ఎవరో నేను మీకు చెప్పలేను మాలో మాకే ఎవరెవరో తెలియదు ఐ యామ్ సారీ' అన్నాడు కళ్ల గంతల మనిషి

ఇదంతా దేనికీ - ఇంత రహస్యంగా సమావేశం కావలసిన అవసర మేమొచ్చింది

రహస్యమని మీరే అంటున్నారుగా అందరికీ చెప్పేదైతే రహస్యమెందు కవుతుంది?

నా బార్య ఇక్కడుంది గనక, మీ అందరి వివరాలు తెలుసుకునే అదికారం నాకుంది

మీ బార్యా? - అంటే మృదులగారా? ఆవిడిక్కడున్నారని ఎవరు చెప్పారు మీకు?

మీ పాస్‌వర్డ్ - మృదుల

అదా - మేమూ రోజూ ఒక కొత్త పాస్‌వర్డ్ కాయిన్ చేస్తూంటాము నిన్న సాయంత్రం మృదుల గారిని హాస్పిటల్‌లో చూసాను ఆ పేరు గుర్తుండి అదే యివాళ పాస్‌వర్డ్‌గా చేసుకున్నాము అంతేగాని మృదులగారికి మా సంఘానికి ఏ సంబందంలేదు

నిన్న సాయత్రం మృదులని హాస్పిటల్‌లో చూసారా? అక్కడికెందు- కెళ్లింది?

సారీ' ఆవిడ వ్యక్తిగత విషయాలు నాకు తెలియవు అడిగే అలవాటు లేదు

నేన్నమ్మను వీళ్లల్లో తప్పకుండా మృదుల వుంది ఇదేదో తేల్చుకోకుండా నేనిక్కడ్నించి కదల్ను

సారీ సర్' మీరు మృదుల బర్తగారనే గౌరవంతో ఇప్పటివరకు నమ్రతగా మాట్లాడాను ఒకవేళ మృదులగారు ఇక్కడవున్నా మాకు తెలియదు- తెలిసికోవడానికి ప్రయత్నించం - మరొకర్ని తెలుసుకోనియ్యము

నేను పోలీసు రిపోర్టిస్తాను ఇక్కడేదో గూడుపుఠాణీ జరుగుతోందని

కళ్లగంతల వ్యక్తి వెటకారంగా నవ్వేడు

మిస్టర్' తెలుగుదేశంలో పుట్టి పెరుగుతూ మరీ ఇంత అమాయకులేమిటి మీరు? కళ్లకి గంతలు కట్టుకుని ముఖం ఆనవాలు తెలియకుండా వున్న ఇక్కడి పెద్దమనుష్యుల్లో ఎవరు ఎంత ప్రముఖులో మీకేమైనా తెలుసా? ఆగంతల వెనక ఒక పోలీసాఫీసరే వున్నా ఆశ్చర్యపోనక్కరలేదు మీరు తొందరపడి రిపోర్టులాంటిది చేస్తే - నాకేం ప్రమాదం లేదు గాని మిరే రిపోర్టిచ్చి యింటికెళ్లేలోగా ఏదో ఒక నేరంమీద జైలుపాలు కావచ్చు

బెదిరిపోయాడు బాగవతార్ వేదిక మీద కూర్చుని రాగాలాపన చేస్తున్నప్పుడు ఎంత ఆత్మవిశ్వాసంతో వుంటాడో మిగిలిన సమయాల్లో అంత పిరిగ్గా ఉంటాడు అందులోనూ దెబ్బలాటలు - కోర్టులు - కేసులు అంటే అతనికి తగని బయం అతడు పబ్లిక్ ఫిగర్ కేసు గొడవల్లాంటివేవైనా వస్తే ఆ విషయం క్షణాల్లో పేపర్లకెక్కేసి ఇమేజి పాడైపోతుంది

రిపోర్టు మాట వదిలేసి మేలి ముసుగుల్లో వున్న ఆడవాళ్ళని పరీక్షగా చూడసాగాడు కొందరు ఇబ్బందిగా కదిలారు

కి క్ హిమ్ అవుట్ కీచుగా అరిచింది ఒకావిడ

కళ్లగంతల్లో తెల్లటి అంగరఖాలల్లో వున్న యిద్దరు మగవాళ్ళు బాగవతార్ చెరో పక్కకి వచ్చి అతడి రెండు చేతులు పట్టుకుని మెట్ల వైపు నడిపించారు

నో' నో' లీవ్ మీ' నన్నొదిలేయండి మృదులను పంపేయండి - నేనూర్కోను - ఐ విల్ కిల్ యూ అని అరుస్తూ గింజుకోసాగాడు బాగవతార్ అతడి మాటలేమాత్రం లక్ష్యపెట్టకుండా ఒక రకంగా మోసుకుంటూ మెట్లెక్కించి హాల్లోకి తోసేసి తలుపులు లోపల బోల్టు పెట్టేసుకున్నారు దబుక్కున హాల్లో కూలబడ్డాడు బాగవతార్ నవ్వాపుకోలేక కిసుక్కున నవ్వాడు బయటవున్న జవాన్

మీరంతా మనుష్యులతో బంతులాడుతున్నారేంటండీ , అడిగాడు

బాగవతార్ వాడి వైపు గుఱ్ఱుగా చూసి ఏ సమాదానం చెప్పకుండా మళ్ళీ పైకి అల్మరాలా కనిపించే ద్వారం తెరవడానికి ప్రయత్నించాడు ఎంత ప్రయత్నించినా అది తెరుచుకోలేదు

ఏయ్' ఈ తలుపు తెరు , అన్నాడు నౌకరుతో నౌకరు మాట్లాడలేదు

ఎలా తెరుచుకుంటుందీ తలుపు ?

నేను లోపలికి అర్జంటుగా పోవాలి

ఏం జరుగుతోదిక్కడ వీళ్లంతా ఎవరసలు మృదులనేం చేసారు

ఇలాంటిది యింకో ద్వారం వుందా?

ఇదుగో ఈ పది రూపాయలు తీసుకో , జేబులోంచి పది రూపాయలు నోటు తీసి వాడికిచ్చాడు అందుకుని వాడు జేబులో పెట్టుకున్నాడు

ఇప్పుడు చెప్పు ఏం జరుగుతోందిక్కడ?

నిన్నూ చేయెత్తి కొట్టబోయాడు ఆ చేతిని గట్టిగా పట్టుకున్నాడు నౌకరు బాదతో విలవిల్లాడిపోతూ, ఒదులు అని అరిచాడు

నోర్మూసుకుని ఇక్కడ్నుంచి పోతావా?

పోతాను పోతాను

* * * * * * * * * *

కారులో స్టీరింగ్ ముందు కూర్చున్న బాగవతార్‌కి కొన్ని నిముషాలు బుఱ్ఱ పనిచేయలేదు మృదుల తననెందుకిలా ఆడిస్తోంది? ఇంతకీ ఎవరు మృదుల ప్రియుడు? మెరుపులా ఒక ఆలోచన తోచింది ఆ యింటి ముందు నుంచి కారు కొంత దూరం నడిపించి ఒక వారగా పార్క్ చేసి ఆ యింటి వేపే చూస్తూ కూర్చున్నాడు ఇంట్లోవాళ్ళు బయటికొచ్చేసాక ముసుగులు తీస్తారు కదా? అప్పుడు మృదులని పట్టుకోవచ్చు

బాగవతార్ ఊహించినట్టే ఆ ఇంట్లోంచి ఒకరి తరువాత ఒకరుగా బయటికొచ్చి సందు మలుపు తిరగ్గానే ముసుగులు తీసేస్తున్నారు చాలామంది స్కూటర్లలోను, కార్లలోను వెళ్తున్నారు అయిడెంటిటీ బయటపడకుండా ఉండడానికి కాబోలు ఒకరు బయటికొచ్చిన పది నిముషాల తరువాత గాని మరొకరు రావటంలేదు ఒక్కొక్కళ్ళని పరిశీలనగా చూస్తూ దాదాపు రెండు గంటలు కూర్చున్నాడు కొంతమంది కారుల్లో వెళ్ళిన వాళ్ళ ముఖాలు కనపడలేదు కాని మృదుల కాదని గుర్తించగలిగాడు కార్లో గిరజాల జుట్టువాడు దూసుకుపోయాక అరగంట గడిచినా ఎవరూ వెళ్ళలేదు అందరూ వెళ్ళిపోయి వుంటారు మృదుల ఇక్కడ లేదన్న మాట లేక తన కంట్లో కారం కొట్టి మాయమైందా? ఏమో అంతా ఇంద్రజాలంలా వుంది మృదుల కోసం



# గోద్రెజ్ వారి కొత్త సబ్బు-ఫే
# పూలరాసులలో జలకాలాటలాడిన అనుభవం.

రూ.3.75*




ఫే...గోద్రెజ్ వారి కొత్త సబ్బు.

ఫే...దీనిలో వుంది అధిక నురుగునిచ్చే ప్రత్యేక పదార్థం ఎక్స్ఎల్ఎ. ఇది మీకిస్తుంది ఉప్పు నీటిలో కూడా మెత్తటి నురుగు.

ఫే...రండి, చాలా సమయం నిలిచి వుండే పూల-పరిమళాలు వెదజల్లే మృదువైన 'ఫే'తో స్నానం చేయండి.

ఫే...దీంతో స్నానం...పూల రాసులలో జలకాలాటలాడిన అనుభవం.

* స్థానిక పన్నులు అదనం. బరువు 75 గ్రా

గోద్రెజ్

Enter

# రేపటి మహిళ

తరచుగా యింటికొచ్చే రెండవ వ్యక్తి అనంగ్ ఒకసారి అతని గదికి కూడా వెళ్ళి చూసొస్తే

అనంగ్ తల్లిదండ్రులు ఎదో పల్లెటూర్లో వుంటున్నారు అతనికింకా ఎళ్ళికాలేదు బి కామ్ పాసై ఉద్యోగం కోసం వెతుక్కుంటూ నవలలు కథలు రాస్తున్నాడు రచయితగా పేరు సంపాదించుకున్నాడు శృంగారానికి సంబందించిన కథలు బాగా రాస్తాడని అబిమానులు చెప్పుకుంటారు

బాగవతార్ కారు పార్క్ చేసి అనంగ్ గది ముందు కొచ్చేసరికి ఆడఎల్లల కిలారు నవ్వులు స్వాగతం పలికాయి గది తలుపులు వేసి లేవు పిల్లిలా నడుచుకుంటూ లోపలికెళ్ళాడు గతుక్కుమన్నాడు ఇంట్లో మృదుల గదిలో స్టాండ్స్ మీద వరసగా వున్న ప్లాస్టిక్ ముఖాలన్నీ అక్కడే సజీవంగా తిరుగు తున్నట్లనిపించింది ■ గది చిన్నది ఒ క మంచం ఒక కుర్చీ ఒక టేబిల్ ఇవే వున్నాయి ప్లాస్టిక్ ముఖాలు తొడుక్కున్న వాళ్లంతా ఆడఎల్లలే ఒకమ్మాయి కుర్చీలో కూర్చుంటే మరో నలుగురు కుర్చీ చేతుల పైన కూర్చున్నారు మరో పదిమంది టేబిల్ మీద ఇరుక్కుని కూర్చున్నారు

మరో డజనుమంది మంచంమీద ఒకళ్ల మీద ఒకళ్లు పడుతూ సర్దుకున్నారు బాగవతార్‌ని చూడగానే మంచం మీద కూర్చున్న అనంగ్ లేచి మీరా! రండి సారీ! మిమ్మల్ని కూర్చోబెట్టడానికి యిక్కడ చోటులేదు ఈ ఆడపిల్లల మద్య సర్దుకుంటానంటే నాకభ్యంతరంలేదు అన్నాడు

వీళ్లంతా ఎవరు?

నా పాన్స్

ఆ ప్లాస్టిక్ ముఖాలెందుకు?

వీళ్లకి తామెవ్వరో నాకు తెలియడం యిష్టంలేదట అందుకని యిలా ప్లాస్టిక్ ముఖాలు తొడుక్కొచ్చారు తమ విషయం బయటపడనంత వరకు ఎం చేసినా పరవాలేదని వీళ్ల అబిప్రాయం అఫ్‌కోర్స్ నిజంకూడా అంతేననుకోండి సమాజం కోసం కాకపోతే నీతి నియమాలనేవి ఎవడిక్కావాలి?

వీళ్లెవరో తెలుసుకోవాలని వుండదా మీకు?

ఉండదు వీళ్ల ముఖాలతో నాకేం పని?

గుటక మింగాడు బాగవతార్ ప్లాస్టిక్ ముఖాలు తొడుక్కున్న అమ్మాయిలు నిర్భయంగా – నిస్సంకోచంగా విరగబడి నవ్వేరు

మన పూర్వకాలం నుంచి ఇలాంటి ఆచారాలు వుండేవండి రెడ్డి రాజుల కాలంలో వసంతోత్సవంలో ఆడ మగ తామెవ్వరో తెలియకుండా మేలి ముసుగులతో విశృంఖలంగా సరససల్లాపాలు జరుపుకొనేవారట!

అదృష్టవంతులం ఈ కాలంలో అలాంటివి లేవు

అదృష్టవంతులమే! ఈ కాలంలోనూ అలాంటివి వున్నాయి మరో రూపంలో

గుటక మింగాడు బాగవతార్

ఏదేనా పని మీద వచ్చారా? అడిగాడు అనంగ్

బాగవతార్ రెండు నిముషాలు మాట్లాడలేదు అమ్మాయిలనందరినీ పరిశీలనగా చూస్తూ నిలబడ్డాడు మొహం తెలియకపోయినా శరీరాన్ని బట్టి మృదులని గుర్తు పట్టగలనేమో – అనుకున్నాడు అక్కడమ్మాయిలందరూ చీరల్లో వున్నారు అతడు మృదులని జీన్స్‌లోను – పాంట్ బ్లౌజ్‌లలోనూ తప్ప – చీరలో ఎప్పుడూ చూడలేదు పెళ్ళిలో తప్ప చీరలో ఎలా వుంటుందో వూహించడం కూడా అతనికి సాధ్యం కావడంలేదు బాగవతార్ అలా చూస్తోంటే ప్లాస్టిక్ కోతి మొహం తొడుక్కున్న అమ్మాయి నాలుక బయటికి జాపి వెక్కిరించింది కుక్క మొహం అమ్మాయి మొరిగి బయపెట్టింది బాగవతార్ ఒక అడుగు వెనక్కి వేసాడు

ఎదేనా పని వుంటే చెప్పండి పరవాలేదు చెప్పండి అన్నాడు అనంగ్

మృదులతో చిన్న పని వుంది ఇంట్లో లేదు ఇక్కడికొచ్చిందేమోనని నసుగుతూ అన్నాడు

అమ్మాయిలంతా ఒక్కపెట్టున గొల్లున నవ్వారు

పంది మొహం అమ్మాయి ముందుకొచ్చి బాగవతార్ బుజం మీద చెయ్యి వేసి డాలింగ్! నాకోసం మరీ యింత బెంగపడిపోవడం ఎవయినా బాగుందా? అంది

ఎలుగుబంటి మొహం తొడుక్కున్న ఆడఎల్ల గద్దిస్తున్నట్లు ఎయ్! ఇక్కడికెందుకొచ్చావు' ఇక్కడికి ఆడఎల్లలొస్తారు వాళ్లతో స్నేహం చేసుకుందాం – అని ఆశతో కదూ! ఎన్నాళ్ళ నుంచి వేస్తున్నావు ఇలాంటి వెదవ్వేషాలు? అని పోట్లాటకి దిగింది

డ్రాగన్ మొహం తొడుక్కున్న అమ్మాయి వయ్యారంగా బాగవతార్ దగ్గరికి నడుచుకుంటూ వచ్చి హే! ఆర్యపుత్ర! హే ప్రాణ ప్రియా! మీ పాద దాసనైన నన్ను ఇట్లనుమానింప దగునా? ఇట్లనుమానించుట కంటే మీ చేతులతో మీరే నా ప్రాణము తీయుడు మరు జన్మమున మీకే బార్యనై ఇట్లే అనుమానింప బడునట్లు ఆశీర్వదింపుడు అంది

బేతాళుడి మొహం తొడుకున్న అమ్మాయి హూ! అని ఉరిమి –

ఓరి! బ్రష్టా! నన్నునుమానిస్తావుట్రా! ఇప్పుడే కోర్టులో నీ మీద పరువునష్టం దావా వేసి నష్ట పరిహారం వసూలు చేస్తాను ఆడదంటే నీ చేతిలో ఆటబొమ్మను కున్నావా? అని కసిరింది

తగినంత కారణం లేకుండానే ఖంగారు పడిపోయే బాగవతార్‌కి తల గిఱ్ఱున తిరిగినట్లై మంచంమీద కూలబడ్డాడు అమ్మాయిలంతా చప్పట్లు చరుస్తూ ప్రాణ ప్రియా! డాలింగ్! స్వీట్ హార్ట్ అనీ బ్రష్టా! చవటా – మూర్ఖాగ్రేసరా – అనీ నోటికొచ్చిన ముద్దు పేర్లతో బాగవతార్‌ని ఎలుస్తూ సా పా సా అంటూ బాగవతార్ పాడే స్టైల్ ఇమిటేట్ చేస్తూ గదంతా హోరెత్తించేశారు

(ఇంకా ఉంది)







# వి. పి. సింగ్ కవిత్వం!

కేంద్ర ఆర్థిక రక్షణ శాఖల మాజీ మంత్రి శ్రీ విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ కాకలు తీరిన రాజకీయ నాయకుడిగా అందరికీ తెలుసు కానీ కవిగా కూడా ఆయన సుప్రసిద్ధులన్న విషయం ఎంతో మంది తెలియదు విశ్వనాథ్ కలంపేరుతో ఆయన హిందీలో చాలా కవితలు రాసారు ఆమధ్య హిందీ వారపత్రి ధర్మయుగ్ సంపాదకుడు ఏర్పాటు చేసిన కవి సమ్మేళనంలో శ్రీ వి ఎ సింగ్ ముఖ్య అతిథిగా పాల్గొ మిగతా కవులతో పాటు తాము కూడా తమ కవితలని చదివారు అవి ధర్మయుగ్ లో పడ్డాయి ఇటీవల సింగ్ హైదరాబాద్ వచ్చినప్పుడు వాటి అనువాదానికి అనుమతి అడిగితే అనుమతి అడగాల్సిన అవసరం దేనికి? నేనే మీవాణ్ని అయినప్పుడు కవితలన్నీ మీవే! నిరభ్యంతరంగా చేసుకోండి అన్నారాయన వాటిలో కొన్నిటిని ఇక్కడ వేస్తున్నాము (సం

## దేవుడు

దేవుడంతటా వున్నాడు
కనుకనే –
మనసైనప్పుడల్లా
అతడ్ని పిడికిట్లో బిగిస్తున్నాను
నీవు కూడ అలాగే చేయొచ్చు
రెండు పిడికిళ్ళలో వున్న
దేవుళ్ళలో ఎవరు గొప్ప?
చెప్పాలంటే
ఎవరి పిడికిలి గట్టిదో అతడే గొప్ప"

## ఆధారం లేక...

ఆధారం లేక దొంగనవుతున్నా
కానీ
ఈ నిండు బజారులో దేన్ని
దొంగిలించను?
ఇక్కడ పేర్చిన వస్తువులివే –
వీటినే –
అర్పించుకొని
నిస్సహాయుడనైపోయాను!

## ఎన్వెలప్

సందేశం మీది
చిరునామా వారిది
ఇద్దరి నడుమ
నేనే కదా చిరిగేది"

## ఖరీదు లేనివాణ్ణి

నీవేం కొనగలవు నన్ను?
నిజానికి
నేను ఖరీదు లేనివాడిని

## తేడా

ఇది కటువైన కావ్య పీఠం
అది వూగే తరుశాఖ
తేడా అల్లా –
దీని పైనేను
దానిపై ఎగిరిపోయే పక్షులు"

హిందీ మూలం విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ – అనువాదం విద్యారణ్య

# ఆకాశయానమా, మద్యపానమా?



కేంద్ర ప్రభుత్వం లోని పౌర విమానయాన శాఖ మంత్రి జగదీష్ టైట్లర్ చాలా ఆందోళనలో ఉన్నట్టు తెలుస్తున్నది పెద్ద ఎత్తున డబ్బు ఇమిడి ఉన్న ఎయిర్ బస్ కొనుగోలు వ్యవహారంలో అవకతవకలు జరిగాయనే ఆరోపణ వచ్చినప్పటి నుంచి ఆయన గందరగోళంలో మునిగి పోయారు రాజీవ్ గాంధీకి సన్నిహితులయినటు వంటి అమితాబ్ బచ్చన్ అరుణ్ సింగ్ల రాజీనామాలు అజితాబ్‌పై విచారణకు ఆదేశం జరిగిన తర్వాత తన పైన కూడా రాజీవ్ గాంధీ ఇటువంటి చర్యలు తీసుకో గలరని టైట్లర్‌కు అర్థమైంది ఈ స్థితిలో తన స్థానాన్ని పదిల పరచుకోవడం కోసం ఆయన కొందరు జర్నలిస్టులను మంచి చేసుకుంటున్నారు వారికి ఉచితంగా దేశ, విదేశ యాత్రలకు అవకాశం కల్పిస్తున్నారు జూలై 21న ఒక డజను మంది పాత్రికేయులను ఢిల్లీ నుంచి నాలుగు రోజుల సిడ్నీ యాత్రకు తీసుకు వెళ్లారు వారి ఖర్చులన్నీ ఎయిర్ ఇండియా' భరించింది అట్లాగే బంగ్లాదేశ్ రాజధాని ఢాకాకు కొత్తగా ఒక విమానాన్ని ప్రవేశపెట్టినప్పుడు కూడా

పాత్రికేయులకు ఘనమైన ఆతిథ్యం లభించింది తన వంతు కర్తవ్యంగా ఇండియన్ ఎయిర్ లైన్స్ కూడ కొందరు ఎంపిక చేసిన పాత్రికేయులను మద్రాసు – సింగపూర్ విమాన సర్వీసు ప్రారంభోత్సవానికి సింగపూర్‌కు తీసుకు వెళ్ళింది మంత్రి మహోదయుల ఆదేశాన్ని పాటించడంలో చివరికి వాయుదూత్ కూడా వెనుకంజ వేయలేదు వారు న్యూఢిల్లీ – సిమ్లా విమానం ప్రారంభోత్సవ సమయంలో మంత్రిగారి ఆశ్రితులైన పాత్రికేయులను సిమ్లాకు తీసుకు వెళ్లారు ఇటువంటి చౌకబారు ఎత్తుగడలతో సంక్షోభాన్ని తప్పించుకోవడం సాధ్యమా అని కొందరు ప్రశ్నిస్తుండగానే టైట్లర్ గురించి మరొక వివాదం పత్రికల కెక్కింది ఆయన, ఆయన పరివారం జూన్ 26–28 ల్లో ఒక ఎయిర్ లైన్స్ అధికారిక వ్యవహారంపై బొంబాయి వెళ్ళి హోటల్ ఒబెరాయ్ టవర్స్‌లో బస చేసినప్పుడు ఆయన సేవించిన మద్యం ఖరీదు కేవలం మూడు వేల రూపాయలట ఐదువేల రూపాయల అద్దె ఉన్న గదితో పాటు 12000 రూపాయల ఖరీదయినటు వంటి మినీ మద్యపాన శాలతో కూడిఉండే గదిని కూడా ఆయన ఆ రెండు రోజులు తన అధీనంలో ఉంచుకున్నారట ఆయన పరివారం దిగిన నాలుగు గదుల అద్దె రు 4000లు అయిందట ఆ రెండు రోజుల్లోనూ ఉదయం 7 గంటల నుంచి 10 గంటల మధ్య విస్కీ, కాగ్నాక్, కంపారి జిన్, వోడ్కా వంటి ఖరీదైన మద్యాలు విరివిగా ఖర్చయ్యాయట హోటల్ వాళ్ళు వేసిన బిల్లును మంత్రి గారు ఖండించారను కోండి




# దౌత్యంలో అసత్యం నిషేధమా?



అమెరికా ఒక వైపున, ఎడతెగని యుద్ధంలో మునిగి ఉన్న ఇరాన్ మరో వైపున, తమ దేశ ప్రభుత్వాన్ని కూలదోయటానికి ప్రయత్నిస్తున్న నికరాగువన్ కాంట్రా సైనికులు ఇంకొక వైపున రంగులు దిద్దుతున్న రసవత్తర వర్తమాన అంతర్జాతీయ నాటకంలో ఒక అంకం పూర్తి కావచ్చింది ఈ అంకంలో తన పాత్రను అద్భుతంగా పోషించారని పొగడ్తలందుకుంటున్నారు ఆలివర్ నార్త్ ఇరాన్ ప్రభుత్వంతో

ఎటువంటి లావాదేవీలు ఉండగూడదని అమెరికన్ ప్రభుత్వానికి గతంలో ఒక నిబంధన ఉండేది ఈ నిబంధనను ఉల్లంఘించి, టెహరాన్‌లో బందీలుగా ఉన్న అమెరికన్ పౌరులను విడుదల చేయించడం కోసం ఇరాన్‌కు అమెరికా ఆయుదాలు అమ్మిందని ఒక ఆరోపణ వచ్చింది ఈ అమ్మకాలలో వచ్చిన లాభాలను నికరాగువాలోని కాంట్రా అనే సైనిక బలగాలకు అందజేశారని మరొక ఆరోపణ నికరాగువన్ ప్రజలు అక్కడి నియంత సొమొజాను కూలదోసి 1979 లో విప్లవ ప్రభుత్వం స్థాపించుకున్నారు ఈ జాతీయ ప్రభుత్వాన్ని కూలదోసి, మళ్ళీ సొమొజాకు పాలన కట్టబెట్టేటందుకు ప్రయత్నిస్తున్న సైనికులను కాంట్రాలు అంటారు కాంట్రాలకు మద్దతు ఇవ్వాలని అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్ వాదిస్తుండగా, అటువంటి చర్య కూడదని అమెరికన్ కాంగ్రెస్ భావిస్తున్నది ఇరాన్ విషయంలో నిబంధనలు ఉల్లంఘించారని, కాంట్రాలకు రహస్యంగా నిదులు అందజేశారని వచ్చిన విమర్శలను రీగన్ మొదట ఖండించారు కాని చివరికి ఆయనే జాన్‌టవర్ అధ్యక్షతన ఈ ఆరోపణ ను విచారించడానికి ప్రత్యేక సంఘాన్ని నియమించారు ఆ సంఘం ముందుకు వచ్చినటువంటి సాక్ష్యాదారాల ప్రకారం, కాంట్రాలకు ఆ నిదులు ఇచ్చేటందుకుగాను నార్త్, జాతీయ భద్రతా వ్యవహారాల సలహాదారు జాన్ పాయిండెక్స్టర్, సిఐఎ చట్టాలను ఎట్లా అతిక్రమించారో బైట పడింది. ఇరాన్‌కు ఆయుదాల అమ్మకం విషయంలోనూ, ఆ లాభాలను కాంట్రాలకు బదలాయించడంలోనూ నార్త్ చాల ముఖ్యమైన నిర్ణయాలను తీసుకున్నారని ఆ సంఘం నిర్ధారించింది ఆయన, ఆయన సహచరులు అమెరికన్ ప్రభుత్వ పరిధికి బైట పని చేశారని, వాళ్ళ చర్యలను విమర్శనాత్మకంగా పరిశీలించే అధికారం ఎవరికీ లేకపోయిందని సంఘం అభిప్రాయపడింది అందువల్ల నార్త్ తన తప్పుడు లక్ష్యాలను కూడా సక్రమంగా సాధించలేకపోయారని, ఒక్క బందీ కూడా విడుదల కాకుండానే ఆయుధాల అమ్మకానికి సిద్ధపడ్డారని, కాంట్రాలకు నిదులు అందజేసిన విషయంలో అవాస్తవాలు చెప్పి ఉద్దేశ్యపూర్వకంగా సమాచారం దాచడానికి ప్రయత్నించారని సంఘం భావించింది ఈ సంఘం నివేదిక తర్వాత కాంగ్రెస్ నియమించిన కమిటీల ముందు తన వాఙ్మూలాన్ని వినిపించడానికి ఆలివర్ నార్త్ ఒప్పుకున్నారు

నాలుగు రోజుల పాటు వరుసగా సాగిన ఆయన వాఙ్మూలాన్ని అమెరికన్ టి వి లో యదాతథంగా ప్రదర్శించారు ఐదు కోట్ల మంది తిలకించిన ఈ చరిత్రాత్మక సాక్ష్యంలో నార్త్ అనేక రకాల జనాకర్షక అభినయాలు ప్రదర్శించారు 43 సంవత్సరాల వయసు గల ఈ సైనికాదికారి తన మొత్తం సాక్ష్యాన్ని నాకు ఆ అధికారం ఉన్నదనుకున్నాను నాకిప్పుడు గుర్తులేదు అనే రెండు భూమికల మీద నడిపించారు మొత్తం మీద సుశిక్షితుడైన సైనికుడిగా, అకలంక దేశభక్తునిగా తన దేశం కోసం ఏమి చేయడానికైనా సిద్ధపడిన వానిగా ఆయన సమర్థనలు ఆయనకు అనేక మంది అభిమానుల్ని సంతరించి పెట్టాయి తాను చేసిన పనులకు పైవారి ఆమోదం ఉన్నదని అంటూనే ఆయన అధ్యక్షుణ్ని మాత్రం ఆ ఆరోపణ నుంచి తప్పించారు అబద్ధాలు చెప్పడం నాకంత సులభమేమీ కాదు కాని మనందరమ్మూ కూడ బతుకులకూ, అబద్ధాలకూ మధ్య భేదాను త్రాసులో పెట్టి తూఛవలసి ఉన్నది అన్నారు నార్త్ □




# పొగమంచు

## యం.వి.కిషన్

హోటల్ నుండి క్యారేజీ తేవడానికని వెళ్ళిన నారాయణ ఇంకా తిరిగి రాలేదు

వరండా మీద వాలుకుర్చీలో కూర్చుని స్టార్‌డస్ట్ తిరగేస్తున్న కార్తీక్ నారాయణ క్వార్టర్స్ వైపు చూశాడు

నీళ్ళ బిందెతో లోపలి కెళ్తూ కనిపించింది సీత!

అచ్చం ఆ నడక కూడా అదే! మరి కాస్త తెలుపయ్యుండి జడ గనక కాస్త పొట్టిదయ్యుంటే ఈమెకీ నర్మదకీ ఇంక తేడా లేనట్లే! మనిషిని పోలిన మనుషులుండటం విడ్డూరం కాదుగాని, అదాటుగా చూసి నర్మదేనేమో అని భ్రమ పడాల్సినంత దగ్గరి పోలికలున్న వ్యక్తి తనకే తారసపడటం అందునా అనునిత్యం తన కళ్ళముందే తిరుగాడుతూండటం ఎప్పటికప్పుడు వింతగానే అనిపిస్తూ ఉంటుంది కార్తీక్‌కి

కార్తీక్ ఆఫీసరు నారాయణ అతని దగ్గర పనిజేసే అటెండరు సీత అతని భార్య

ఆమెను చూసినప్పుడల్లా నర్మదను చూస్తున్నట్లే భావిస్తూ కాదు భ్రమ చెందుతూ అదో రకమైన తృప్తిని పొందుతూ ఉంటాడు కార్తీక్ ఒక్కోసారి బాధగానూ అనిపిస్తుంటుంది- నర్మదే గనుక బ్రతికుంటే ఈమెలానే ఇంచక్కా కాపురం చేసుకుంటూ ఒకళ్ళో ఇద్దరో ఎల్లల్తో కళకళ్ళాడుతూ ఉండేది కదా అని

నర్మద కార్తీక్‌కి ఒక్కగానొక్క చెల్లెలు రెండేళ్ళ క్రితం తన పద్దెనిమిదో ఏట ఓ బస్ ఏక్సిడెంట్‌లో హఠాన్మరణం పాలైందామె! ■ దుస్సంఘటన గనుక జరిగుండకపోతే అప్పటికి మరో ఆర్నెల్ల తర్వాత ఆమెకి పెళ్ళి కూడా అయ్యుండేది! సంబంధం కుదుర్చు కోవడం, పెళ్ళి పలానా అప్పుడు అని

అనుకోవడం కూడా జరిగిన్నై అప్పటికి కానీ విధి(వ్రాత)మృత్యువు ఆమెను వెదుక్కుంటూ వచ్చేసింది

నీ సీతలో నా చెల్లెల్ని చూసుకుంటూ తృప్తి పడుతున్నానని నారాయణతో చెప్పాలని ఎన్నో సార్లు అనిపిస్తూ ఉంటుంది కార్తీక్‌కి సీతను చెల్లెమ్మా అని పిలవాలని ఎంతో కోరిగ్గా ఉంటుంది కానీ ఎప్పటి కప్పుడు మనసుని అదుపులో పెట్టుకుంటూ ఉంటాడు

నిజానికి అలా బయటపడిపోవటం వల్ల అతనికి కలిగే నష్టమంటూ ఏదీ లేకపోయినా కార్తీక్ మాత్రం అందుకు సాహసించేవాడు కాదు! అదో రకమైన మనస్తత్వం! సెంటిమెంట్లకి అతనేం అతీతుడు కాక పోయినా, ఎక్కడుంచాల్సిన వారిని అక్కడే ఉంచాలన్నది అతని సిద్ధాంతం!

తన అటెండరు భార్యలో తన చెల్లెలి పోలికలుండటం కేవలం యాదృచ్ఛికం! ఆమెను చూసినపుడల్లా తనలో ఏదో ఊరట లాంటిది కలగడం – ఆమెలో తన చెల్లెలి పోలికలున్నాయి గనుక అత్యంత సహజం! అంత మాత్రాన ఆ సంగతి నారాయణకు గాని ఆమెకు గాని చెప్పి అయ్యో అలాగా సార్? అని సానుభూతి వాక్యాలు పలికించుకోవాల్సిన అవసరమేముంది?

తను ఆఫీసరు, నారాయణ అటెండరు అయితే గియితే ఏదైనా సమయం సందర్భాల్లో వాడి మీద తను జాలో, సానుభూతో చూపిస్తే తప్పులేదు గాని వాడు తన కేసి జాలిగా చూసేటటువంటి పరిస్థితిని ఏరికోరి కల్పించుకోవడం అవివేకం!

–ఈ రకంగా ఆలోచిస్తాడు కార్తీక్ అటెండర్లని ఆంతరంగికులుగా భావించే ఆఫీసర్లు బోలెడంతమంది! కానీ కార్తీక్ అందుకు పూర్తిగా వ్యతిరేకి! అదీగాక తనకింకా వివాహం కాలేదు ఒకవేళ అంతరాలను విస్మరించి తానా విషయం నారాయణతో చెప్పినా – వాడు దాన్ని నమ్మనూ

# పొగమంచు

వచ్చు లేదా విపరీతార్థాలు తీసి లేనిపోని అనుమానాలను సృష్టించుకోనూ వచ్చు! ఈ విధంగా కూడా సాగేవి కార్తీక్ ఆలోచనలు

సీత నీళ్ళ బిందెతో మళ్ళీ ఇంట్లోంచి బైటి కొచ్చింది ఎందుకో తల పైకెత్తి ఆఫీసరు గారి క్వార్టర్స్ వైపు చూసిన ఆమె – కార్తీక్ తననే పరకాయించి చూస్తూండటం గమనించి చటుక్కున తల దించుకుని వడివడిగా వెళ్ళిపోయింది నీళ్ళ పంపు దగ్గరికి

సార్!

నుదురు కొద్దిగా ఎత్తు! కళ్ళూ ముక్కూ మాత్రం డిటోనే!–సీతకీ నర్మదకూ మధ్య గల వ్యత్యాసాలాను బేరీజు వేస్తున్న కార్తీక్, నారాయణ పిలుపుతో ఆలోచనలకు స్వస్తి చెప్పాడు

ఏం నారాయణా, ఇంత లేటయ్యిందేం? అడిగాడు

ఎందుకో గాని ఇవ్వాళ సర్వర్లిద్దరూ నాగా పెట్టేశారట సార్! ప్రొప్రయిటరే అన్ని పనులూ చూసుకుంటున్నాడు అందుకని

సర్లె సర్లె అనేసాడు కార్తీక్ నారాయణింకా మాట పూర్తి చెయ్యకముందే

★ ★ ★ ★ ★

సాయంత్రం అయిదు గంటల వేళప్పుడు ఆరుబయట కూర్చుని ఆఫీసుకు సంబంధించిన ఫైలేదో వెరిఫై చేస్తున్నాడు కార్తీక్

అర్జంటుగా కొంత ఇన్‌ఫర్మేషన్ పంపించమంటూ ఆరోజు ఈవెనింగ్ టపాలో వచ్చిన తాఖీదుకు తెల్లారే సరికల్లా రిప్లయ్ సిద్ధం చేసి తీరాలన్న పట్టుదలతో ఇంటికి తేవాల్సి వచ్చింది ఆఫైల్‌ని చాలా ఇంపార్టెంట్ విషయం కావడం చేత ఆపనిని గుమస్తాల మీద ఒదిలెయ్యలేక పోయాడు ఫైల్‌లోని ఒక్కో కాగితం తిరగేస్తూ తనకు కావలసిన




చిత్రం దేవు దీక్షితులు

## నియంత పాలన

మనిషికో బోను పెట్టి,
నియంత పాలిస్తాడు!
తను పెట్టిన బోను
తన్ను ఎలిస్తే
ప్రజాస్వామ్యం వల్లిస్తాడు!

-అడిగోపుల వెంకటరత్నమ్

పాయింట్లు నోట్ చేసుకుంటున్న కార్తీక్ ఆ షీట్ కాస్తా గాలికెగిరి పోవటంతో కంగారు పడ్డాడు

గబాల్న లేచి దాన్నందుకో బోయాడు కానీ గాలి వేగం హెచ్చుటంతో అది కాస్తా అలా అలా తేల్తూ ఎగిరిపోసాగింది! దాని వెంట పడ్డాడు కార్తీక్! నారాయణ క్వార్టర్ ప్రక్కనే ఉన్న బంతి చెట్ల మీద పడి ఆగిపోయిందా కాగితం! దాంతో పాటే వెళ్ళిన కార్తీక్ నారాయణ ఇంట్లోంచి వినిపించిన మాటలకి – ముఖ్యంగా తన ప్రస్తావన రావడం వల్ల – ఓ చెవి నటు పారేసాడు

సీత అంటూ ఉంది! అవునండీ! మీ సార్ చూపులు నాకేంటో ఎబ్బెట్టుగా అనిపిస్తున్నాయ్! ఇంట్లో ఉన్నంత సేపూ – మీరు గమనించారో లేదో గాని మన క్వార్టర్ వేపే చూస్తా రాయన ముఖ్యంగా నేను నీళ్ళకి గట్రా బైటి కెళ్ళినపుడల్లా తినేసేలా చూస్తుంటాడు నాకేసి

నారాయణేమన్నాడో వినిపించ లేదు

నాకు చాలా బయంగా ఉందండీ! మనం ఈ క్వార్టర్స్‌లో ఉండొద్దు ఊళ్ళో మా అన్నయ్యోళ్ళ ఇల్లుందిగా – అక్కడి కెళ్ళి పోదామండీ!



ఏమోనే వారలాంటి వారని నేననుకోవట్లేదు నీ కెంచుకలా అనిపించిందో ఏమో గాని ఈ సారి నారాయణ కంఠం స్పష్టంగానే వినిపిస్తుంది

వాళ్ళ సంబాషణ పూర్తిగా వినాలన్న కుతూహలం కలిగినా, కార్తీక్ లోని సంస్కారం దాన్ని అణచివేసింది ఆ కాగితాన్నందుకుని చకచకా వచ్చేశాడు అక్కడ్నించి

ఎంతగా ప్రయత్నించినా తిరిగి పనిమీద ధ్యాస నిలపలేక పోయాడు కార్తీక్ అతని చెవుల్లో సీత అన్న ఆ మాటలు ప్రతిధ్వనిస్తూ గొంతులో ఏదో అడ్డు పడినట్లుగా గుండెలో ఏదో మంట పుడుతున్నట్లుగా అనిపించ సాగింది!

తను ఆమెలో తన చెల్లెల్ని చూస్తున్నాడు! కానీ ఆమె తన చూపుల్ని అపార్థం చేసుకుని తననో కామాంధుడిగా బావిస్తుంది!!

తలని ఎదురుగా ఉన్న టీపాయ్‌కి కొట్టుకోవాలనిపించింది కార్తీక్‌కి ఉన్నపళంగా వెళ్ళి అసలు సంగతి ఆ దంపతులిద్దరికీ చెప్పేసి మనో బారం దింపుకోవాలనిపించింది!

పేపర్ వెయిట్‌ని ఫైల్ మీద గిరగిరా తిప్పుతూ ఎంతో సేపు అలాగే కూర్చుండిపోయాడు కార్తీక్!

చిరు చీకట్లు క్రమ్ముకొస్తుండగా నారాయణ వచ్చి హెచ్చరించిన మీదట గాని అతను మళ్ళీ మనిషి కాలేకపోయాడు

★ ★ ★ ★ ★

మర్నాడు ఉదయం–

నారాయణా! ఆ అల్‌మైరాలో నా పోటో ఆల్‌బమ్ ఉంటుంది గాని ఇలా పట్రా! అన్నాడు కార్తీక్

ఇదేనా సార్? అంటూ అయిదు నిముషాల తర్వాత వచ్చాడు చేతిలో ఆల్‌బమ్‌తో నారాయణ

ఆఁ అదే అంటూ దాన్నందుకున్న కార్తీక్ – మొదట పేజీలోని ఓ పోటోని నారాయణ చూస్తుండగా కార్నర్లలోంచి తప్పించి,

చూసావుగా నారాయణా? మిగతా పోటోల్ని కూడా ఇలా జాగ్రత్తగా తప్పించి అన్నీ కలిపి ఈ డ్రాయర్లో పెట్టు ఎలా పడితే అలా ఉన్నాయ్ పోటోలన్నీ మళ్ళీ ఒక ఆర్డర్‌లో అరేంజ్ చెయ్యాలి అంటూ అతనికి పని పురమాయించాడు

అలాగే సార్! అంటూ దాన్ని పట్టుకుని ప్రక్కగదిలోకి వెళ్ళిపోయాడు నారాయణ

మొదటి పేజీలోని పోటో కార్తీక్ తండ్రిది

నారాయణ వెళ్ళగానే ఆఫీసు పనిలో పడ్డాడు కార్తీక్

కార్తీక్ ఏ ప్రయోజ్జాన్నాశించి నారాయణకా పని పురమాయించాడో ఆ ప్రయోజనం నెరవేరింది ఓ అరగంట తర్వాత చేతిలో పోటోల కట్టతో తిరిగొచ్చిన నారాయణ – ఈ పోటోలోని అమ్మాయి గారు ఎవరు సార్? అని అడగనే అడిగాడు

మా చెల్లెలు నర్మద! అన్నాడు కార్తీక్

అలాగా సార్ అని ఏదో అనబోయి ఆగిపోయాడు నారాయణ

ఏమిటి ఇంకాఆ పోటోనే చూస్తున్నావ్?

ఆఁ అహఁ ఏం లేదు సార్ తడబడ్డాడు నారాయణ పెళ్ళయిందా సార్ అమ్మాయి గార్కి? ఏ ఊళ్ళో ఉంటున్నారిపుడు?

ఆమె ఇపుడు లేదు నారాయణా! రెండేళ్ల క్రితం చనిపోయింది బస్ ఏక్సిడెంట్‌లో! నారాయణ ముఖ కవళికల్ని ఓరకంట కనిపెడుతూ చెప్పాడు కార్తీక్

అరెఁ ఎంత పనైంది సార్! అన్న నారాయణ ముఖంలో బాద వెల్లడి కావడంతో పాటు అతనిలో ఏదో ఆలోచన మెదిలిన దానికి సూచనగా అతని భృకుటి ముడివడింది

కార్తీక్ దాన్ని అదనుగా తీసుకుని ఏదో మామూలుగా అన్నట్లుగా అన్నాడు అన్నట్టు నీ బార్య చాలా వరకు మా నర్మదలా ఉంటుంది నారాయణా! అవునా కాదా అని చాలా సార్లు పరకాయించి చూసాను ఎంతయినా దూరం నుంచి చూడ్డం కదా నా కైతే సరిగ్గా తెలియడం లేదు పోనీ నువ్ చెప్పు – మాఁ నర్మద పోటో చూసావుగా?

నిజమే సార్! అన్నాడు నారాయణ

సో నా ఊహ కరక్టే నన్నమాట! సర్లే ఆపోటో లిలాగిచ్చి, నువ్ వెళ్ళి ఓ సిగరెట్ పేకెట్ పట్రా అంటూ జేబులోంచి ఓ పదిరూపాయల నోటు తీసి నారాయణ చేతిలో పెట్టాడు కార్తీక్

ఆ విషయాన్ని గురించి ఇంకా ఎక్కువగా మాట్లాడకుండా ఉండా లంటే ముందు అతన్ని అక్కడ్నించి పంపించాలి! అందుకే జేబులో ఓ సిగరెట్ పేకెట్ ఉన్నప్పటికీ అతనికా పని పురమాయించాడు కార్తీక్

★ ★ ★ ★ ★

నేను క్వార్టర్స్ ఖాళీ చేసి ఊళ్ళో వేరే ఏదైనా ఇల్లు చూసుకుని మారిపోదామనుకుంటున్నాను సార్! అని నారాయణ అంటాడేమోనని ఓ వారం రోజులు దాకా ఎదురు చూశాడు కార్తీక్– అనడన్న నమ్మకం లోలోన ఉన్నప్పటికీ

వారం. నెల రెండు నెలలు రోజులు గడిచిపోతూనే ఉన్నాయ్! కానీ నారాయణ మాత్రం అటువంటి ప్రస్తావనేదీ తీసుకు రాలేదు □

### కొండిపర్తి, హైదరాబాద్

★ ఇలాంటి బ్రతుకు బ్రతికే కంటే చచ్చిందే మేలు అని నక్సలైట్లు హింసకు దిగుతారు మన నాయకులు హింసావాదులే కనుక వారిని అణచే ప్రయత్నం చేస్తారు

● నిజమే కాని హింసిస్తున్నది ఎవరిని? సామాన్య జీవులని కాదనగలరా? తిండికోసం బట్ట కోసం దినదిన గండగా బ్రతుకుతున్న అందరూ మీలాగే ఆలోచిస్తే ఏమోగాని హింసకి సమాధానం హింసతో సాధ్యపడుతుందని నేను అనుకోవడంలేదు ఇంట్లో ఎలకలు ఎక్కువయ్యాయని ఇంటికి నిప్పు పెడతారా?!

### ఎం . కోటబొమ్మాళి

★ నేటి మన యువప్రదానిపై మీ అభిప్రాయం

● ఇంకాయువ ప్రదాని ఏమిటి? రాటు తేలిన రాజకీయ చతురుడై కూర్చుంటే!

### భాస్కర్, పోడూరు

★ 'ప్రేమిస్తున్నాను' అనుకుంటున్న అమ్మాయి ఎంతో నా మనసును స్పందింప చేస్తుంది నేను ఆశిస్తున్నట్లుగా అమ్మాయి శిఖరాలకు ఎదిగిపోతున్నది ఓడిపోతున్న నేను మాత్రం 'విధి' అంటూ తిట్టుకున్నాను ఆమె తొలి చూపు తొలకరై నన్ను చూసిన మలి చూపు (అదే చివరిసారిగా నా కోసం వేయి కనులతో వీక్షించిన రాదలా చూసినపుడు) ఆనందమో దుఃఖమో తెలియని సాగరమై నన్ను ముంచేసి మూడు సంవత్సరాలైంది నా అసమర్ధతను చేతకానితనానికి బలిచేస్తూ ఆమెను మరిచిపోవడం మంచిదా? ఆశతో ఆ క్షణం కోసం ప్రయత్నిస్తున్న (నన్ను) నాకు ఆమె దక్కుతుందా? ఒకవేళ ఇది స్వార్ధమయితే నేనామెను మరువడం సాధ్యమా?

● ఇదేం గందరగోళమయ్యా బాస్కరా? ఈ సమస్యని సరదాగా పాఠకులో కానికి పరిష్కారం కోసం వదిలేస్తే ఎలా వుంటుంది? ఇప్పుడది పాషన్ కదా? బాస్కర్ ఆమెకు దక్కుతాడా? బాస్కర్‌ను ఆమె




స్వీకరిస్తుందా? ఇద్దరూ సుఖపడతారా? క్లుప్తంగా మూడు మాటల్లో రాయండి ఎక్కువమంది రాస్తే చీట్లేసి తీస్తాం నచ్చిన దానికి ఓ చిన్న బహుమతి వుంటుంది అంటూ రాస్తే ఎలా వుంది ఐడియా?! (ఎచ్చిగా వుంటుందనుకోవచ్చు అయితేనేం గాక - పాషన్ పాషనే కదా)

### యు ఎం ఖర్గపూర్

★ కె రామలక్ష్మిగారు? మీరు ఎన్నాళ్ళుగా ప్రశ్నావళి నడుపుతున్నారు?

● నాకు వెనక్కి చూసుకొనే అలవాటు లేదయ్యా అంచేత లెక్క పెట్టలేదు!

### జె ఆర్ , కోటబొమ్మాళి

★ వరుని కంటే వదువు ఎక్కువ చదువుకుంటే ఆమె బర్తకు యివ్వవలసినంత గౌరవం యివ్వకుండా తిరస్కరిస్తుందని అందరూ అంటారు మీ అభిప్రాయం?

● తనతో సమానంగా చదువుకున్న బార్యల్ని ఎంతమంది గౌరవంగా చూస్తున్నారు?! అందుకే వారికి బయం ఇన్ఫిరియారిటీ కాంప్లెక్సుతో - సతమతమైపోతూ బార్యల్ని చిన్న చూపు చూస్తారు అందుకే - తమతో సమానంగా చదువుకుంటేనే గౌరవించలేని వాళ్ళు తమకంటే ఎక్కువ చదువుకున్న స్త్రీని బరించలేరన్న నమ్మకంతో అనుబవజ్ఞులు అలా హెచ్చరిస్తారు కాని నిజంగా అర్ధం చేసుకున్న దంపతులకి డిగ్రీలు కాదు కదా - మరేం అడ్డు నిలవదు




### టి. జె ఆర్ , విజయవాడ

★ కె ఆర్ ఎల్ గారూ, నేటి సమాజంలో కులమతాలు పెట్టని కోటలుగా వున్నాయి అనుకొంటాను

● పెట్టని కోటలేం కర్మ! అవే - రాజకీయాలకి పునాదిరాళ్ళు వాటి పేరు చెప్పే - ఓటు బ్యాంకులు దోచుకుంటున్నారు

### ఆర్ కె , ఖర్గపూర్

★ అశాశ్వత శరీరంపై ఆశ ఎందుకు?

● శరీరం ఉన్నందుకు!

★ మీకేదైనా సమస్య ఎదురైతే ఎవరిని అడిగి పరిష్కరించుకుంటారు?

● సాదారణంగా నా సమస్యలు నాలోనే వుంచుకుంటాను నా సరదాలే పంచుతాను అయితే ఆరోగ్యానికి ఆర్ధికానికి చట్టానికి సంబందించిన సమస్యలు ఎదురైనప్పుడు - ఆయా వర్గాల ప్రముఖుల నడిగి తేల్చుకుంటాను నిర్మొహమాటంగా - అంతేగాని దొంగ పేరెట్టుకుని ఏ పత్రికకో రాయను!

★ ఆడదాని విలువ పెరిగేదెప్పుడు?

● మగాడి కాంప్లెక్సులు పోయి - సాటి మనిషిగా ఆమెని గుర్తించడం ప్రారంబించినప్పుడు

★ ఆంద్రసచిత్ర వారపత్రిక వస్తే మీ ప్రశ్నావళి ముందుగా చదువుతాను నమ్మండి

● నమ్మాలనే వుంది! కాని ఎందుకు చదువుతారో తెలిసిపోయాక థ్రిల్లేముంటుంది స్వామీ?

### ఎస్ డి ఎమ్ ఒంగోలు

★ జీవితం సుఖ దుఃఖాల మేలు కలయిక అంటారు పెద్దలు అంటే ఏమిటి?

● జీవితం అంటే ఒక్క సుఖమే కాదు
జీవితం అంటే ఒక్క దుఃఖమే కాదు
జివితం అంటే సుఖం+ దుఃఖం మరిచిపోకు అని!

### ఎం వి ఎన్ మార్టేరు

★ అభ్యుదయం అంటే కుల మతాలని పాటించక పోవడం కాదు అని రాశారు (19-25 జూన్ 87) వీటికి స్వస్తి చెప్పాలనే అభ్యుదయ బావాలు గల వ్యక్తిగా నేను మిమ్మల్ని అర్ధం చేసుకుంటున్నాను మీ పై మాటల వల్ల మీరూ కులమతాలను పాటించమనే ఉద్దేశ్యంలో వున్నట్టు నేను అభిప్రాయ పడవలసి వస్తుంది మీ వివరణ యివ్వగోరుతాను

● సారీ, మీరు పూర్తిగా చదవకనే ఆవేశపడి పోతారెందుకు? కులమతాలను పాటించక పోవడం ఒక్కటే- అభ్యుదయ లక్షణం కాదు అన్నది నా బావం నేను మీ నమ్మకాన్ని వమ్ము చేయను నేనెవరిని యిప్పటిదాకా కులం అడగలేదు తినేటప్పుడు మాంసాహారులా, శాకాహారులా అని మాత్రం అడుగుతాను- అది ఉబయుల సౌకర్యం కోసం మాత్రమే ప్లీజ్! అర్ధం చేసుకోండి □

1వ వారం

2వ వారం

3వ వారం

4వ వారం

5వ వారం

# చూడండి! కేవలం 6 వారాల్లో త్వరగా మీ ఛాయ మెరుగవుతుంది

6వ వారం

## క్లియర్•టోన్
### ద్వారా ఛాయ మెరుగయ్యే పథకం

మీ ముఖంపైని ఛాయ మరింత మెరుగ్గా మిలమిల మెరిసేలా, ప్రకృతి మీకిచ్చిన వరంలా

క్లియర్•టోన్ ఛాయను మెరుగు పరిచే క్రీమ్ చేస్తుందిది నిజం

క్లియర్•టోన్‌ని రోజుకి రెండుసార్లు మృదువుగా రాయండి దానిలోని మృదుత్వాన్ని మీ చర్మంలో లోపలికి యింకుతూన్న అనుభవాన్ని పొందండి — మిగిలేదిక కేవలం అద్భుతమైన ఆ ఫ్రెంచి సుగంధం క్లియర్•టోన్ యొక్క 4 విధాల చర్య యిక మొదలు

**అద్వితీయమైన తీరులో చర్మపు ఛాయని మెరుగు పరిచే పదార్థం** (మరే క్రీములోనూ లేదు యిది) మీ చర్మం లోపలనుంచి ప్రకృతి సహజమైన ఆ మెరుగు మెరుపును పునరుజ్జీవితం చేస్తుంది

**సూర్యకిరణాలను వడగట్టగల ప్రత్యేకమైన పొర మీకు** రోజంతా రక్షనిస్తుంది సూర్యకిరణాల నుంచి నల్లబడకుండా

**సమృద్ధివంతమైన మాయిశ్చరైజర్ మీ చర్మాన్ని అలా** కోమలంగా యవ్వనంలోని నేవళంగా వుండే ఆ లక్షణాన్ని తీసుకొస్తుంది

**వారాలు తిరిగే సరికల్లా చర్మంపైన మచ్చలలా మాసిపోతాయి** అలా చూస్తూచూస్తూ ఆరు వారాలు తిరిగేసరికల్లా క్లియర్ టోన్ తెచ్చే ఆ తేడాని మీరే చూస్తారిక-దేశమంతట్లోని వేలకి వేళ్ళలా యిప్పటికే దాని అనుభవంలోకి తెచ్చుకున్న ఆ అనుభవాన్ని

క్లియర్ టోన్ తెచ్చే మెరుగైన ఛాయను మీరూ చేజిక్కించుకోవాలిక కదూ?




లండన్•పారిస్•న్యూయార్క్

daCunha/NICL/93/87 TEL

# మంజీరనాదం

## రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

జయదేవ్ ■ అడవి కెళ్ళి పరిశోధనలు జరపడానిగ్గాను గవర్నమెంటు దగ్గర పర్మిషన్ తీసుకొచ్చాడు అయితే తమతో పాటు బయల్దేరడానికి మాత్రం ఎవరూ ఒప్పుకోలేదు

ప్రతివాడు ఎదో ఓ కుంటిసాకు చెప్పి తప్పించు కున్నాడు కొందరైతే అసలా బానుగుహ చాయలకే పోవద్దని సలహా కూడా ఇచ్చారు

'నిజంగా అక్కడ దెయ్యాలూ, భూతాలూ లాంటివేం లేవు అంతా అపోహలు మాత్రమే అంటూ నచ్చ చెప్ప చూశారు జయదేవ్ అరవింద్‌లు

అయినా వాళ్ళు రావ(టే రావ(న్నారు ఆలోచనలో పడ్డారు ఇద్దరూ

దేశం ఇంత పురోగమిస్తున్న ఈ రోజుల్లో కూడా దెయ్యాలూ భూతాలూ' నాన్సెన్స్' విసుక్కున్నాడు జయదేవ్

ఎవరూ రాకుండా మనం మాత్రం వెళ్ళలేమా" ఏదో ఆలోచిస్తూ అంది కాంత

కష్టం' మనం వెళ్ళేది సరదాక్కాదు పరిశోధనలు జరపడానికి దానికి తగ్గ మందీ మార్బలం వుండాలి ఒకోసారి నిలువెత్తు గోతులు కూడా తవ్వాల్సి రావచ్చు' మన వల్ల ఏం అవుతుంది" నిస్పృహగా అన్నాడు జయదేవ్

బాబుగారూ' మెల్లగా వచ్చాడు బట్టు

అందరూ అతని కేసి చూశారు

నేనొస్తాను మీతో'

నువ్వా" తృళ్ళిపడ్డాడు జయదేవ్

అవును బాబూ' నాకు చాలా రోజుల్నించి అలాంటి ప్రదేశాలు చూడాల నుంది మొన్న అరవింద్‌బాబు గారెళ్తుంటె అడగాను కూడా ఈసారి

**జరిగిన కథ – 3** పురావస్తు పరిశోధనలో ఒక సమాచారం కోసం అరవింద్ ఖనిజాలున్న ప్రదేశానికి బయలు దేరుతాడు మధ్య దారిలో అడవిలో రైలాగిపోతుంది అక్కడి అద్భుత నిధుల గురించి వాటిని కాపలాకాసే పిశాచాల గురించి కథలు విని ఉన్న అరవింద్ అడవిలోకి బయల్దేరతాడు అడవిలో ఒక అడవి మనిషి కొమ్ము ఒక బంగారు నాణెం సంపాదించి తిరిగివస్తాడు నాణెం చూసిన జయదేవ్ కాంతి బృందంతో సహా తిరిగి వెళ్దామంటారు



తప్పకుండా తీసికెళ్తానని వాగ్దానం చేశారుకూడా అన్నాడు బట్టు

అప్పుడు [illegible]

నిజమే' అన్నాడు

క్షణం ఆలోచనలో పడ్డారంతా

ఆలోచించకండి బాబూ' నేనుంటే మిమ్మల్నందర్నీ కంటికి రెప్పలా చూసుకుంటాను అరవై ఏళ్ళ బట్టు పాతికేళ్ళ యువకుడిలా వుత్సాహంగా అన్నాడు

నిజవే' బట్టూ ఒక్కడూ పది మంది పెట్టు' ఒ కే బట్టూ' నువ్వూ మాతో పాటు ఒస్తున్నావ్ అన్నాడు జయదేవ్ బట్టు మొహం వెలిగి పోయింది

తర్వాత ప్రయాణం రోజు నిర్ణయించారు అడవిలోకి కావల్సిన సరంజామా అంతా సమకూర్చు కున్నారు వెళ్ళే రోజు దగ్గర పడుతున్నకొద్దీ కాస్త కంగారుగానూ, మరి కాస్త వుత్సాహంగానూ వుంది కాంతికి

బట్టు అయితే తెగ హడావిడి పడిపోతున్నాడు

* * * * * * * *

ప్రయాణం రేపట్నొచ్చింది

ఇంటిలి పాగీ [illegible]

ఇంకా ఇంటికి రాలేదు అరవింద్ మాత్రం సాయంత్రం నాలుగ్గంటలు కాకుండానే ఇంటి కొచ్చేశాడు

బట్టు అతనిక్కాఫీ అందించి–

సామాన్లన్నీ సర్దేశాను సర్ అన్నాడు.

వెరీగుడ్' కాంతి ఏదీ?' అన్నాడు అరవింద్ ఇల్లంతా నిశ్శబ్దంగా వుండడం గమనించి.

అడవిలోకి తీసికెళ్ళడానికి ఏవో కావాలట' షాపింగ్‌కి వెళ్ళారు అన్నాడు బట్టు

అరవింద్ నవ్వాడు

మా సంగతేమో గానీ, మీ ఇద్దరికీ మాత్రం తొందరగా వుంది అడవి కెళ్ళాలని అక్కడ ఏ పులిపిల్లో కనిపిస్తే

నాకేం బయంలేదు పులి పిల్ల కాదు పులి వచ్చినా ఈ కాంతి బయపడదు అంటూ వచ్చింది కాంతి

బట్టు, అరవింద్ కూడా నవ్వారు

వాళ్ళు ప్రయాణం గురించి మాట్లాడు కుంటుండగానే వుసూరు మంటూ




అతని మొహం చూసి తెల్లబోయారంతా

ఏవిఁటి సర్ అలా వున్నారు? ఆదుర్దాగా అడిగాడు అరవింద్

జయదేవ్ నీరసంగా సోఫాలో కూలబడ్డాడు

ఏం జరిగిందండీ? అతని దగ్గరికొస్తూ అంది కాంతి

రేపు ప్రయాణం కేన్సిలయిందమ్మా'

ఆఁ వేఁ ఓ? తుళ్ళిపడ్డారంతా

అర్జంట్‌గా నన్ను రమ్మని హెడ్డాఫీసు నించి ఫోన్ వచ్చింది' అన్నాడు జయదేవ్

ప్చ్' ఈసారికి ఎవర్నయినా పంపిం చెయ్యండి డేడీ' తేలిగ్గా అంది కాంతి

అదెలాగమ్మా?

మన ప్రోగ్రాం సంగతి చెప్పండి'

అది అయింది' భారంగా నిట్టూరుస్తూ అన్నాడు జయదేవ్

ఏమన్నారు? ఆతృతగా అడిగింది కాంతి

# మంజీరనాదం

మన ప్రయాణమే పోస్ట్‌పోన్ చేసుకోమన్నారు!

అంటే ?

వున్నపాటున బయల్దేరి రమ్మని ఫోన్ చేశారు. అసలు నా మాటే వినిపించుకో లేదు. అంతేకాదు మరేదో ముఖ్యమైన పనుందని అది నాతోనే మాట్లాడాలనీ కూడా చెప్పారు!

ఉసూరుమన్నారంతా.

ఏం చేద్దాం? అంది కాంతి దిగులుగా.

ఏం చేస్తాం? నేను ఊర్నించి రాగానే వెళ్దాం అన్నాడు జయదేవ్.

మీరెప్పుడు తిరిగొస్తారు డేడీ! ఒకోసారి పది రోజులు కూడా పడుతుంది అంది కాంతి ఏదో ఆలోచిస్తూ.

తప్పదు కదమ్మా!

పోనీ ఓ పన్జేస్తే డాడీ!

ఏమిటీ?

మేం ముగ్గురం వెళ్తే ఏం?

మీరు ముగ్గురూనా? ఆశ్చర్యంగా అన్నాడు జయదేవ్.

అవును డేడీ! ప్లీజ్! మేం వెళ్ళొస్తాం!

వద్దమ్మా!

ఏం పర్వాలేదు సర్! మేం వెళ్ళొస్తాం! సరంజామా అంతా వుందిగా? కాంతి ఉత్సాహాన్ని గ్రహించిన అరవింద్ మెల్లగా అన్నాడు.

'అదికాదరవింద్

కాంతిని గురించా?

ఊఁహూఁ

కాంతిని గురించి మీ రస్సలు బెంగపడక్కర్లేదు సర్! నేను, బట్టు ఆమెని కంటికి రెప్పలా కాపాడి, మరింత జాగ్రత్తగా తీసుకొచ్చి మీకు అప్పజెప్తాం! నవ్వుతూ అన్నాడు అరవింద్.

నిజమే అనుకో. కానీ

ఇంకేం మాట్లాడకండి డేడీ! అనుకున్నట్టు మేం వెళ్ళొస్తాం! రివాల్వర్స్ కూడా తీసికెళ్తాంగా! మరేం భయం లేదు. ఎంత తొందరగా పని ముగిస్తే అంత త్వరగా వచ్చేస్తాం! బ్రతిమాలుతున్నట్టు అంది కాంతి.

క్షణం ఆలోచనలో పడ్డాడు జయదేవ్.

ఏమిటి సర్? అంతలా ఆలోచిస్తున్నారు? కాంతిని నాతో పంపడం ఇష్టం లేదా? అదోలా అడిగాడు అరవింద్.

ఛ! ఛ! అదేంలేదరవింద్! కాంతి ఇవాళ కాకపోతే రేపైనా నీతో రావలసిన




మనిషే. కానీ అది మరి అడవి. తను భయపడ్డమే గాక మిమ్మల్ని కూడా భయపెడుతుందేమో అని నా అనుమానం అన్నాడు జయదేవ్.

నిజమే! అన్నట్టు మౌనంగా ఉండిపోయాడు అరవింద్.

పోనీ ఓ పన్జేస్తే? మెల్లగా అన్నాడు జయదేవ్.

ఏమిటి సర్?

ముందు నువ్వు, బట్టు వెళ్ళండి. నేను సాధ్యమైనంత తొందరగా వచ్చేస్తాను. రాగానే నేనూ కాంతి కూడా బయల్దేరి అక్కడికొస్తాం!

నథింగ్ డూయింగ్! మీరు ఎప్పుడొస్తారో మీకే తెలియదు! ఈలోగా అరవింద్ వాళ్ళు వచ్చేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు! ప్లీజ్ డేడీ! నేనూ అరవింద్ వాళ్ళతో పాటు ఇప్పుడే వెళ్తాను. నేనేం వాళ్ళని కంగారు పెట్టనుగా! ఆ మృగాలు నన్నేమి చెయ్యనూ లేవు! అయినా ఇద్దరు మగాళ్ళు పక్కనుండగా మీరింత భయపడ్డం ఏం బాగా లేదు. అంది కాంతి బుంగమూతి పెట్టి.

నిస్సహాయంగా చూశాడు జయదేవ్.

క్షణం మౌనంగా ఊరుకుని, లేచి హాల్లో ఉన్న ఓ కబోర్డ్ దగ్గర కెళ్ళి ఏదో వెతకసాగాడు.

కాంతీ! మెల్లగా అన్నాడు అరవింద్.

ఏమిటి? అన్నట్టు చూసింది కాంతి.

మీ నాన్నగారు భయపడేది ఆ మృగాల గురించి కాదు! గుస గుసగా కాంతి చెవిలో అన్నాడు.

అర్థం కానట్టు చూసింది కాంతి.

ఈ మృగాన్ని గురించి ఆయన భయం! తనని తాను చూపించుకుంటూ చిలిపిగా అన్నాడు అరవింద్.

అయితే అసలు భయం లేదు!

ఏం?

ఈ మృగానికంత ధైర్యం కూడానా? కందిరీగ సవ్వడి వింటే ఆమడ దూరం పారిపోతుంది మృగం! అల్లరిగా అంది కాంతి.

ఏమిటంత నమ్మకం?

నీ సంగతి నాకు తెలియదా?

అది అడవి ప్రదేశం! ఏకాంతవాసం

బట్టు కూడా వుంటాడు! అడ్డం వచ్చింది కాంతి.

ష్! బట్టు ఎప్పుడూ మనల్ని కాపలా కాస్తూ వుంటాడా? తను లేనప్పుడు

అయితే పెద్ద ప్లాన్‌మీదే వున్నావన్న మాట! అయినా పర్వాలేదు. నన్ను నేను కాపాడుకోగలను.

అంటే?

ఏముందీ. నా చేతిలో కరాటే విద్య వుంది నీకు తెలుసుగా. అవసరం అయితే ముందుగా నీ మీదే ప్రయోగిస్తాను! గర్వంగా అంది కాంతి.

ఏం లాభం లేదు! ఒక్కసారి నా కళ్ళల్లోకి చూడగానే ఆ కరాటే విద్య కాస్తా మర్చిపోయి తన్మయత్వంగా నా వళ్ళో పడిపోయి

అతని మాట పూర్తి కానే లేదు. అతని నోట అప్రయత్నంగా కెవ్వుమన్న కేక వెలువడింది.

ఏమిటి? అంటూ కంగారుగా వచ్చాడు జయదేవ్.

అబ్బె! ఏం లేదు. ఏదో గండుచీమ! గొణిగాడు అరవింద్ కాంతి గిల్లిన చోట చేత్తో రాసుకుంటూ.

కాంతి గోడకేసి తిప్పింది ముఖాన్ని.

సంగతి గ్రహించిన జయదేవ్ మనసులోనే నవ్వుకుంటూ తన పనిలో పడిపోయాడు.

కాంతి అరవింద్ కేసి ఓరగా చూసింది.

అతను కొరకొరా చూశాడామె కేసి.

* * * * * * * * *

దానుగుహకి పదిహేను కిలోమీటర్లలో వున్న రైల్వేస్టేషన్లో తమ సరంజామాతో దిగారు అరవింద్, బట్టు, కాంతి.

సామాన్లు సంచుల్ని మెడలకి తగిలించుకున్నారు. పెరాంబులేటర్ లాంటి

దాన్లో కొన్ని సామాన్లు సర్దుకున్నారు. మెల్లగా దాన్ని తీసుకుంటూ నడవడం మొదలుపెట్టారు పట్టాల వెంట

దోవలో ఉన్న కొండల్ని, గుట్టల్ని, రాళ్ళనీ చూసుకుంటూ వాటి గురించిన కథలు చెప్పుకుని నవ్వుకుంటూ ఉత్సాహంగా నడుస్తున్నారు

మధ్య మధ్య వాటర్ బాటిల్లోని నీళ్ళు తాగి సేద తీర్చుకుంటూ ఒక చెట్టుమీద నించి మరో చెట్టు మీదికి అల్లరిగా దుమికే కోతిమూకల్ని చూసుకుంటూ పది కిలోమీటర్లు నడిచారు అప్పటికే చుట్టూ చీకట్లావహించేశాయి

క్షణం ఆగి చుట్టూ ఓసారి పరికించి చూశారు ఎటు చూసినా అడవి, కొండలు! భయంకరమైన లోయలు! దూరం నించి నక్కల ఊళలు, తోడేళ్ళ అరుపులు! అదో లాంటి భీతిని కలిగిస్తున్నాయి

అరవింద్! ఇంక నడవడం అంత మంచిది కాదేమో! అంది కాంతి మెల్లగా

ఏం? అప్పుడే భయమేసోందా? నవ్వాడు అరవింద్

"ఛ! ఛ! భయం కాదు! పొద్దుపోతే క్రూర మృగాలు తిరుగుతాయి కదా కాస్త ముందే మన నివాసానికి ఏర్పాట్లు చేసుకుంటే

నిజమే! అన్నట్టు తల పంకించాడు అరవింద్

"ఇక్కడే ఆగిపోదాం సర్! పొద్దున్నే లేచి మళ్ళీ బయల్దేరదాం! అన్నాడు భట్టు కూడా

'సరే' అన్నాడు అరవింద్

ముగ్గురూ తమ బేగ్స్‌ని దించుకున్నారు

అక్కడ కొమ్మలు బాగా విస్తరించిన ఓ పెద్ద చెట్టుకి హేంగింగ్ నెట్స్ కట్టారు

లైట్‌గా డిన్నర్‌కానిచ్చేసి ఫ్రామ్ చెట్టు కింద ఓ కుదురైన చోట పెట్టి, దానిమీద పెద్ద టార్పాలిన్ జాగ్రత్తగా కప్పి ఏడు గంటలు అవుతూంతగా మెల్లగా చెట్టెక్కి నెట్స్‌లో నడుం వాల్చారు ముగ్గురూ

క్రమేపీ వెన్నెల అంతటా ఆక్రమించుకుంది దూరంగా అడవి లోంచి ఏవేవో రకరకాల అరుపులు వినిపిస్తున్నాయి

పన్నెండూ, ఒంటి గంట దాటేవరకూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ ఆపై మెల్లగా నిద్రలోకి జారిపోయారు ముగ్గురూ

* * * * * * * * * *

ఉదయం పక్షుల కిలకిలారావంతో మళ్ళీ వాళ్ళకి మెలకువ వచ్చింది లేచిన వెంటనే కిందికి చూశారు వాళ్ళు పెట్టిన వస్తువులన్నీ చెక్కు చెదరకుండా ఎలా పెట్టినవి అలాగే వున్నాయి

పరవాలేదు! ఏ నక్కలో, తోడేళ్ళో వచ్చి వస్తువుల్ని చిందర వందర చేసేస్తాయేమో అని భయపడ్డాను అన్నాడు అరవింద్ చెట్టు కొమ్మ మీద నిల్చి తను పడుకున్న నెట్ విప్పుతూ

నిజమే! ఇది మనకి శుభ సూచకం కూడా! అన్నాడు భట్టు

గట్టి టార్పాలిన్ కప్పాంగా అంది కాంతి నవ్వుతూ

ముగ్గురూ కిందికి దిగింతర్వాత దంతావధానం కానిచ్చారు

అక్కడక్కడ కాసిని చితుకులు ఏరి, మూడు రాళ్ళు అమర్చి పొయ్యి సిద్ధం చేశాడు భట్టు

అరవింద్ బ్రెడ్, జామ్ తీసి ప్లేట్స్‌లో సర్దాడు కాంతి పాల పౌడర్, బ్రూ వగైరాలు తీసి కాఫీ కలిపి మూడు కప్పుల్లో పోసి రెండు కప్పులు వాళ్ళిద్దరికీ ఇచ్చి తనొకటి తీసుకుంది

ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ బ్రేక్‌ఫాస్ట్ ముగించారు ఆ తరవాత మెల్లగా సామాన్లు సర్దుకుని ప్రయాణానికి సిద్ధమయ్యారు

అలా నడుచుకుంటూ భానుగుహ దగ్గరి కెళ్ళేసరికి సూర్యుడు నడి నెత్తికి రాబోతున్నాడు

మెల్లగా ముగ్గురూ గుహలో ప్రవేశించారు అంతా చిమ్మ చీకటి! ఒక రకమైన హోరు!

ఆ గుహ గురించి ఎన్ని కథలు ఎలా ప్రచారం అయిందీ అరవింద్ వివరించి చెప్తుంటే భట్టు, కాంతి కుతూహలంగా వింటున్నారు

గుహ దాటి అలా నడుస్తూ చాలా దూరం వెళ్ళారు

'ట్రైన్‌లో కాబట్టి తొందరగా వెళ్ళాంగానీ నడకంటే మాటలా?' అనుకుంటూ ట్రైన్ ఎక్కడ ఆగిందీ గుర్తు తెచ్చుకుంటూ పరిసరాలు జాగ్రత్తగా పరికిస్తున్నాడు అరవింద్

కాంతి మొహం వాడిపోయింది

ఇంకా ఎంత దూరం వెళ్ళాలి అరవింద్? అంది మెల్లగా

"దాదాపుగా వచ్చేసినట్టే కాంతీ! అదిగో! చూడు అదే లోయ! దూరంగా కనిపిస్తున్న పెద్ద లోయ కేసి చూపిస్తూ అన్నాడు అరవింద్

మరో అరగంటకి ట్రైన్ ఆగిన చోట్టుకి చేరుకున్నారు ముగ్గురూ

ఇక్కడే కాంతీ! ట్రైన్ ఆగిందీ! పరిసరాల్ని చూస్తూ అన్నాడు అరవింద్

ఉత్సాహంగా చూశారు కాంతీ, భట్టు అతనికేసి

ఒకసారి తను ఎలా వెళ్ళిందీ మనసులో మననం చేసుకున్నాడు అరవింద్ ఆపై కాంతి చెయ్యి అందుకుని—

రాభట్టూ! ఇక్కడ కట్ట దిగుదాం' అన్నాడు మెల్లగా కట్ట దిగి ముగ్గురూ లోయకేసి నడక సాగించారు అలా రెండు గంటలు నడిచారు గానీ మెటల్ డిటెక్టర్ చూపించిన స్థలం కనిపించ లేదు వారికి

ఎంత జాగ్రత్తగా గమనించినా డిటెక్టర్ నిద్ర పోతున్నట్టు కామ్‌గా ఉందే తప్ప ఎలాంటి సిగ్నల్ ఇవ్వడం లేదు




దారి తప్పానా? అనుకున్నాడు అరవింద్ ఓ క్షణం అయితే తన అనుమానాన్ని మిగతా ఇద్దరికీ తెలియ నివ్వలేదు, కంగారు పడతారేమోనని

ఒకచోట ఆగి ఆహారం తీసుకున్నారు

పది నిమిషాల తర్వాత మళ్ళీ నడక సాగించారు మధ్య మధ్య కుందేళ్ళు, లేళ్ళు, నెమళ్ళు, అడవి ఉడతలు వీళ్ళని చూసి కంగారు పడి పరుగులు తీస్తూ, మధ్య మధ్య ఆగి ఏ పొద చాటునో దాగి తొంగి చూస్తుంటే చూడ్డాని కెంతో సరదాగా వుంది కాంతికి

వాటిని చూస్తూ అలా మధ్య మధ్య నిల్చుండి పోతున్న కాంతితో —

కాంతీ! ఇలా నిల్చుండి పోతే మనం గమ్యానికి ఇప్పట్లో చేరం! మనం వెళ్ళాక ఇలాంటి దృశ్యాలకేం కొదవుండదు! తొందరగా నడు! అంటూ హెచ్చరించాడు అరవింద్

ఓ! సారీ! అంటూ నవ్వేసి గబగబా అడుగులు వేసింది కాంతి

మరికొంత దూరం నడిచారు

హఠాత్తుగా డిటెక్టర్ మోగింది

అందరూ టక్కున ఆగిపోయారు

డిటెక్టర్ చూపించిన చోట పలుగుతో తవ్వి చూశారు

మునుపు దొరికిన నాణెం లాంటిదే మరో నాణెం కనిపించింది వారికి

అయితే వారి నిధి నిక్షేపా లుండేది ఇక్కడే అయి వుంటుంది నాణెన్ని

## గడుసులోకం

—బాబు







## మంజీరనాదం

చూస్తూ అంది కాంతి

అవును! ఇలాంటి నిర్జన ప్రదేశంలో ఇది కనిపించిందంటే ఇవి దాచిన పెట్టెలు క్రమేపీ శిథిలమైపోయి ఏ గాలి వానకో ఈ నాణాలన్నీ చెల్లా చెదరైపోయి తలో పక్కకీ పోయుంటాయి" అన్నాడు బట్టు

ఎక్కడో దూరంగా ఉన్న నీటి ప్రవాహంలో పడి ఈ పల్లంలోకి కొట్టుకొచ్చి కూడా వుండచ్చుగా?' అంది కాంతి

నిజమే! అన్నట్టు తలపంకించాడు అరవింద్, గోల్డ్‌కాయన్ జేబులో వేసుకుంటూ

ముగ్గురూ మళ్ళీ నడక సాగించారు

అరవింద్! హటాత్తుగా పిల్చింది కాంతి

'ఏమిటీ? పది గజాలు ముందు నడుస్తున్న అరవింద్ ఆగి వెనక్కి తిరిగాడు

నగలపెట్టె దొరికితే ఏం చేస్తావ్? కుతూహలంగా అంది కాంతి

ఏం చేస్తాను? భద్రంగా తీసికెళ్ళి ప్రభుత్వానికి అప్పజెప్తాను! అన్నాడు మళ్ళీ నడుస్తూ

ఏమిటీ! మొత్తం నగలూనా?

ఆఁ!

వీల్లేదు!

ఏం?

నాకొంత బంగారం కావాలి!

ఎందుకు?

ఎందుకా? సిగ్గు లేకపోతే సరి! ఆడవాళ్ళకి బంగారం ఎందుకు? ఎంచక్కా మన పెళ్ళికి బోల్డు రకాల నగలు చేయించు కుంటాను! అల్లరిగా అంది కాంతి

"ఇంకా చేయించుకోవడం ఎందుకమ్మా? పూర్వకాలం నగలు ఎంతో అందంగా ఆకర్షణీయంగా ఉంటాయి! మధ్య మధ్య రత్నాలు కూడా పొదిగి వుంటాయి అందరూ ఆశ్చర్యపోయేలా అలాంటి చిత్రమైన నగలు పెట్టుకుంటేనే బావుంటుంది భట్టు కూడా తమాషాగా అన్నాడు

నిజమే బట్టూ ఆ రోజుల్లో పనితనమే వేరు! నువ్వు బద్రాచలంలో దేవుడి నగలు చూశావా? అంది కాంతి

ఆఁ! చాలా బావుంటాయి ఆ చింతా, పతకం ఆ కిలికి తురాయి ఓహ్! తన్మయత్వంగా అన్నాడు బట్టు

అవునా మరి! అందుకే నాక్కూడా అలాంటి నగలంటే ఇష్టం! ఇప్పుడు బంగారాలు కొన్లేక నాజూకు నగలు చెయిస్తున్నారు గాని నిజానికి వాటికున్న అందం ఇప్పటి నగల కొస్తుందా? అమ్మమ్మలా అంది కాంతి

అయితే మీరిద్దరూ ప్రయాణానికి సిద్ధంగా ఉండండి! గంభీరంగా అన్నాడు అరవింద్

ప్రయాణానికా? ఆశ్చర్యంగా చూసింది కాంతి

అవును!

ఎక్కడికి సర్? కుతూహలంగా అన్నాడు భట్టు

శ్రీకృష్ణ జన్మస్థానానికి! తాపీగా అన్నాడు అరవింద్

ఎందుకు? చిరుకోపంగా అంది కాంతి

ప్రభుత్వాన్ని మోసం చేసినందుకు!

ఇందులో మోసం చెయ్యడమేముంది? అసలు మనం ఇంత కష్టపడి ఆ పెట్టెల్ని బైటికి తియ్యకపోతే ఇదంతా ఆ ప్రభుత్వానికి ఎలా దొరుకుతుంది?

వాళ్ళకి దొరక్కపోయినా పరవాలేదు కానీ మనం తీసుకుంటే మాత్రం శిక్ష తప్పదు అయినా మనల్ని వెతికి తెమ్మని బ్రతిమాలిందా ప్రభుత్వం?' అన్నాడు అరవింద్ తమాషాగా

అదేం కుదరదు ఏమైనా నేను కొన్ని నగలు తీసుకుని మిగతా నగలే ఇస్తాను! పంతంగా అంది కాంతి

ఓ కే! అలాగే! అయితే మనకి ఒక్క నగల పెట్టయినా ముందు దొరకాలి కదా! నవ్వుతూ అన్నాడు అరవింద్

ఓస్! ఈ అడవంతా నగల పెట్టెలున్నప్పుడు మనకి ఒక్కటంటే ఒక్క పెట్టె దొరకదా! తేలిగ్గా అంది కాంతి

అందుకే అమ్మాయిగారూ! జాగ్రత్తగా వెతకండి! అన్నాడు బట్టు తమాషాగా కాళ్ళ కింద వెతుకుతూ

కాంతీ, అరవింద్ కూడా నవ్వేశారు.

అలా తమాషాగా మాట్లాడుకుంటూ మరి కొంత దూరం నడిచారు

అయితే– అరవింద్ మొదట చూసిన స్థలం మాత్రం కనిపించ లేదు

'దారి తప్పాను! అనుకున్నాడతను మనసులో

హటాత్తుగా డిటెక్టర్ మోగింది

(ఇంకా ఉంది)

# అవినీతిని అంతమొందిస్తా!

గిరజాల గిరీశం

"అవినీతిని అంతమొందిస్తా!' అన్నాడు నీతిపరుడు పెద్ద బండ మీద నిల్చుని బండచుట్టూ నిలబడ్డ జనం 'ఏదీ మరొక్కసారి అను అన్నారు

అవినీతిని అంతమొందిస్తాను అన్నాడు నీతిపరుడు 'బళిరే! హిప్పిప్పు హుర్రే! అరిచారు జనం ఆనందంగా ఆవేశంగా, ఆవేదనగా, ఆక్రోశంతో

నీతిపరుడు ఒరలోంచి కత్తిలాగి గాల్లో ఊపాడు జనం మళ్ళీ హోహో అన్నారు

అక్కడున్న నలభైరెండు మంది జనంలో ఓ ముసలాడు దగ్గుతూ అడిగాడు పోయినేడాది ఇట్టానే ఒకడు శపధంచేసి పోయినాడుగంద వాడిగతి ఏవయినట్టూ?

అవినీతిని అంతమొందిచటం అంటే మాటలా" దానికి చాలాకాలం పట్టుద్ది! అదు అప్పుడే తిరిగిరాడు ఆడది బక్కప్రాణంగంద' అన్నాడు మరొకడు జవాబుగా

ప్రతోడూ అవినీతిని అంతమొందిస్తా అని బయల్దేరటవేగానీ, మనమంతా నీతిగా బతుకుదాం అని చెప్పేవోడు లేడు అని ఓ పండుముసలి గొణిగాడు

ఆ నలభైరెండు మంది జనంలోని ముసలమ్మలు నీతిపరునికి హారతులిచ్చారు పూలుజల్లారు వీరతిలకం పెట్టారు కాసేపు నాట్యంచేశారు అక్కడి అడవిలో దొరికిన పళ్ళని అతని గుర్రం మీది సంచిలో కుక్కిపెట్టారు

జైజిగిబిగి అంటూ వీరుడు మళ్ళీ బండరాయి ఎక్కి, ఒక్కవుదుటున గుర్రం మీదకు దూకాడు అదొక్కసారి క్రిందికి కూలబడి, ఎట్టాగో అట్టా తట్టుకుని లేచి పరుగెత్తింది

జనం అంతా 'నిట్టూర్పులు విడుస్తూ, ఎవరి గుడిసెల్లోకి వారు వెళ్ళిపోయారు

నీతిపరుడు చెట్టులు, పుట్టలు, గుట్టలు చిట్టడవులు మహారణ్యాలు దాటుకుంటూ వెళ్ళిపోసాగాడు జనం యిచ్చిన పళ్ళను కొరుక్కుతింటూ గుర్రాన్ని అదిలించసాగాడు నీ సొమ్మేంపోయింది, పరుగెత్తేది నేనుగదా, సరేకానీ నిన్ను పడేసేవేళ రాకపోతుందా అనుకుంటూ గుర్రం కసికసిగా పరుగెత్తసాగింది

అన్నట్టు ఏంటి యిట్టా పడిపోతున్నాడు తను? తను ఎక్కడికెళ్ళాలి? అవినీతిని అంతమొందిస్తానని చెప్పా? అయితే అదెక్కడుంది? అడగటం మర్చిపోయానే ఎంత అశ్వశక్తి వృదా అయిపోతోంది సరే ఎవడైనా దార్లో కనపడకపోతాడా, వాడ్ని అడుగుదాం అనుకున్నాడు నీతిపరుడు

అనుకున్నట్టుగానే దార్లో ఓ మనిషి కనిపించాడు నీతిపరుడు గుర్రాన్ని ఆపి, ఆ మనిషిని అడిగాడు ఏమయ్యా! అవినీతి ఎక్కడవుంది?

అతను ఆశ్చర్యంగా చూసాడు తన గడ్డాన్ని పొట్టదాకా లాక్కుని సవరించుకుంటూ అన్నాడు చూడు నాయనా! అది నీలో వుంది, నాలో వుంది ఇందుగలదు అందులేదు అన్న సందేహంలేదు ఎందెందు వెదకిన అందందేగలదు'

వీడెవడో పిచ్చాడు అనుకుని గుర్రాన్ని ముందుకు పోనిచ్చాడు

అట్టా మళ్ళీ చెట్టులూ, పుట్టలూ, గుట్టలూ, చిట్టడవులు మహారణ్యాలు దాటుకుంటూ పోసాగాడు అట్టా పోగాపోగా బాగా చీకటపడ్డ సమయంలో ఓ పెద్దమైదానం చేరుకున్నాడు కాస్తదూరం పోయాక ఒక పెద్ద బవనం కనిపించింది దాన్ని చూడగానే, నీతి పరుడ్ని అక్కడకి తీసుకెళ్ళిపడేద్దామనుకుని గుర్రం చాలా వేగంగా హుషారుగా పరుగెత్తింది

బవనం చేరుకోగానే, అక్కడ బోళ్ళంతమంది కిన్నెరలు కిలకిలా నవ్వుతూ స్వాగతం పలికారు అతన్ని గుర్రంమీంచి దించి పూలుజల్లుతూ, వాటిమీద నడిపించుకుంటూ బవనంలోకి తీసుకెళ్ళారు గుర్రం విశ్రాంతి దొరికినందుకు తెగ సంతోషించి సకిలించింది

నీతిపరుడు బవనంయొక్క మెరుపుల్ని, అందాల్ని చూస్తూ మైకంతో నడవసాగాడు అట్టా ఎన్నో గదులు దాటాక ఒక పెద్దగదిలోకి తీసుకుపోబడ్డాడు

ఎదురుగుండా ఓ అప్సరస!

ఆమె నీతిపరుడుకి చెయ్యి అందించింది నీతిపరుడు అది గొప్ప అదృష్టంగా ఆమె చెయ్యిని వెంటనే అందుకున్నాడు

ఇద్దరూ ఓ పెద్దపడక గదిలోకి వెళ్ళారు ఆమె అందాలు వొలికిస్తూ శయనించింది నీతిపరుడు ఆమె అందాల్ని ఒక్కటొక్కటే చూస్తూ, ఆహా! ఏమి విశాల నేత్రాలు? మొనతేలిన ముక్కు, పల్చటి ఎర్రటి పెదాలు, నునుపైన బుగ్గలు, కొంచెం పొడుగ్గా సాగిన మెరిసిపోతున మెడ, ఎత్తయిన రొమ్ములు, ఏ చేతికైనా చిక్కే నడుము

ఆమె నీతిపరుడ్ని మీదకు లాక్కుంది సుఖంలో మునిగిపోయి, వారం రోజుల తర్వాత తేలాడు నీతిపరుడు

తన బుగ్గల్ని ఆమె బుగ్గలకానించి ప్రియా, నీ పేరేంటి? అడిగాడు

అవినీతి అంది

అబ్బ! ఎంత అందమైన పేరు మరి ఈ రాజ్యం పేరు

అవినీతిపురం

అబ్బ ఎంత అందమైనపేరు? ఇక్కడ జనం అంతా చాలా అందమైనవారే అయివుండాలి అన్నాడు నీతిపరుడు

అందుకు సందేహమా కొందర్ని చూపిస్తాను పద' అంది అవినీతి

నీతిపరుడు లేచాడు

ఎదురుగా ఓ బలిష్ఠమైన వీరుడు వచ్చాడు ఇతను నా సోదరుడు పేరు అవినీతిపరుడు అంది ముందుకు సాగుతూ అతన్నిచూసి భయపడ్డాడు నీతిపరుడు

అదిగో అక్కడ జనం చూశావా? వాళ్ళంతా లంచాలు తీసుకునేవారు ఇదిగో ఇక్కడ జనాన్ని చూశావా? వాళ్ళంతా కట్నాలు కానుకలతో బతికేవాళ్ళు అదిగో అక్కడ అక్కడ కొంతమంది



## బ్రిటనులో పిరుదుల పోటీలు!

బ్రిటనులో ఇటీవల పిరుదుల పోటీలు నిర్వహించారట అందమైన స్త్రీలు తమ శరీరపు కొలతలు యివ్వడం, శరీర సౌష్ఠవాన్ని, అంగాంగ సౌష్ఠవాన్ని ప్రదర్శించడమేగాక, తమ పిరుదల సౌందర్యాన్ని కదలికలతో చూపే పోటీలటివి ఈ పోటీకి 108 మంది సుందరాంగనలు వచ్చారట జిన్ బ్రిగటా అనే నవ యవ్వన సుందరికి మొదటి బహుమతి వచ్చిందట 1981 నుంచీ యీ పిరుదుల పోటీలు నిర్వహిస్తున్నా ఇటువంటి ముగ్ధ మనోహరమైన జఘన సౌందర్యం చూడ లేదు పొమ్మన్నారట జడ్జీలు- నెక్సియరు యీ పోటీలిపుడు .

## స్వాముల వారికి దేహ శుద్ధి!

హరిద్వార్‌లోని స్వాములవారులు అదును చూసుకుని తమ అంతరంగిక, అంతర్గత ఆశలను తీర్చుకుంటున్నారట మొన్న గుప్తానందస్వామి అనే వో సార్థక నామధేయస్వామి భజనలు చేసి, ప్రసాదం




అందరికీ పంచిపెడుతూ ఆ పంక్తిలో కృపాల్ అనే ▮ ఏళ్ళ పిల్లను చూసి, మరింత ప్రసాదం చాటుగా పెడ్తా రమ్మని పిలిచి, ఆ పిల్ల మీద తన కామ వాంఛ తీర్చుకోబోయాడట బిత్తరపోయిన ఆ పిల్ల గావు కేకలు పెట్టేసరికి చూపరులొచ్చి దేహశుద్ధి చేశారట



## కోతికి రెండు మెదళ్ళు!

మనుషులకు ఒకే మెదడుంటే కోతికి రెండు మెదడులుంటాయట ఒక మెదడు కోతి శరీరాని కంతటికీ ఆజ్ఞలు జారీచేసే పనులు చేస్తే మరో మెదడు కేవలం ఆ కోతి తోకను కంట్రోలు చేస్తుందట

## వెర్రి వేయి విధాలు!

అమెరికా కెన్సాస్‌కు చెందిన హెన్రీ టేలర్ అనే వో క్షురకుడు తనకు చిత్ర లేఖనంలో వున్న ప్రావీణ్యానికో ప్రాముఖ్యతనిచ్చి, వో లాంగినాయనకు గుండు గీసి, ఆ గుండు మీద వో రకం లోషను రాసి, దాని మీద తన చిత్ర లేఖనం చూపాడట దాంతో ఆడా మగా కూడా ఆ షాపు వద్ద క్యూలో నిలబడి, మాకూ గుండు గీచి, ఆ గుండులపై చక్కని బొమ్మలు వేయమని అతగాడిని ప్రార్థిస్తున్నారట

## ఒక్క రూపాయతో వైద్యం!

ఉస్మానియా విశ్వ విద్యాలయం హైదరాబాదు మెడికల్ విభాగంలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్న డాక్టర్ బాజా రంగల్ తాను ఒకే ఒక్క రూపాయి ఫీజుతో వైద్యం చేయనారంభించారట ఎంతటి క్లిష్టమయిన కేసు పరీక్షించి వైద్య సలహా యిచ్చి మందులు వ్రాయడానికాయన కేవలం ఒకే ఒక్క రూపాయి రుసుముగా తీసుకుంటున్నారట- ఆహా!

## 16 ఏళ్ళ పడుచు దారుణ హత్య!

దొడ్డి హళ్ళూరు గ్రామానికి చెందిన 16 ఏళ్ళ నాగవేణికి అదే వూరుకు చెందిన నాకప్ప అనే వో యువకునికి అక్రమ సంబంధం వుండేదట నాగవేణి తలిదండ్రులు యీ విషయం తెలుసుకుని, ఆమెకు వేరే ఒకతనితో పెళ్ళి నిశ్చయం చేశారట నాకప్పకు కూడా వాళ్ళ వాళ్ళు అదే పని చేశారట పెళ్ళికి మూడ్రోజుల ముందు నుంచీ నాగవేణి కనపడలేదట ఈ విషయం ఆమె తలి దండ్రులు పోలీసులకు ఫిర్యాదయినా యివ్వలేదట మూడో రోజున వూరు చివరి డొంకలో ఆమె శవం దొరికిందట. ఎవరో ఎందరో ఆమెను దారుణంగా అనుభవించి, అనక ఆమె మర్మావయవం మీదా కొరల మీదా, స్థనాల మీదా ద్రావకం పోసినట్లు పోస్ట్ మార్టమ్‌లో తేలిందట

## పిల్లల ఆట వస్తువులుగా పాములు!

హర్యానాకు చెందిన మయూర్‌ఖండ్ అనే వో చిన్న గ్రామంలో సుమారు వో 500 గడప వుంటుందిట ఆ వూళ్ళో నివసించే వారితో పాములు కూడా సహ జీవనం చేస్తాయట రబ్బరు బొమ్మలతోనూ, లక్క




పిడతలతోనూ ఆడుకున్నట్టు వూరి పిల్లలు నిజం పాములతో ఆడుకుంటారట ఈ పాములలో విషపూరితమైన నాగు పాములూ వుంటాయట-ఏంటబ్బా నమ్మబుల్‌గా లేదే! గోటూ మయూర్ ఖండ్! □

జనం వున్నారు చూశావా? వాళ్ళు బీదవాళ్ళని దోచుకునే వాళ్ళు, వాళ్ళు స్థలాలు ఆక్రమించుకునే వాళ్ళు వీళ్ళు దొంగతనాలు, హత్యలు చేసేవాళ్ళు అదిగో వాళ్ళు మానభంగాలు చేసేవాళ్ళు ఇదిగో వీళ్ళు దబాయించి బతికేవాళ్ళు అంది అవినీతి

అబ్బ! ఇంత అందమైన వాళ్ళని నేనెక్కడా చూళ్ళేదు అవునుమరి అతనెవరు? ఏవిటో తనలో తానే మాట్లాడుకుంటున్నాడు' అడిగాడు నీతి పరుడు

"అతనా? తను గొప్ప నీతిపరుడ్ని అని ఉపన్యాసం ఇస్తున్నాడు" అంది

## అవినీతిని అంతమొందిస్తా

అతను యిక్కడ వుండటం తమాషాగావుందే? అన్నాడు ఇందులో తమాషా ఏముంది? అబద్ధాలాడటం కూడా అవినీతిలో భాగమేకదా? అంది

అంతలో అక్కడికి ఓ భటుడు పరుగెత్తుకుంటూ వచ్చి అవినీతి రాణీ వందనములు! మన వేగులవాళ్ళు తెచ్చిన వార్త అవినీతిని అంత మొందిస్తానని శపథంచేసి ఓ నీతిసింహుడు బయలుదేరాడట అన్నాడు

'ఆ సింహం సంగతి మేం చూస్తాం! నువ్వింక వెళ్ళవచ్చు' అంది అవినీతి భటుడు వెళ్ళిపోయాడు

"ప్రియా వారం రోజులు నాకు వేరేపనివుంది నువ్వు విశ్రాంతి తీసుకో నీకు ఏ లోటూ లేకుండా నా చెలికత్తెలు చూస్తారు' అంది వెళ్ళిపోతూ

నీతిపరుడు తల విదిలించుకున్నాడు అవినీతిని 'అంతమొందిస్తా అవినీతిని అంత మొందిస్తా " ఈ శపథం ఎక్కడో విన్నట్టుగా వుందే? ఎవరు ఏ సందర్భంలో చేసారు. ఏమిటో తీలగా గుర్తువుంది బహుశా తనకు పోయిన జన్మ జ్ఞాపకాలు వస్తున్నాయా? □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1987 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము. గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాదిక్రమంలో ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

**ముగింపు తేదీ : 22 ఆగస్టు,1987**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు 700/- చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకులబాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 750/-, రు 650/-, రు 550/- వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్కదానికీ అదనంగా రు 350/- చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము

## నిబంధనలు

1 కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ వ్రాత ప్రతి పన్నెండు అర రావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి వ్రాతప్రతిపై "1987 దీపావళి కథల పోటీకి ' అని మొదటి పేజీపైభాగంలో స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన, రేడియోలో ప్రసారం అయిన ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు

4 రచయితలు, రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము.

6 పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది

7 రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

■ పోటీకి పంపే కథలు 22 ఆగస్టు 1987కి గానీ, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితోపాటు తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు జత పరచి పంపనవసరం లేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి పీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేస్తాము ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత(త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యం కాదు వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు

11. పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పైభాగంలో '1987 దీపావళి కథల పోటీకి ' అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చెయగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

## నిత్య నూతన సీరియల్

### కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ



# వేయిపడగలు

రామచంద్ర రాజును చూడక, దేవదాసిని చూడక మరల మోటారు ఎక్కి రాత్రి బెజవాద చేరెను సూర్యపతి నిద్ర పోవు చుండెను ఎవరో తలుపు తీసిరి పోయి అతిదులు నిద్రించు మేడమీది గదిలో ముసుగు పెట్టుకొని ఆలోచించి నంతసే పాలోచించి తరువాత నిద్ర పోయెను

సూర్యపతి ప్రక్కలో కూర్చుండి లేవయ్యా! ఇంక నిద్రలో! అని చక్కిలిగింతలు పెట్టు చుండగా నిద్ర మేల్కొని అబ్బా! రాత్రి నిద్ర లేదు ఇంక కొంచెము నిద్రపోనిమ్ము అని బ్రతిమాలియు అతడు చేసిన అల్లరికి విధిలేక లేచి కూర్చున్న దర్మారావును సూర్యపతి అప్పుడే తిరిగి వచ్చినా వేమి? అని ప్రశ్నించెను

దర్మా రాణిగారికి మూడు నెలల నుండి జబ్బుట, నేనామెను దర్శనమయిన చేయుటకు వీలులేక పోయినది రాక్షసులు స్వర్గమును ఆవరించెరనగా మునుపేమిటో తెలిసినది కాదు

సూర్య ఇంక జరగ వలసిన పని ఏమిటి?

దర్మా నీవు నా కొక యిరువది రూపాయ

(గత సంచిక తరువాయి)

తీయవలయును నేను పోయి గుంటూరులో వున్న చిన్న అప్పులు వదిలించుకొని మా అమ్మను, నా భార్యను తీసికొని సుబ్బన్న పేటకు మరల చేరెదను ఇల్లున్నది కదా నాయని పుణ్యమున

సూర్య మరి చదువేమి చేసెదవు?

దర్మా చదువా? అది రాణిగారితో నే పోయినది

సూర్య గుంటూరులో అప్పులన్నియు ఏమాత్ర మున్నవి?

దర్మా నీవు తీర్చెదవా? ఎనుబధి రూపాయ లున్నవి జీతము నలువది కట్టవలయును మరల పాఠశాలలో చేరినచో

సూర్య సరేకాని నేడు పెద్ద సంగీత సభ ఎవరో మహారాష్ట్రులు రాత్రి సంగీతము విని, గుంటూరు రేపు వెళ్ళెదవు కాని

దర్మా ఊరకే వెళ్ళి చేయునది ఏమియు లేదు నీ విర్వది రూపాయలు ఇచ్చినచో వెళ్ళెదను మరల తీర్చుదునులే

సూర్యవతి దర్మారావును బుగ్గమీద ఛటీలున చరచెను దర్మారావునకు మంచి దెబ్బ తగిలెను సూర్యపతి నవ్వుచు మరల ఇచ్చెదవా? ముందర నీ దెబ్బ యిమ్ము అనెను దర్మారావు మంచి బొమిక బలము కలవాడు నవ్వులాడుచు ఆడెడు దెబ్బలాట లలో ఎప్పుడును దర్మారావే గెలుచును కాని వారిలో వారు మరల కొట్టుకొనుటలు లేవు

సూర్య ఆ రోజున రాఘవరావు చేత దెబ్బ తిన్నావు నేడు నాచేత దెబ్బ తిన్నావు నీ కర్మము దెబ్బల వ్రాతయే!

ధర్మా ఛీ! దుర్మార్గుడా! నోరు మూయుము ఎంత దెబ్బ కొట్టినావు ప్రొద్దుననే! మళ్ళీ చెయ్యి పట్టుకొన్న ఏడ్చెదవు!

సూర్య లేకపోయిన మరల ఇచ్చునటు! ఇంక ఎపుడు అనవుకదా?

దర్మా సరే అయిన ఊరకనే యిమ్ము నా సొమ్మే మయిన పోయినదా? ఏడ్చి పోదువని మరల ఇత్తు నన్నాను

తరువాత ఇద్దరును కృష్ణా స్నానము చేసిరి రాత్రికి సంగీత సభకు పోయిరి ఒక కుఱ్ఱవాడు— పది

యిండ్లవాడు- బహు యంత్రముల మీద గానము చేసెను. అందరును మెచ్చుకొనిరి కొందరు "వాని తండ్రి కొన్ని కీర్తనలు మాత్రమే ఆ యంత్రములమీద వాయించుట నేర్పెను కుఱ్ఱవాడు వా రన్నట్లుగా పెద్ద సంగీత జ్ఞానము కలవాడు కాదనిరి కాని మెత్తని మనస్సులుకల స్నేహితు లిద్దరికి వాడనిన ఎంతో మెచ్చుదల అయ్యెను ఆ కుఱ్ఱవాడు సాగర సంగీతమని ఒక బూరగుండ ఒక మధుర ధ్వని చేసెను ఆ ధ్వని సుమనోహరమై తన్నిశ్వాసమయ ప్రశాంతశ్రుతితో మేళనము పొంది సభ్యులనందరను సమ్మోహితులను చేసెను మిత్రు లిద్దరకు- ఒడళ్ళు తెలియనేలేదు తరువాత అతని అక్కగారు వచ్చి సంగీతము పాడెను మహారాష్ట్ర స్త్రీల సౌందర్య మంతయు ఆ బాలికయందే గోచరించెను కొంచెము వెడల్పయిన దవుడలు, విశాల ఫాలము ఫాలమున పెద్దదియు, చిన్నదియు కాని కుంకుమ బొట్టు, చొక్కముగా చుట్టిన శిరోజములు, ముంగురులు మెట్లు మెట్లుగా అమర్చి అచట నుండి తీసిన ప్రక్క పాపట, తెల్లని చీర మహారాష్ట్రులు కట్టినట్లు గోచిపోసి గోచి జీరాద కట్టినకట్టు, మోహినీ దేవతవలె ఆమె రంగమునకు అవతరించి సన్ననై హృదయ కుహరమున ప్రేమ బావమువలె చొరబాఱిన కంఠస్వరముతో హంసధ్వని రాగమును కొంచెమాలాపించి "రఘునాయకా! నీ పాదయుగము అన్న త్యాగరాజ కృతిని అందుకొని ఆమె చేసిన గానమునకు సభ్యులందరును సమ్మోహితులైరి ఆనాడు రెండు వేల రూపాయలు వసూలయ్యెను

ధర్మా ఇవ్వేళ ఏకాదశియా? అన్నట్లుగా ఆ గాయకిమీద మనస్సుతో ఇంటిలోపోయి పరుండి మాత్రమేమి లాభములే?

సూర్య నీవో! భీష్మాచార్యులు దిగివచ్చినాడురా అబ్బా!

ధర్మా కాదు కాని. ఏమి మాధుర్యమోయి! అమె అప్సరస కాని మనుష్యస్త్రీ కాదు ఏమి పెదవులోయి అవి!

సూర్య అంతటతో ఆగు తేవు గుంటూరులో ఇంకొక మోస్తరు పెదవులున్నవి. చెడిపోయెదవు

ధర్మా : మాటకు మాట బదులు తీర్చుదాక ప్రాణమొప్పదు. రాత్రియు నిద్ర లేదు పండుకొందము పట్టు

సూర్య . ఎప్పుడును నిద్రయేనయ్యా నీకు? కుంభకర్ణుడవు మరల ఈ యుగములో పుట్టినావు సరేకాని సంగీతము పాడుచుండగా మన కెందుకంత ఆనందము? పాడెడివారు సంగతులు వేయుచుండగా అవి మనకును వచ్చినట్లే ఉండును మరల అది చేతకాదు నాకిది ఎప్పుడును చిత్రముగా ఉండును

ధర్మా నాకు నిద్ర వచ్చుచున్నది నిద్రపోనీ!



ధర్మారావు సూర్యపతు లిద్దరు ఇంటికి బయలు దేరిరి అది మొదలు రాత్రి నిద్రపోవువరకు ఆ యువతీ గాన ప్రశంసయే తక్క వీ రింకొకటి చేయలేదు అతడా హా హా ఇతడా హా హా!

ధర్మా రెండు గంటలయినది పోయి పండుకొనుము

సూర్య : నేనివ్వేళ ఇచటనే పండుకొందును

సూర్య ఇది ఏమిటో ఎందుకో చెప్పి నిద్రపో! లేకపోయిన ఇవ్వేళ నిద్రపోయినావే! నన్నెరుగుదువుగా!

ధర్మా గోల నీతోను లోకమంతయు ఐదు భూతములు అయిదు తద్గుణములు -ఐదింద్రియములు ఆ అయిదు భూతగుణములు నీ యింద్రియములకు విషయములు ప్రపంచక మంతయు ఈ యింద్రియ తద్విషయములలో ఇమిడియున్నది ప్రతిమనిసియు పంచభూతము లయు, తద్గుణములయు ప్రతిబింబించు స్థలము అనగా ఇతనియందు సూక్ష్మ రూపమున అవి అన్నియును ఉన్నవన్నమాట కాని మానిసి అజ్ఞానముచేత ఆవరింపబడినవాడై యీ సర్వము తానే అని తెలిసికొనలేదు ఛాయగా ఈ సంగతి అతనికి తెలియును దానినే తెలిసీ తెలియని స్థితి అందుము ఈ తెలియకపోవుటలో తెలియుటయు కలదు మనిసి సామాన్యముగ ప్రపంచమునందున్న సర్వ బోగ పదార్థములు వాంచించును అంతయు అనుభవించగల శక్తి అతనియందున్నది కనుకనే అట్లు వాంఛించును కాని ఆ శక్తిని విజ్రుంభింప చేయవలయును అచ్చటనే పూర్వ జన్మ కృతకర్మ అడ్డు వచ్చును అట్లే ప్రతి వ్యక్తి యందును సృష్టిలోనున్న సర్వ శబ్దము బీజరూప మున సన్నిహితమై ఉండును తచ్ఛబ్దానుబావ మతని సూక్ష్మ శరీరికి కలదు కాని స్థూల శరీరికి లేదు సంగీతము వినుచుండు తన్మయత్వస్థితిలో మన మందఱము ఆ సూక్ష్మశరీరికి దగ్గఱగా ఉండి అత డెఱిగిన సర్వ శబ్దానుభవము పొందుచుందుము అందుకనియే ఆనందము పొందుచుందుము ఆనంద మా సూక్ష్మ శరీరి లక్షణములలో ఒకటి ఈ దేహమునకు ఆనందము లేదు దేహగతాత్మకును లేదు తదతీతమైన ఆత్మకు కలదు తదతీతాత్మకు సన్నిహితముగా ఉండుటయే కళలు ఆనందించు నపుడు మన ముందునట్టి స్థితి కళలు దైవికములని చెప్పుట కూడ ఇందుకనియే తెలిసినదా? నాకు కన్నులు మూసికొని వచ్చుచున్నవి నేనింక ఆగలే నబ్బా! నాకు మఱల జబ్బు కూడ చేయును

మరునా డిద్దరును ప్రొద్దెక్కి లేచిరి కృష్ణా స్నానము చేసిరిసూర్యపతి నాడు కూడ ఉండుము అనెను ధర్మారావు ఇంటి దగ్గఱ తినుటకు కూడ ఏమియులేదు నేను లేకున్నచో మా అమ్మ మఱియు దిగులుపడును పోవలయును"అనెను

ఆ మధ్యాహ్నము సూర్యపతి పంద రూపాయలు తెచ్చి ధర్మారావునకిచ్చి ముందర జీతము కట్టి చిన్న

# వేయి పడగలు

అప్పులు తీర్చుము, మఱల నెలనాటికి తక్కినే దిచ్చెదను అనెను ధర్మారా వాశ్చర్యపోయి మఱల చదువుమందువా? అనెను సూర్యపతి ఊ! అని వెక్కిరించెను ధర్మారావు ఇది కాశ నాల్గు వందలకు తక్కువ కాదు తెలియునా? అనెను

సూర్య పోవయ్యా! పిచ్చి బ్రాహ్మణుడా!

ధర్మా నేను పిచ్చి బ్రాహ్మణుడను కాను, నీవు పిచ్చి కమ్మవాడవు!

ధర్మారావు తిరిగి గుంటూరు వచ్చెను వచ్చుటునే నాయరు దుకాణమునకు పోయెను అతని దుకాణము మూసి ఉన్నది వచ్చుటతోడనే అతని డబ్బుతనికిచ్చివేయవలయును అని తహతహ పడుచున్న ధర్మారావు కొడలంతయు జెఱ్ఱులు ప్రాకినట్లయ్యెను నాయరిల్లు తెలిసికొని అచటికి పోవలయునని ప్రక్కనున్న దుకాణదారుని అతని యిల్లడిగెను అతడు "అయ్యా, నాయరు గ్రామములో లేదండి రామేశ్వర యాత్రకు పోయెను అని చెప్పెను ధర్మారావు ప్రాణము నీరసించిపోయెను

మఱల ఎన్నాళ్లలో వచ్చును?

'అతని చేతికి రెండు వందల రూపాయలు' వచ్చెను అవి ఖర్చుపడువఱకు తీర్థయాత్రలు సేవించి తరువాత వచ్చునండి ఎప్పుడు వచ్చునో తెలియదు ఎప్పు డతని చేతిలో రెండు వందలు మిగులునో అప్పుడెల్ల ఇదేపని సుమారు రెండు నెలలలో రావచ్చును

ధర్మారా వింటికి పోయెను అచ్చట రాఘవరావు కూర్చుండి ఉండెను ఇద్దరును కలసి సందర్భము లన్నియు ప్రసంగించుకొనిరి ఇదివరకే సూర్యపతి రామవరావునకు సాహాయ్యము చేయుచుండెను మఱల ఇప్పుడు ధర్మారావునకు కూడచేయుట తామిద్దరును కలసి తమ మిత్రుని మంచితనమును చూఱగొనుటయేమోనని విచారించిరి కాని ఏమి చేయుదురు? గత్యంతరము తోచలేదు

ధర్మారావు మఱల కొంచెము వెసులుబాటు చిక్కి తన బుద్ధి చదువుమీద మరల్చెను ఆనాడు సాయంతనము ఆముక్తమాల్యద తెచ్చి అది చదువుట ప్రారంబించెను

అరుంధతి 'కాపురమునకు వచ్చిన తరువాత ధర్మారా వేమియు చదువలేదు అతని కాలము సంసారపు చిక్కులతోడను అరుందతీ ప్రణయ కథల తోడనే కడచినది ధర్మారావు ప్రతిదినము రాత్రులందు బోజనముచేసి తల వైపున ప్రక్కవద్ద దీపముపెట్టి చదువుటకు ఆరంభించును ఆ చదువుట చదువుట తెల్లవారు కోడి కూయువఱకు అట్లే చదువును ఈరీతిగా అతడు ఇంగ్లీషు నవలలు, తెలుగు నవలలు తెగ చదివెను చిన్నపుడు తెలుగు నవలలే ఎక్కువగా చదివెడువాడు కాని దినములు కడచిన కొలది ఆ పుస్తకములన్నియు ఎందుకు గొఱగానివని అతనికి తెలిసెను వంగబాష నుండియు, మహారాష్ట్ర బాష నుండియు సహస్రములుగా అనువదింపబడిన యీ నవలలు క్రమ క్రమముగా అతనికి దుష్టములై తన మాతృ బాషామూర్తికి శ్లీపద వ్యాధి (బోదకాలు వ్యాధి)ని కలిపించినట్లే తోచెను అతనిబుద్ధి సరిగా వికసించని ఆ రోజులలో అవి చదివెనుగాని యిపు డతనికి వాని పేరు చెప్పిననే ఒడలు మండు చుండెను

తరువాత అతడు ఇంగ్లీషు నవలలు చదువ ఆరంబించెను తెలుగువానికన్న అవి చాల బాగున్నవని అత డూహించెను స్కాటు, డిక్కెన్సు, థాకరీ - వీరి నవలలు కొన్ని పార్య గ్రంథములుగా చదివి, వారి తక్కిన నవలలు కూడ తెచ్చి చదివి వారే పరమోత్తములని ఊహించుచుండెను

ఆమధ్య మధ్య తెలుగు ప్రబందములు చదువు చుండెను అతనికి తెలుగు ప్రబందములయందున్న రుచి తక్కిన వేనిమీదను కుదురలేదు ఇంగ్లీషు చదివినను ఆ గ్రంథములలోని బావములే అతనికి దెలియుచుండెను కాని ఆ బాషలోని మార్దవము, తేజస్సు, ఓజస్సు, ప్రసాదము మొదలైన కావ్య గుణములు అతనికి తెలియుటయే లేదు షెల్లీ, కీట్సు మొదలయినవారి కవిత్వము చదువును, కాని వారి శయ్యాపాకాదు లెట్టివో బుద్ధికందుటలేదు శ్రీనాథుడు, పెద్దన వీరి శయ్యల సామ్యము మఱల అందులోని వైలక్షణ్యము, ప్రబావతి, బారతము వీనిలోని సామ్య వైలక్షణ్యములు, ఇట్టి తక్కిన తెలుగు కవుల సర్వ ప్రబంధముల యందలి శయ్యా రీతులలోని బేదములు సూక్ష్మతరముగా అతని హృదయమునకు అచ్చు గ్రుద్దినట్లు తోచు చుండెను కాని, యీ యింగ్లీషు కవుల రచనలలోని శయ్యారీతుల భేదము అతని హృదయము అందు కొనలేకుండెను

అతని కింకొక ఊహ, తత్తద్బాషలయందలి ఆ ఆ వైచిత్ర్యముల సమగ్రత అర్థమగుటకు ఆ దేశము నందు జన్మించి ఆబాష చిన్నప్పటినుండి మాటాడిన గాని తెలియదనో ఒక జాతి గుణములు, మతాబి ప్రాయములు తజ్జాతి రక్తమునం దెట్లుండునో ఆ జాతి మాట్లాడు బాషలోని సమగ్రమైన రసబావాదులు అర్థము చేసికొనుటయు కూడ శరీరములోని తద్రక్తమువలననే సంబవించునని అతి పరిచయమువలన జరుగదా అనిన, ఆ పరిచయము సమగ్రత పొందదు, ఎచ్చటనో లోపము గోచరించుచునే ఉండును

అతని మిత్రులు చాల మంది ఆంధ్ర సారస్వతము ఆంగ్ల సారస్వతము ముందు చాలదని అతనితో వాదింతురు అతని కా తెలుగులోనున్న సొగసులు

జరిగిన కథ 19– రుక్మిణమ్మారావుగారి సాయంతో ధర్మారావు కళాశాలలో చేరతాడు పుట్టినింటిలో తాను పడిన కష్టాలను అరుంధతి ధర్మారావుతో చెబుతుంది రంగాజమ్మగారు మరణిస్తారు రామచంద్రరాజు సుబ్బన్నపేటలో స్థిరపడిపోతాడు రాణిగారి నుండి అందుతున్న ధన సహాయం ఆగిపోతుంది ధర్మారావుకి మళ్ళీ కష్టాలు మొదలవుతాయి అరుంధతికి, ధర్మారావుకి చంద్రహారం విషయంలో తేడాలు వస్తాయి ధర్మారావు నాయరు దగ్గిర అప్పు తీసుకొని సుబ్బన్నపేట పోయివస్తాడు తీవ్రమయిన అసంతృప్తితో రాణిగారిని చూడకుండా తిరిగి వచ్చేస్తాడు రంగారావుగారికి జమీందారీ తాలూకు ఆదాయ వ్యయాలు తేలవు

ఇతర బాషలలో ఉండవని అతడు వాదించును ఇంగ్లీషు చదువుకొనువారికి తెలుగు పరిచయమే తక్కువ పార్య గ్రంతములే ముక్కుకొసను పెట్టుకొని పరీక్షార్ధము చదువుదురు వారు తమకు తెలియని తెలుగు వాఙ్మయ విమర్శ యేల చేయవలయునని అతనికి కోపము

దర్మారావు తెల్లవారులు చదువుట అరుందతి ఎరుగదు ఎరిగినది తనతో తెల్లవారులు మాటాడుట

ఈనాడు దర్మారావు ఆ ముక్తను తెచ్చి యింటిలో గాని తన సెజ్జ యందుగాని అరుందతియే లేనట్లు దీపమమర్చి పండుకొని పుస్తకము తీసి చదువను ఆరంభించెను అరుందతి బోజనముచేసి వచ్చి అతనివద్ద పరుండెను అతడు తనను పలుకరించు నని ఎదురు చూచెను అతడు పుస్తకము వంకనే చూచుచుండెను ఆమె కీ క్రొత్త అనుబవము లేదు, చేతిలోనుండి పుస్తకము లాగుకొనెను లాగుకొని అతని వంక చూచెను అప్పు డరుందతి కొక సంగతి తెలిసెను ఆ సంగతి ఆమె పూర్వ మెరుగదు పూర్వ మామె ఎరిగిన సంగతి తా నతని హృదయముపై సర్వాధికారిణినని ఇదివర కతనికి కోపము వచ్చుట, వచ్చిన కోపమును తాను చలోక్తిగా వారించుట జరుగుచునే ఉండెను తనయొక్క నవ్వు, ఒక విలాసము ఒక కుపితభ్రుకుటియు అతని కోపమును విరుచుచుండెను కాని యిప్పటి అతని ముఖమును చూచినంతనే ఆమె కదలాడిపోయి, ఆ ముఖ వైఖరి తన కపరిచితమగుటచే ఏమి చేయుటకు తోచక పొత్తము మరల అతని చేతిలో ఉంచెను అతడు మరల చదువుచుండెను అరుందతిప్రక్క కొదిగి తాను బ్రతికియున్నట్లే లేకుండ తన శరీరము అతని ఒడలికి తాకకుండ ఎడముగా పండుకొని ఏమో ఊహించుచుండెను తానే అతని మనస్సునకు, హృదయమునకు రాణిని అనుకొన్నది ఈమె ఎవరు? దీనికి ప్రతి క్రియ కానరాకున్నది ఈ క్రొత్త సవతియందు కోపించ వలయునో ప్రసన్నత దాల్పవలయునో తెలియ లేదు బహుశః ఈమె తాను రాకముందే తన బర్తను వశము చేసికొన్నది కావలయును అందుకనియే అతని కామెమీద అంత ప్రేమ ఆ సవతి ముందు తాను లొంగిపోయెను ఈర్ష్యాదుఃఖ కోపములను కూడ రానీయకుండ తన పతిని వశ్యుని చేసికొన్న ఆ సవతిని ఊహించుచునే ఆమె నిదుర పోయెను దర్మారావు చదువుచుండెను

ఈ సృష్టి తక్కిన సృష్టికన్న బిన్నముగా ఉండెను రామకృష్ణుని మార్గము వేరు, ఈయన మార్గము వేరు కథ నడపుచోటి పదజాలము వేరు వర్ణనలు నడుపుచోటి పదజాలము వేరు, పదజాలమేకాదు - వాక్య విన్యాసము అన్వయము శబ్దముల కూర్పు, కుదింపు సర్వమును బిన్నముగా ఉండెను వర్ణనలు ఏమి వర్ణనలు'విల్లిపుత్తూరులోని యిండ్లు ముంగిళ్ళు దిగుడుబావులు దేవాలయము, రథములు, అచటి జనులు తద్వర్ణనమునందలి సూక్ష్మ విషయములు చూచి












# వేయి పడగలు

చూచి దర్మారా వింతకన్న సమగ్రమైన శిల్పము తెలుగున లేదని నిర్ణయించెను

ప్రక్కనున్నవారి యింటిలో గడియారము గంటలు కొట్టుచుండెను దర్మారావు చెవియొగ్గి వినెను మూడు కొట్టెను అబ్బో! చాలసేపయిన దని పుస్తకము మూసెను దీపము తగ్గించి పొత్తము దూరమునందుంచి చూచెను అరుందతి తనకు దూరముగా పండుకొని నిద్రించుచున్నది అప్పు డతని కామె తన చేతిలోని పొత్తము తీసికొనుట తాను తిరస్కరించుటయు మనస్సునకు తెలిసెను ఆమె వచ్చిన ఈ ఎడెనిమిది నెలలుగా ఆమెను తానట్లని ఎరుగడు తానేమన్నాడు" అతని మనస్సునకేమో అన్నట్లే ఉన్నది

అరుందతి నిన్న తాను తెచ్చిన తెల్లని చీర దాల్చినది కనులకు కాటుక పెట్టినది మెడలో చంద్రహారము దాల్చినది వ్రేలియందుంగర మున్నది మొగమున గుంకుమబొట్టు మెరయు చున్నది అత డామెను దగ్గరకు తీసికొనెను అంతలో ఆమెకు మెలకువ వచ్చెను పతి తన్ను దగ్గరకు లాగుకొనుచుండెను ఆమె లాగబడెను ఆ లాగబడుటలో పరిచితి, అపరిచితి సన్ని హితత్వము దూరము అంగీకారము అనంగీకారము, కోపము, ప్రసన్నత మొదలగు పరస్పర వ్యతిరేక బావములు విచిత్రముగా గోచరించెను పతి కౌగిట చేరిన తరువాత ఆమెకు ఒక

అనుమానము తగిలినది తాను పొరపాటుపడెను ఆ సవతికన్న తన బర్తకు తానే ఎక్కువ ప్రేయసియేమో?

దర్మారావు ఆముక్తమాల్యద వారము రోజులు చదివెను ఆ గ్రంథమువంటి గ్రంథము మరల తెలుగులో లేదు ఏ బాషలోనను లేకపోవచ్చు అది పెద్దనగారే వ్రాసిరేని ఆయనకు ఆంధ్ర కవితా పితామహ బిరుదము బిరుదమేకాదు కాని ఎంతసేపటికి అతనికి కృష్ణరాయలే అది వ్రాసెనని పెర్లీకి రెండాత్మలున్న వన్నారట ఆముక్తమాల్యద కర్త కాలెక్కను పది ఆత్మలున్నవేమో? దర్మారావునకు సహజముగా పూర్వాంధ్ర రాజులన్నను ప్రస్తుతాంధ్ర దేశపు జమిందారు లన్నను గౌరవము మెండు అతని కాముక్త కృష్ణరాయలు వ్రాసెనన్నదానిలో ఉన్న ఆహ్లాదము పెద్దనగారు వ్రాసిరనుటలో కన్పించలేదు ఆముక్తమాల్యదలో ఉన్నన్ని బిన్న శయ్యలు వ్రాయగలడేని పెద్దన్నగారు మనుచరిత్రలో ఏల వ్రాయలేదు? ఆ గ్రంథమున ఈ దాయలేవియు గోచరించలేదు కాదు మనుచరిత్రము బాల్యమున వ్రాసి ఆముక్త ప్రౌఢ వయస్సులో నిర్మించెనందమా? రెండును ఇద్దరు ప్రత్యేక వ్యక్తులు ప్రౌఢ వయస్సులందు పొందదగిన రెండు మహోత్కృష్టమైన కవితా పద్ధతులుగాని వేరుగావు

కావ్యమునందు కవి మూడు కథలు వ్రాసెను మూటియందు మూడు బిన్నశయ్యలున్నవి విష్ణుచిత్తుని కథలో మాధుర్యము కలదు శౌద్ధ ఖాండిక్యుల కథయందు బారత రచనా పద్ధతి తిక్కనగారి కథ నడపు రీతి ఉన్నది మాలదాసరి కథలో శ్రీనాథు చెపరాయలే ఉన్నారు దానికి సాటివ తెలుగులో మరొకచోటనె లేదు ప్రౌఢిమలో దానినిమించి తెలుగుబాష పొదగినంత శక్తి ఆ బాషకెలేదు అది గౌరీ శంకర శృంగము వంటిది

కథల నడుమనున్న దీర్ఘములైన ఋతు వర్ణనములచేత కథా రచనా శిల్పమునకు కొఱత వాటిల్లినను దోషమును పూర్వము విన్నదానిని గూర్చి విచారించెను మరల విచారించుట ఎల? చదువుచున్నప్పుడు తనకు దీర్ఘ వర్ణనములు విసుగు కలిగించెనా?

ఒక మహా కావ్యమును విమర్శించుట ఎట్లు? అది చదివిన తరువాత అందు కల బిన్న విషయములు పరస్పరము లగించినవా లేవా అని విచారించుట సరియైన విమర్శగా అతనికి తోచలేదు కావ్యమును చదివిన తరువాత విమర్శించుటకాదు చదువు చుండగనే విమర్శించుట చదువుచుండగనే ఆనందము కలుగును చదివిన తరువాత కలుగునది తదానందస్మృతి తదానంద పరామర్శ ■ పరామర్శ చేయుటలో కావ్యము చదువువేళ మనము పొందిన ఆనందమునే విచారించక తత్కావ్యగత బిన్న విషయములను గూడ మనస్సుతో విచారించి ఆ ఆయానందమునకు బిన్నమైన ఒక సంగతిని చర్చింతుము ఆముక్తము చదువువేళ ఏ కదనుగాని యీ వర్ణనలు అడ్డు తగిలి సాగనీయ

నట్నతనికి తోచలేదు ఆ తోచకపోవుటయే తత్కావ్యగత శిల్ప పరమోత్కృష్టతా ప్రమాణము

అదియునుకాక పురాణము, కావ్యము, ప్రబంధము, వీనికికల భేదములు చూడవలయును. ఒకడు చెప్పగా మనము వినుకథలో మధ్యగధా విచ్ఛేదక విషయములు కలిగించినంత మనోవ్యధ, మనము చదువు గ్రంథమందు కలిగెనేని కలిగించవు ప్రబంధము వర్ణనా ప్రధానమైనది కావున ప్రబంధమున కా విమర్శ సూత్రమే పట్టదు వీధి నాటకము వేరు, రూపకాభినయము వేరు వీధి నాటకము భావాశ్రయమైనది, రూపకము రసాశ్రయ మైనది. రెండును రెండు భిన్న సంస్థలు ఇతర కావ్యమును చూచినట్లు ప్రబంధమును చూడనే రాదు

ఒక మహా రచనయందు ప్రదాన వస్తువుతో తదంగ విషయములు చక్కగా అతుకుట శిల్పమే అదే పని పెట్టుకొని అంగ విషయములు స్వల్ప పరిమాణము కలవిగా చేసి మహా విషయముతో పొందుపరచుట ఒక విలక్షణమైన సృష్టి కావచ్చును కాని అదే సృష్టికాదు అందమైన వస్తువును విస్తరింపించి దానియందును ప్రత్యేకానందము కలుగునట్లు సృష్టించుట యింకొకరీతి శిల్పము మహా మేధావి యింతమాత్రముచేత ప్రధాన కథను అందుకోలేకపోడు ఒకానొకని మొగమందు సునిశితములై తేజోవంతములయిన నేత్రము లుండును అవి తమ దీధితిచేత ఇతర ముఖావయవములను తిరస్కరించును వాని సొగసు వానిది వానిచేతనే మొగముకూడ ప్రజ్వలించును అబ్బే! ఇవి ప్రదానమైన ముఖమున కొదిగిలేవు' అని వానిని ఎవరు తిరస్కరించరు పైగా వాని మొగములో ఉన్న సొగసంతయు వాని కన్నులలో ఉన్నదిరా' అని మెత్తురు అట్లే కృష్ణరాయల గొప్పతనమంతయు ఆయన వర్ణనలలో ఉన్నది అవి తీసివేసినచో ఆ ముక్తమాల్యదయే లేదు అప్పుడా గ్రంథము యొక్క ప్రత్యేకతయే పోయినది

ఆ మరునాడు రాఘవరావు వచ్చి ఉత్తరము వ్రాసెననియు, బెజవాడ తా మిద్దరును కలసి పోవలయుననియు చెప్పెను నాడు శనివార మగుటచే ఇద్దరును బెజవాడకు చనిరి బందరు నుండి కిరీటిరావును వచ్చెను నలుగురు మిత్రులు సమావేశమయిరి మరల పూర్వపు దినచర్య జరిగెను ఆ రాత్రి మరల మహారాష్ట్రుల సంగీతసభ అందరు పోవలెననిరి అసలందుకనియే సూర్యపతి కబురంపినది

ఆ సాయంకాలమున నలువురు కృష్ణ ఒడ్డునకు వాహ్యాళికి చనిరి అచట కిరీటి ఎరిగిన ఒక యువకుడుండెను కిరీటి అతనిని తన ముగ్గురు స్నేహితులకు పరిచితుని కావించుచు ఇట్లు చెప్పెను

కిరీ వీరి పేరు రాదాపతిగారు వీరు బి ఏ పరీక్ష యిచ్చినారు వీరు కవులు హిందీ, వంగ బాషలు కూడ చదివిరి

నూత్న పరిచితులందరు ఒకరినొకరు గౌరవించు కొనిరి ప్రొద్దుక్రుంకువేళకు వీరు నలువురింటికి వచ్చిరి

ధర్మా కిరీటి! రాధాపతి చాల నవ నాగరికునివలె ఉన్నాడే

కిరీ అవును అతడు మన దేశాచారములు అన్నియు అబివృద్ధి బంగకరములనియు, మన సారస్వతము కూడ ఇతర దేశ సారస్వతములతో తులతూగదనియు అభిప్రాయము కలవాడు అందుకనియే ఈయన వంగబాషనుండి కొన్ని గ్రంథములు తెలుగు చేసినాడు వాఙ్మయమును గూర్చి మంచి విమర్శ తెలిసినవాడు సంస్కృతమును చదివెనట

దర్మా మనిషి కొంచెము వేష బాషలలో నూతనుడు

కిరీ బాహిర సౌందర్యము హృదయ సౌందర్యము నకు చిహ్నమని అతని ఊహ క్రాపింగు చెరగ నీయడు కట్టిన బట్ట మాయనీయడు ఎప్పుడును పూవువలె ఉండుటకే ప్రయత్నించును మనిషి కూడ అందమైన వాడు కదా!

ధర్మా ఏమైన ఆస్తి కలవాడా?

కిరీ సాలుకు మూడు నాలుగు వేలు వచ్చును

ధర్మా అట్లు చెప్పుము అందుకనియే ఆడిన ఆట సాగుచున్నది ఏదియో వచ్చెడు వీలున్నది కదా ఉపరి!

(ఇంకా ఉంది)





"శ్రితకమలా కుచమండల... జయ జయ దేవహరే!"

(చిత్రం: డా. ఎ.హెచ్. మురళీ కృష్ణారావు, బొబ్బిలి)

# విశ్వమానవుడు అందరి దేవుడు శ్రీకృష్ణుడు!

కృష్ణ తత్వాన్ని గురించి చర్చించడమంటే ఒక మహా సాగరాన్ని మథించడమే అవుతుంది. ప్రకృతి తత్వానికి పరాకాష్ఠగా కృష్ణతత్వం పరిణమించిందని పిస్తుంది. పసితనం, వనితనం, ధర్మ పరాక్రమం, కర్మాచరణం, త్యాగనిరంజన సౌజన్యం, క్రియోద్దీప విశ్వ సౌమనస్యం, దుష్ట శిక్షణా సంరంభం, శిష్ట రక్షణా పరితేజం అన్నీ కలిస్తే కృష్ణపరమాత్మగా రూపు దాల్చుతాయి. నిఖిల మానవాత్మగా నిరతం నిలిచే ఉంటాయి.

## మూలతత్వవేత్త

వెన్న తినేవాడు మన్ను తినడం విచిత్రం కాదా? వెన్నలోనూ మన్నులోనూ ఉన్న మూలతత్వం ఒకటేనని తెలియ జెప్పే ఈ ఉదంతం భారతీయ అనంత వైజ్ఞానిక పరిణతికి ప్రతీక కాదా? నోరు తెరచి విశ్వం మొత్తాన్ని తల్లికి ప్రదర్శించి చకితను చేసిన చిన్ని కృష్ణుని లీల కట్టు కథే అనుకున్నా విశ్వంలో మనిషి స్థాయి ఏ పాటిదో, మనిషికీ విశ్వానికీ ఉన్న సంబంధ బాంధవ్యం ఎలాంటిదో, ఈ సమస్త భువనాల క్రియాశీలతకు మూలకర్త - మహాశక్తి - ఎవరో, దాని స్వరూప స్వభావాల పరంపర ఏమిటో చూఛాయగానైనా ఈ కృష్ణలీల ద్వారా స్పష్టంగా బోధపడడం భారతీయ శాస్త్ర పరిజ్ఞానానికి ఒక మచ్చు తునక.

ధర్మానికి ప్రతిరూపమైన మానవుడిగా భగవంతుడిగా మనం కొలుచుకునే శ్రీరాముడు మూర్తీభవిస్తే, లీలామానుష వేష ధారిగా శ్రీ కృష్ణుడు మనకు సాక్షాత్కరించినాడు. కృష్ణపరమాత్మ ఆబాలగోపాలం పాలిట ఆయస్కాంతం కాగా రామభద్రుడు ఆదర్శప్రాయుడు మాత్రమే అయినాడు. పోతే రామతత్వం బోధపడనంత కృష్ణుని వ్యక్తిత్వాన్ని లోతు గుండెల నుంచి దర్శించాలి. పలుమార్లు పదే పదే తరచి చూడాలి.

## విశ్వశ్రేయోమూర్తి

కర్తవ్య నిర్వహణలో బంధుప్రీతి లేని దేవుడు కృష్ణుడు. స్వంత మేనమామనే అతని దుష్టత్వాన్ని భరించలేక మట్టు పెట్టినాడు. కృష్ణుడు శరణాగత వత్సలుడే కాని పక్షపాతి కాదు. పాండవుల మనిషిగా ఉన్నది ధర్మం మీద ఉన్న మమకారంతో నే కాని వారి మీద ఉన్న అభిమానంతో కాదు. కృష్ణుడి స్నేహం అంచులు లేనిది. అతడితో నేస్తం కట్టిన సుధాముడు ధన్యుడై పోయాడు. కృష్ణుడి ప్రేమ జీవితం ఎవరికైనా మార్గదర్శకం. రుక్మిణిని ఎత్తుకొని వచ్చి మొదటిసారిగా ప్రేమ వివాహం జరుపుకున్నవాడు ఇతడే. వధూవరుల ఇష్టాయిష్టాలకే ప్రాధాన్యం ఇవ్వాలి కాని కులమతాలకు, ధనరాశులకు కాదని ఆ నాడే తెలియ చెప్పిన మహాపురుషుడు కృష్ణ భగవానుడు.

## రాజనీతిజ్ఞుడు

శ్రీ కృష్ణుని రాజనీతి అనన్య సామాన్యమైనది. రాయబారిగా అతడు నిర్వర్తించిన తీరు ఏ దేశ కాల పరిస్థితుల కైనా విశ్వ శ్రేయస్సుకు ఒక కరదీపికలా భాసిస్తుంది. ఐకమత్యం లోపిస్తే, దుష్టుల సలహాలకు తావిస్తే, రాజ్య కాంక్షతో కళ్ళు మూసుకుపోతే, పదవీ వ్యామోహమే పరమార్థమైతే- జాతికి కలిగే సంక్షోభం ఎటువంటిదో, జనతకు సంభవించే ఉపద్రవం ఏ పాటిదో కృష్ణమూర్తి సునిశితంగా వెల్లడించినాడు. ఇతడు చెప్పిన అంశాలు ఎవ్వరూ కాదన లేరు. వాస్తవాలను అంగీకరించ కుండా

## రాసక్రీడ

సామాన్యులు సాధారణంగా అపార్థం చేసుకునే విషయం రాసక్రీడ. పదునారువేల మంది గోపికలతో కృష్ణుడు సరస సల్లాపాలు సాగిస్తూ రమించడాన్ని రాసక్రీడగా రాసలీలగా ఎంతో మంది అనుకొంటూ ఉంటారు. ఇది నిజమే అనిపించేలా భ్రమ గొలుపుతూ రకరకాల గ్రంథాలు చోటు చేసుకొన్నాయి. అష్ట భార్యలతో స్వర్గసుఖాలు అనుభవించే వ్యక్తికి గోపికలు అవసరం అని ఎవరూ అనుకోరు. గోపికలు కోరికలు. ఇక్కడ రమించడం అంటే పరమాత్మలో ఐక్యమవ్వాలన్న కామనే తప్ప మరొక్కటి కాదు. ఇది మధుర భక్తికి ముగ్ధ భక్తికీ సంకేతమే కాని విచ్చలవిడి జారతనానికి మూలం కాదు. రాసక్రీడ అనేది ఒక నృత్య విశేషం మాత్రమే. కృష్ణుడు ఆ నృత్యంలో ప్రవీణుడనేది వేరే విషయం. ప్రతి గోపిక అంటే ప్రతి కోరిక తాపాన్ని తొలగించి గమ్యాన్ని చూపి పరమార్థ పథాన్ని, పరమాప్త సాధనాన్ని, పరమాత్మ వైభవాన్ని నిర్దేశించే మానసిక ఆత్మిక భావ సంగమమే రాసలీల. ఆ లీలకు మానుషధారి కృష్ణుడు మాత్రమే. అంతేకాని హీనమైన వ్యభిచార దృక్పథంతో వివరణలు ఇవ్వడం సమాజోన్నతి పట్ల శ్రద్ధలేని వారు, ప్రజా సంక్షేమాన్ని నిరసించే వారు మాత్రమే చేయగలరు.

## గీతాచార్యుడు

పరంధాముడుగా కృష్ణుడు లోకారాధ్యుడు కావటానికి అతని గీతా బోధనమే మూల కారణం అని చెప్పవచ్చు. గీతాచార్యుడిగా భారతీయ ధర్మ సౌందర్యాన్ని తత్వ వైచిత్ర్యాన్ని దశదిశలా ప్రభవించేలా చేసిన కారణ జన్ముడు కృష్ణుడు. శాతం గణనీయంగా ఉంది. శాస్త్రీయ దృక్పథంతో కృష్ణుడు ఇచ్చిన వివరణలు భారతీయ మేధా సంపత్తికి అవగాహనా స్ఫూర్తికి ప్రత్యక్ష నిదర్శనాలు. ప్రపంచంలోని పలు ప్రాంతాల వారు భగవద్గీతను ఒక అమూల్యమైన విజ్ఞాన ఖనిగా మానవ సంస్కారధునిగా గుర్తిస్తున్నారు. ఎంతో మంది భారతీయులకు గీత పవిత్ర గ్రంథం అవడంలో ఆశ్చర్యం లేదు. అభ్యంతరం అంతకన్నా లేదు!

## నిత్య ప్రతీక

మానవుడిలోని అన్ని లక్షణాలకు నిత్య ప్రతీకగా నిలిచిన కృష్ణుడు మరణం ముందు తలవంచాడు. ఒక బడుగు బోయవాడి బాణం దెబ్బకి తల వాల్చాడు. కాల ప్రభావం విశ్వ శక్తి ప్రమేయం. మానవ పరిధికి అందని నిత్య రహస్యాలన్న బహిరంగ రహస్యాన్ని యావద్జాతికి తేట తెల్లం చేసిన వజ్ర సంకల్ప బలుడు కృష్ణుడు.

## అందరి దేవుడు

కృష్ణుడిలోని మహోన్నత లక్షణాలు అతడిని దేవుడిని చేసాయి. అందుకే ఎంతో మంది భారతీయులకు కృష్ణుడు ఆరాధ్య దేవుడైనాడు. కాదు చరిత్ర పురుషుడే అని అనుకొన్నా విశ్వమానవ భాగ్యోదయానికి ఆదర్శప్రాయుడవుతాడు. కృష్ణుడు అబద్ధం, గీత అబద్ధం అంతా కట్టు కథలని అనుకున్నా ఆ కథలను అల్లిన వారి మానసిక సమతుల్యతకు, ఆత్మిక దివ్య సౌహార్ద్రతకు, సాంఘిక సేవా భావనకు, మానవోద్ధరణాభిలాషకు- శిరస్సు వంచి త్రికరణ శుద్ధిగా నమస్కరించక తప్పదు.

"ఓం శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః" అని అనాలని పించక మానదు.

# అభిమాన తారలపై అభిప్రాయం

'ప్రాణం ఖరీదు' చిత్రం ద్వారా తెలుగు తెరకు పరిచయమై అనతి కాలంలో ప్రేక్షకుల హృదయాల్లో ఓ ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న డైనమిక్ హీరో చిరంజీవి నా అబిమాననటుడు మొన్నటి 'ఇంట్లో రామయ్య వీదిలో కృష్ణయ్య' నిన్నటి 'ఖైది' నేటి 'ఆరాధన' లాంటి చిత్రాలు ఎన్నో చిరంజీవి నటనా



వైదుష్యానికి మచ్చు తునకలు కథా బలం లేని 'వేట'- లాంటి చిత్రాలలో నటించవద్దని అబిమానిగా నేనిచ్చే సలహా 'శుభలేఖ' 'అబిలాష' 'విజేత' 'ఆరాదన' లాంటి కథాబలం గల చిత్రాలలో నటించి ప్రేక్షక హృదయాలలో చిరంజీవిగా నిలచి పోవాలని నా అబిలాష

–బి లక్ష్మీనారాయణ, మధిర

★ ★ ★

జాతీయ అవార్డు గ్రహీత, అందాల సహజ నటి లక్ష్మి నా అబిమాన నటి పలు బాషా చిత్రాల్లో నటిస్తూ, అన్ని బాషలనూ తనకు తానే మాట్లాడుకో గల్గిన ఏకైక నటి ఆమె ఆమె అద్భుతంగా నటించిన పంతులమ్మ చిత్రం చూసి ఆమె అబిమాని నయ్యాను బాబు, జీవనతరంగాలు, ప్రేమ మూర్తులు చిత్రాలలో ఆమె ఎంతో చక్కగా నటించారు తమిళంలో విజయవంతంగా ప్రదర్శింప బడిన శిరై సంసారం అదు మిన్సారం చిత్రాలకు తెలుగు వర్షన్‌లో ఆమె నటించక పోవడం మన దురదృష్టం వయస్సు మీద పడ్డా ముఖంలో చెక్కు చెదరని లేతదనం ఆమెలోని ప్రత్యేకత శ్రావణ మేఘాలు చిత్రంలో ఆమె నటనకు రాష్ట్ర స్థాయి నంది అవార్డును బహూకరించటం అవార్డుకే గౌరవం ఆమె ఇంకా పలు తెలుగు చిత్రాలలో



వైవిధ్యమున్న పాత్రలలో నటిస్తూ, జీవించాలని ఆమె అబిమానిగా ఆశిస్తున్నాను

భి సావిత్రి, తిరుపతి

★ ★ ★

నేటి చలన చిత్ర పరిశ్రమలో తనకంటు ఒక స్థానాన్ని ఏర్పరుచుకొన్న కమల్‌హాసన్ గారు నా అబిమాన నటుడు కళకు ఒక రూపాన్ని ఇచ్చి నటనకు జీవం పోసి నటించుటలో ఆయనకు ఆయనే సాటి అకలి రాజ్యం'లోని నిరుద్యోగి యొక్క జీవితం గురించి నటన, మరో చరిత్ర లో ప్రేమికుల యొక్క కతను యథార్థంగా కన్నుల కట్టినట్లు, సాగర సంగమము లోని నృత్యంలోని మెళుకువులను తగిన రీతిలో నాట్యం చేసి చూపించి, 'స్వాతి ముత్యం'లోని తన యొక్క నటనా చాతుర్యము చూపించి అతని నటన మరువ లేనిదిగా నిరూపించాడు స్టెప్స్‌లోను ఫైట్స్‌లోను, డాన్స్‌లోను తగిన రీతిలో చేయగల సమర్థుడు ఎన్నో సందేశాత్మక చిత్రాలను అందించి స్వాతిముత్యం లో వలె ఉత్తమ నటుడు కావాలని



నా ఆకాంక్ష వారునిర్మించిన రెండు చిత్రాలు ఫెయిల్ అయినవి కాబట్టి నిర్మాతగా వారు ఉండకూడదని నా అబిప్రాయం

చిక్కా వెంకటేశ్వరరావు,
పాన్నెకల్ (ఖమ్మం)

★ ★ ★

ఆమె నవ్వితే నటరాజు పరవశిస్తాడు విషణ్ణ హృదయులు ఆమెలో సిందుభైరవి రాగాన్ని వింటారు పెళ్ళికాని ఆడపిల్లల హృదయాల్లో ఆమె



ఎన్నడూ కరిగిపోని స్వాతి ముత్యం' యుగాల్ని క్షణాల్లా గడిపే ప్రేమికులకి ఆమె స్రవంతి ' తెలుగు ముంగిళ్ళలో ఆమె వెదజల్లిన సిరివెన్నెల అబిమానుల గుండెల్లో వాడిపోని స్వాతిజల్లు '

వృత్తినే దైవంగా నమ్మే వారికి ఆమె – లేడీ డాక్టర్ న్యాయాన్ని రక్షించాలని కంకణం కట్టుకున్న వారికి లాయర్ సుహాసిని

అయితే చంద్రునిలో మచ్చలా గౌతమి గురించి చకోరంలా ఎదురు చూసే – నేను సుహాసిని శోభనం షూటింగ్ ఆగిపోతే ఎంత బాగుణ్ణు అనుకోని క్షణం లేదు

అబిమానులూ! నాతో ఏకీభవిస్తారు కదూ!

–ఉప్పిలి రామకృష్ణ, సింహాచలం

నా అభిమాన నటి బ్యూటీ క్వీన్ విజయశాంతి విజయశాంతిగారు అన్యాయాలను, అక్రమాలను ప్రతిఘటించి పెళ్ళిచూపులు చిత్రం ద్వారా మువ్వగోపాలుని పెండ్లాడి నేటి భారతం లో రేపటి పౌరులుగా దిద్ది మనదేశంలో వందేమాతరం ను చాటి చెప్పి అరుణకిరణం లా



ఉదయించి సక్కనోడు కి సక్కనమ్మగా నటించి ఛాలెంజ్ అనిపించుకొన్న విజయశాంతి ఇంకా మంచి చిత్రాలలో నటించాలని నా ఆకాంక్ష

నేను ముఖ్యంగా చెప్పదం ఏమంటే ఆమె బాలకృష్ణ సరసన నటిస్తే చిత్రాలు చాలా బాగుంటాయి ఆమె అలా నటిస్తే చూడాలని అబిమానిగా నా కోరిక

వనజాక్షి, బంగారుపాళ్యం (చిత్తూరు)

★ ★ ★

సినీ వినీలాకాశములోనికి 'విజేత'లాగా దూసుకొచ్చిన 'రోరింగ్ లయన్' చిరంజీవి నా అబిమాన హీరో తెలుగు చలనచిత్రరంగానికే డైనమిక్ హీరో చిరంజీవిగారు 'చక్రవర్తి' వంటి వారు తెలుగు చలన చిత్రరంగంలో తనకంటూ ఒక సుస్థిర స్థానమును ఏర్పరుచుకొని నేటికీ ఎందరో ప్రేక్షకుల హృదయాలలో 'ఖైదీ'గా నిలిచినారు

అడవిదొంగ, రక్తసింధూరం, శుబలేఖ, ఆరాధన, మగమహారాజు, మొదలగు చిత్రములలో నటించారు అనుటకంటే జీవించారు అనుట అతిశయోక్తి కాదు ఎట్టి పాత్రలనైనా సరే అవలీలగా పోషించి శబాష్ అని అనిపించుకొనగల్గిన సుప్రీమ్ హీరో నా అబిమాన హీరో అని చెప్పుకొనుటకు గర్వించు



చున్నాను

నటనపరముగా వారికి నేనిచ్చు సలహా ఏమిటంటే యాక్షన్ ఓరియంటెడ్ చిత్రములలో నే కాక ఎన్నియో క్లాస్, మాస్ అను భేదములు లేని చిత్రములలో నటించమని

-పి వి. నారాయణశాస్త్రి,
నరసరావుపేట □



# శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

వి రంగాచార్యులు,తిరుపతి

ప్ర ఈ ప్రపంచంలో నాలాంటి చవటలు మరెవరైనా ఉన్నారా? అనే సందేహం నాకప్పుడప్పుడు కల్గుతూంటుంది కామెంట్ ప్లీజ్!

జ ఉండొచ్చేమో గాని, మీలా లోపాలను చెప్పుకునే వారు అరుదను కుంటాను

జె భాస్కరమ్మ, పలమనేరు

ప్ర తన అలంకరణ కోసం వెచ్చించే సమయంలో సగం కాలమైనా పతి సేవకోసం వెచ్చించని సతిని ఏమనాలి?

జ ఆ అలంకరణ కూడా పతి సేవే పతిని ఆకర్షించడమే ప్రతమ సేవ కదా?

తేవుల కమలప్రసాద్, పెద్దాపురం

ప్ర సినిమా హాలులో పొగత్రాగడం నిషేధించినందు వల్ల చుట్ట బీడీ సిగరెట్లు అమ్ముకుని పొట్టపోసుకునే వారి కడుపు కొట్టినట్లు కదా?

జ మనుష్యులు ఆరోగ్య వంతులుగా ఉంటే, కాటికాపరి పొట్ట కొట్టి నట్లుండదా అన్నట్లుంది మీ ప్రశ్న

ఎం పవన్‌కుమార్, వరంగల్లు

ప్ర మేమడిగే ప్రశ్నలకు సమాదానము వ్రాస్తున్నది మీరు కాదంటాను ఏమంటారు?

జ మీరు పప్పులో కాలు వేశారంటాను

పి వి సతీష్‌కుమార్, హనుమాన్ జంక్షన్

ప్ర క్రికెట్ ఆటగాడు కపిల్‌దేవ్‌పై మీ అభిప్రాయం?

జ ఆల్‌రౌండర్

చీమకుర్తి నాగేశ్వరరావు, సత్తెనపల్లి

ప్ర 'శ్రుతిలయలు' చిత్రమునకు, దానిలోని మీ నటనకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల అవార్డులు లబిస్తాయి అని నేను బావిస్తున్నాను అందుకే మీకు ముందుగా కంగ్రాట్యులేషన్స్ చెబుతున్నాను

జ నేనుకూడా ముందుగా మీకు థాంక్స్ చెప్తున్నాను

ఆర్ ఉమానాథ్, భీమునిపట్నం

ప్ర కథ వ్రాయడము కష్టమా, స్క్రీన్‌ప్లే వ్రాయడము కష్టమా!

జ కథే పునాది లేనిదే భవనం ఎలా కట్టడానికి వీలవుతుంది

## ఉత్తమ ప్రశ్న

జె మల్లికకుమారి, ఆత్మకూరు

హఠాత్తుగా మీరు బారతదేశ ప్రధాని అయితే, సినీ పరిశ్రమకు మీరు చేసే మొట్ట మొదటి మంచి పని ఏమిటి?

అసంభవమైన విషయాల గురించి ఊహాగానాల వల్ల ప్రయోజన మేమిటి లెండి

కాచం శ్రీనివాస్, వేములవాడ

ప్ర మీరు చిత్ర నిర్మాణం తలపెడతారా!

జ రెండు పడవలమీద ప్రయాణం చేయటం కష్టం కదా?

తిరుపతిరెడ్డి సుబ్బారెడ్డి, గ్వాలియర్

ప్ర సుమలతగారూ! ఈ విదముగా ప్రశ్నలు అడిగే వారికి మీరు జవాబులిస్తే, మీకొచ్చే లాబము ఏమిటి?

జ అడిగే వారికి చెప్పేవారు లోకువలా ఉంది! ఇది నిస్వార్థ సేవకదా?

పి వీణాపాణి, రెంటచింతల

ప్ర సుమలతగారూ! మీరొక రోజు వంటచేయాలి నేను భోంచేయాలి ఈ అబిమాని కోరిక నెరవేరుతుందా?

జ కష్టమే నాకు వంట చేయడం అంతబాగారాదు ఒకవేళ వండినా నేనుతప్ప ఇతరులెవరూ తినలేరేమో!

ఎన్ కృష్ణప్రియ, దెందులూరు

ప్ర డియర్ సుమలతగారూ! దానధర్మాలు చేసేవారు నిస్వార్థజీవులంటాను మీరు ఏకీభవిస్తారా?

జ పుణ్యం మూటకట్టుకోవచ్చనే స్వార్థంతో వాళ్ళాపని చేస్తుంటే, నిస్వార్థ జీవులెలా అవుతారు

పి రాజారాం, హోసూరు

ప్ర అదే పనిగా బోరుకొడుతున్న మిత్రుణ్ని వదిలించుకోవాలంటే, అప్పు అడిగితేచాలు అలాగే అదే పనిగా బోరుకొట్టే మహిళను ఒక గృహిణి వదిలించుకోవాలంటే

జ కుంకుమబరిణి అందిస్తే చాలని కొందరు గృహిణులకు తెలుసు

రాయవరపు సత్తిరాజు, బెండపూడి

ప్ర సినీ నటుల రాజకీయ ప్రవేశం హర్షణీయమా!

జ జనామోదమే అని నిరూపణ అయింది కదా? □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న...........................................................

.................................................................

.................................................................

పంపినవారి పేరు...........................................

పూర్తి చిరునామా...........................................



“ముద్దుబిడ్డ”లో కృష్ణ, రజని

## హీరో కృష్ణ దర్శకత్వంలో తృతీయ చిత్రం

ఆగస్టు 21 నుంచి సెప్టెంబర్ 10 సెప్టెంబర్ 21 నుంచి 30 అక్టోబర్ 21 నుంచి 30 వరకు మూడు షెడ్యూల్స్‌లో ప్లాన్ చేశాం అన్నారు కృష్ణ ఈయన ప్రధాన పాత్ర నిర్వహిస్తూ దర్శకత్వం సంకలనం నిర్వహించే మూడవ చిత్రాన్ని శ్రీ వెంకట పద్మావతి పిక్చర్స్ అధినేత డి కాశీ విశ్వనాథరావు నిర్మిస్తున్నారు కృష్ణతో పాటు తొలిసారిగా నటించే ఆయన తనయుడు రమేష్ సరసన నూతన నాయిక పరిచయం గావింపబడుతోంది జయప్రద, మోహన్‌బాబు రావు గోపాలరావు సత్యనారాయణ ఒక ప్రత్యేక పాత్రలో మురళీమోహన్ పాల్గొంటారు 'వియత్నాం వీడు' సుందరం కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు చక్రవర్తి సంగీతం ▪ చలం శిల్పం సలీమ్ నృత్యాలు తెర వెనుక హంగులు

## కృష్ణ దర్శకత్వంలో మరో చిత్రం “తల్లిని మించిన తనయులు”

కృష్ణ దర్శకత్వం వహించే నాలుగవ చిత్రం రత్నా మూవీస్ పతాకంలో ఆయన తల్లి శ్రీమతి ఘట్టమనేని నాగరత్నమ్మ కథ సమకూర్చి నిర్మించే తల్లిని మించిన తనయులు ఈ చిత్రంలో కృష్ణతో పాటు ఆయన పెద్ద కుమారుడు రమేష్ నాయకులు పరుచూరి సోదరులు సంభాషణలు రాస్తున్నారు పద్మాలయ సమర్పణ

## కె. రాఘవ కొత్త చిత్రం “నీతీ నీ విలువెంత?”

'ఆగస్టు నెలాఖరులో మా ప్రతాప్ స్టూడియోలో షూటింగ్ ప్రారంభమవుతుంది ఒక కాలేజీలో కూడా షూటింగ్ జరుగుతుంది ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది” అన్నారు కె రాఘవ ఈయన 'యోగకర్తలు' అనంతరం నిర్మించే ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో రాజశేఖర్ జీవితతో పాటు హైదరాబాద్‌లోని కళాకారులు పాల్గొంటారు ఘుడవల్లి మాటలు, సి నారాయణరెడ్డి పాటలు సుభాష్-గోపి సంగీతం, టి కృష్ణ కూర్పుతో వీరం మస్తాన్‌రావ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు



## ఈశ్వర్ రష్యా పర్యటన

ప్రముఖ సినీ పబ్లిసిటీ ఆర్టిస్టు శ్రీ ఈశ్వర్ (మదరాసు) ఇటీవల రష్యాలో పర్యటించి వచ్చారు హోటల్ పామ్‌గ్రోవ్‌లో జరిగిన పత్రికా సమావేశంలో ఆయన తమ అనుభవాలని వివరించారు సోవియట్ రష్యాలో సినిమా గురించి వివరించారు రష్యాలో ఏటా 150 చిత్రాలని నిర్మిస్తారని ఆయన అన్నారు ఒక్కో చిత్రం 70 నిమిషాల నుంచి 100 నిమిషాల వరకూ ఉంటుందని వారు 150 చిత్రాల దాకా దిగుమతి చేసుకుంటారని వాటిలో భారతీయ చిత్రాలు 7 వరకూ ఉంటాయని ఆయన చెప్పారు

ఇంకా టైం వుంది, సెకండ్‌షో సినిమాకి వెళదాం పదండి!



# సినిమా

## డాక్టర్ భానుమతీ రామకృష్ణ కృష్ణలతో "అత్త మెచ్చిన అల్లుడు"

'అత్తగా డాక్టర్ భానుమతీ రామకృష్ణ అల్లుడుగా కృష్ణ నటిస్తారు అన్నారు కోడి రామకృష్ణ ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అత్తగారూ స్వాగతం, ఇంటిదొంగ అనంతరం వాకాడ అప్పారావు దాట్ల శ్రీరామ కృష్ణంరాజు నిర్మించే శ్రీలలిత కళాంజలి ప్రొడక్షన్స్ వారి పై చిత్రాన్ని సూర్యకిరణ్ సమర్పిస్తారు సూర్యచంద్ర రాజు నిర్వహణలో వాకాడ తాతయ్య సారథ్యంలో తయారవుతుంది

నాలుగవ చిత్రాన్ని కల్యాణ చక్రవర్తి అశ్వనిలతో కోడి రామకృష్ణ దర్శకత్వంలో రూపొందిస్తామని నిర్మాతలు తెలియజేశారు

## ఆగస్టులో "రుద్రరూపం"

కల్యాణచక్రవర్తి తనదంటూ ఒక ఇమేజ్‌ని సృష్టించుకున్న చిత్రం అన్నారు పి ఎస్ ప్రకాష్ ఈయన ఛాయ దర్శకత్వంలో కె ఎస్ కుప్పయ్య జి లక్ష్మీకాంత్ నిర్మించిన ప్రకాష్ సినీ కంబైన్స్ వారి పై చిత్రంలో కల్పన నాయిక చంద్రమోహన్ గొల్లపూడి మారుతీరావు, త్యాగరాజు, పద్మనాభం, అనూరాధ, అహల్య ఆదిగాగలవారు పాల్గొన్నారు వియత్నాం వీడు సుందరం కథకు పి ఎల్ నారాయణ సంభాషణలకర్త, రమేష్ నాయుడు సంగీతం, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, ఎస్ పి రంగారావు సంయుక్త దర్శకత్వం, బాబు కూర్పు, కె ప్రభాకర్ నిర్వహణ బాధ్యతలు వహించారు

## రాఘవేంద్రరావు, కృష్ణంరాజుల గోపీకృష్ణా మూవీస్ చిత్రం

'సెప్టెంబర్ అక్టోబర్‌లలో షూటింగ్' అన్నారు యు సూర్యనారాయణరాజు ఈయన 'మా ఇంటి మహరాజు' అనంతరం నిర్మించే గోపీకృష్ణా మూవీస్ చిత్రంలో కృష్ణంరాజు హీరో ■ రాఘవేంద్రరావు దర్శకుడు

## శ్రీనాథ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రావళి

నాకూ పెళ్ళాం కావాలి శత దినోత్సవ చిత్రం అనంతరం న్యాయానికి శిక్ష నిర్మిస్తున్న పై సంస్థ ఈ ఏడే విజయ బాపినీడు దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో రాజేంద్రప్రసాద్ హీరో వచ్చే సంవత్సరారంభంలో రేలంగి నరసింహారావు దర్శకత్వం నెఱపే చిత్రంలో రాజేంద్రప్రసాద్ చంద్రమోహన్ నాయకులు తాతినేని రామారావు దర్శకత్వంలో



''రుద్రరూపం' లో కల్పన, కల్యాణ చక్రవర్తి

వెంకటేశ్‌తో ఒక చిత్రం కృష్ణ - రజనీకాంత్‌లతో మరో చిత్రం విజయశాంతి నాయికగా ముత్యాల సుబ్బయ్య దర్శకత్వంలో ఒక చిత్రం ప్లాన్ చేశారు

## శ్రీదేవి మూవీస్ చిత్రానికి రేలంగి దర్శకత్వం

తమిళ హిట్ చిత్రం చిన్నతంబి-పెరియ తంబి ఆధారం నవంబర్ 2 నుంచి డిసెంబర్ 30 వరకు ఒకే షెడ్యూల్‌లో పూర్తిగా ఔట్ డోర్‌లో తయారవుతుంది, అన్నారు రేలంగి నరసింహారావు ఈయన దర్శకత్వంలో నటుడు చంద్రమోహన్ మేనల్లుడు కృష్ణప్రసాద్ రూపొందించే చిత్రానికి జంధ్యాల సంభాషణలు, ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సంగీతం అదనపు ఆకర్షణలు ఎం వి రావ్ నిర్మాణ సారథ్యంలో ఎస్ అనితాకృష్ణ నిర్మించే ఈ చిత్రానికి చంద్రశేఖర్ ప్రొడక్షన్ కంట్రోలర్ □

# కోహినూర్

ఝల్లు మనే చల్లగాలులు విసిరి వీచే వేళ
జగమంతా ప్రకృతి ఒడిలో నిదురించే వేళ
వెచ్చని సుతిమెత్తని నీ వలపు వెలుగు
అలముకుంటుంది నా హృదయాన్ని చలి తెలియకుండా
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR**®

గులాబీరంగు
సుఖదాయకమైన లూబ్రికేటెడ్
కాండొమ్. ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది.




ttk తయారీ

MAA (S) LRC6A TEL 86

# ఆనందం పంచని అభ్యున్నతి

కె. యస్. ఆర్. శాస్త్రి

"కందిపచ్చడి ఇంకొంచెం వేసుకోండి కొసరి కొసరి వడ్డిస్తోంది శ్రీలక్ష్మి భర్త కామేశంకు

అవునోయ్! ఈ పచ్చడి చేయడం ఎలా నేర్చుకున్నావ్! ఆ మధ్య ఎవరింట్లోనో భోజనానికి పిలిచినపుడు వడ్డించారు కందిపచ్చడి ఇంత రుచిగా లేదోయ్! ఏమిటో నీ చేతి మహత్యం భార్య పాకశాస్త్ర ప్రావీణ్యాన్ని మెచ్చుకుంటూ అన్నాడు కామేశ్వరరావు

పొగడ్తలు తర్వాత కానీండి త్వరగా అవతల ఆపీసుకు టైమవుతోంది అంది శ్రీలక్ష్మి

అవునోయ్! ఈవేళ ఆ పీసరుగారు పెందలాడే వస్తారు ముఖ్యమయిన ఫైలు పట్టుకెళ్ళి చర్చించాలి కూడాను హడావుడిగా లేచాడు

ఇన్నేళ్ళయినా ఆపీసరుగారు వస్తారు ఆఫీసరు గారు కేకలేస్తారు ఇవే కబుర్లే కాని, తమరు ఆపీసరయ్యేది లేదు – నేను చూచేదిలేదు అంది శ్రీలక్ష్మి

కానీవోయ్! డిపార్ట్‌మెంట్ పరీక్షలు వ్రాస్తున్నాను గదా ఫలితాలు రానీ!

ఆ – ఆ – నేను కాపురానికొచ్చినప్పటి నుంచి వ్రాస్తూనే ఉన్నారు పిల్లలకు ఉద్యోగాలు వచ్చి చెరో పట్నం వెళ్ళినా కూడా ఇంకా వ్రాస్తూనే ఉన్నారు ఆ ప్రమోషన్ వచ్చింది లేదు అయ్యిందిలేదు అంది

నిజమేనోయ్!– కుర్రతనంలో హుషారుగా పరీక్షలు వ్రాస్తామనుకుంటే, మా నాన్నగారు త్వరపడి మంచి సంబంధం వచ్చిందని నిన్ను నా కంటగట్టిరాయె ఇంకేం పరీక్షలు! నీ కొంగు పట్టుకు తిరగడం సరిపోయె– కొంచెం ఆ మైకంలోంచి తేరుకునేసరికి పిల్లలు పుట్టుకొచ్చిరాయె వారిని పెంచడం పెద్ద చేయడం, చదివించడంలో, నీతో పాటు నేను భాగం పంచుకోవడమే సరిపోయే – వళ్ళు దగ్గర పెట్టుకుని చదివిందెప్పుడు పరీక్షలు పాస్ అవ్వడానికి ప్రమోషన్ రావడానికి? ఇదంతా నీకు మాత్రం తెలియదా? ఏదో నన్ను ఉడికించడానికి కాకపోతే తేల్చేశాడు కామేశ్వరరావు గుంభనంగా నవ్వింది శ్రీలక్ష్మి

సరేలే ఇది రోజూ ఉండే మేళమే – టిఫిన్ బాక్స్‌లో పెట్టేసెయ్ డ్రస్ మార్చుకుని వస్తాను కామేశ్వరరావు ఆపీసుకు బయలుదేరాడు

ఇల్లు దాటి గేటు వరకు వచ్చి భర్తను సాగనంపి, లోపలికి వెళ్ళింది శ్రీలక్ష్మి

కామేశ్వరరావు తండ్రిగారు ఆస్తిపాస్తులు గొప్పగా లేకున్నా వితరణశీలి- కొడుకును బి ఏ వరకు చదివించి ఉద్యోగంలో పెట్టాడు ఒక్క సంవత్సరం కూడా ఉద్యోగం చేయనివ్వలేదు స్నేహితుని కూతురు శ్రీలక్ష్మి సంసారపక్షమైన చక్కటి అమ్మాయిని తెచ్చి పెళ్ళిచేశాడు – పాపం కామేశ్వరరావు పెళ్ళి ఇప్పుడే వద్దని యీ బాధ్యతలలో పడి ఉద్యోగం ఎదుగుబొదుగు ఉండదని ఎంతో నచ్చజెప్పి చూచాడు కాని తండ్రి విన్నాడు కాదు చింతనంలో పెళ్ళిచేసుకుంటే త్వరగా పిల్లలు కలిగి, ప్రయోజకులై, తండ్రి సర్వీసులో ఉండగానే చేతికెదిగి వస్తారని చెప్పి పెళ్ళి చేయించేశాడు ఆయన వాక్కు నిజంగా నిజమయింది అనుకూలవతి అయిన శ్రీలక్ష్మి సంసారం చక్కగా చూచుకొనేది భర్త మనసెరిగి ప్రవర్తిస్తూ ఎంతో జాగ్రత్తగా గడుపుకు వచ్చేది– అన్యోన్య దాంపత్యం- వెంటవెంటనే పిల్లలు కలగడం – వారి పాలన, పోషణ చదువులు 'ఇలా 22 సం లు దొర్లిపోయాయి ఇద్దరబ్బాయిలు – పెద్దవాడు హైదరాబాదు అకౌంటెంట్ జనరల్ ఆపీసులో ఆడిటర్ రెండవవాడు బెంగుళూరులో టెలిఫోన్ డిపార్ట్‌మెంట్‌లో జూనియర్ ఇంజనీరు

కామేశ్వరరావు గుమాస్తా నుండి హెడ్ గుమాస్తాగా ఎదిగాడు కాని ఆఫీసరు కాలేకపోయాడు మొన్న జనవరిలో పట్టు వదలని విక్రమార్కుడిలా మళ్ళీ పరీక్ష రాసేడు రిజల్టు ఇంకా రాలేదు

సంసారంలో ఏ లోటు రాకపోయినా, భర్తను అప్పుడప్పుడు అలా ఉడికించడం శ్రీలక్ష్మికి సరదా! అయినా ఏ స్త్రీకి మాత్రం తన భర్తను ఆఫీసర్ హోదాలో చూచుకోవాలని ఉండదు? అలా ఉండడం అత్యాశేంకాదు గదా! ఇవన్నీ నెమరు వేసుకుంటూ కామేశం ఆఫీసు చేరుకున్నాడు

సంతకం పెట్టి, ఏఏ గుమాస్తాలు వచ్చారో, రానివారెవరో సెలవు చీటీలు ఎన్ని వచ్చాయో చూచుకొనేలోగానే, ప్యూన్ వచ్చి అయ్యగారు మిమ్మల్ని పిలుస్తున్నారు అన్నారు – ఆ రోజు చర్చించవలసిన ముఖ్యమైన ఫైలును తీసుకుని ఆఫీసరుగారి గదిలోకి వెళ్ళాడు కామేశ్వరరావు

సార్ ఈ ఫైలును తెచ్చాను – ఆ కోఆపరేటివ్ సొసైటీ తాలూకు వివరాలన్నీ ఇందులో ఉన్నాయి ఇకపోతే చెప్పబోయాడు

ఫైలు సంగతి తర్వాత చూద్దాం కామేశ్వరరావు గారు – ఈ రోజు టపాలో ఒక ముఖ్యమయిన విశేషం ఉంది! ఈ కాగితాన్ని చూడండి ఆ కాగితాన్ని అందించారు ఆఫీసరుగారు

చదివేడు కామేశ్వరరావు ప్రభుత్వ ఉద్యోగులకు ప్రభుత్వము 4 సం కొకసారి ఇస్తున్న లీవ్ ట్రావెల్ కన్సెషన్ కామేశ్వరరావు పనిచేస్తున్న డిపార్టుమెంట్‌కు కూడా వర్తింపజేస్తూ వచ్చిన కాగితం అది

ఆ ఆర్డరు ప్రకారం ఒక ఉద్యోగి కుటుంబంతో సహా భారతదేశంలో ఏ ప్రదేశాన్నయినా 4 సం కొకసారి దర్శించి రావచ్చు అందుకు రాను, పోను చార్జీలు డిపార్ట్‌మెంట్ యిస్తుంది కామేశ్వరరావుకు సంతోషం కలిగింది

పాపం శ్రీలక్ష్మికి రెండే రెండు కోరికలు ఒకటి తనను ఆఫీసరుగా చూచుకోవటం, రెండవది ముఖ్యమైన స్థలాలను సందర్శించడం – ఇంతకాలం తాను ఆ రెండు కోర్కెలు తీర్చలేకపోయాడు ఇప్పుడు కనీసం ఒక్కటైనా తీర్చవచ్చు ఇలా ఆలోచిస్తున్నాడు

కామేశ్వరరావుగారు ఏంటి ఆలోచిస్తున్నారు ఆఫీసరుగారి పిలుపుతో ఆలోచన నుంచి తేరుకున్నాడు

అబ్బే ఏంలేదు సార్! ఈ కొత్త ఆర్డరు కొంత ఉపయోగమే సార్– ఆఫీసరు గారి వద్ద శలవు తీసుకొని తన సీట్లో కూర్చున్నాడు సీట్లో కూర్చున్నాడే గాని ఇంటికెప్పుడెప్పుడు వెళదామా అన్న ఆతృతలో ఉన్నాడు

5 30 కాగానే ఒక్కొక్కరు బయలుదేరారు కామేశ్వరరావు కూడా త్వరగా ఇల్లు చేరుకున్నాడు

ఏయోయ్! నీకో శుభవార్త! మనం దేశంలో ఏ ప్రదేశమైనా చూచిరావడానికి రైలు చార్జీలు ప్రభుత్వమే భరిస్తుందట 4 సం ఒకసారి ఈ రోజే ఆర్డర్స్ వచ్చాయి ఎక్కడికి తీసుకెళ్ళడంలేదనీ, ఎంతసేపు ఆపీసు, ఇల్లు, పెండ్లాము తప్ప నాకు ఇంకో లోకం లేదని గోల చేసేదానివిగా! ఇప్పుడు కోరుకో ఏ ఏ ఊర్లు చూస్తావో! అలా అలా త్రిప్పి తీసుకువస్తాను! హుషారుగా అన్నాడు కామేశం

అలాగా ఎంత మంచి వార్త చెప్పారండి ఇటు నుంచి హైదరాబాద్ వెళ్ళి పెద్దాడిని చూచి, రెండ్రోజులు ఉండి అక్కడ అన్నీ చూచి అటునుంచి బెంగుళూరు వెళ్ళి చిన్నాడిని చూచి అచ్చట చూడవలసినవన్నీ చూచి వచ్చేటప్పుడు అలా తిరుపతి కాళహస్తి, బెజవాడ, కంచి దర్శించి వద్దామండి! గబగబా చెప్పుకుపోతోంది శ్రీలక్ష్మి

నరే- సరే బాగా ఆలోచించుకొని చెప్పు' రేపు ఆఫీసుకు వెళ్ళినప్పుడు ఎల్ [illegible] సి కి అప్లై చేస్తాను - అయితే పిల్లలకు ఉత్తరాలు వ్రాసేయనా'

'హైదరాబాద్‌కు ఇక్కడ నుంచి బస్సులో వెళ్తాం అనుకోండి అక్కడ నుండి బెంగుళూరికి, రిజర్వేషన్ కూడా చేయించి ఉంచమని ఆ వ్రాసే ఉత్తరంలో వ్రాయండి అని ఓ సలహా పడేసింది శ్రీలక్ష్మి-

బస్సులో హైదరాబాద్ సెంట్రల్ బస్‌స్టేషన్‌లో దిగేరు-

పెద్దాడు ప్రభాకర్ రిసీవ్ చేసుకొని రూమ్‌కు తీసుకువెళ్లాడు రెండ్రోజులుండి బిర్లామందిర్, సాలార్‌జంగ్ మ్యూజియం, టాంక్‌బండ్, జూ, పబ్లిక్‌గార్డెన్స్, చూచి బెంగుళూరు బయలుదేరారు

బెంగుళూరులో చిన్నవాడు శ్రీహరి రిసీవ్ చేసుకొని రూమ్‌కు తీసుకువెళ్లాడు ఒక రోజు అనంతరం విధానసభ, హైకోర్టు దగ్గరుండి అన్నీ చూపించాడు శ్రీహరి- మరురోజు లాల్‌బాగ్, విశ్వేశ్వరయ్య మ్యూజియం వగైరాలు చూడాలనుకున్నారు కాని శ్రీహరి ఆఫీసులో ఇన్స్‌పెక్షన్ అవ్వడం మూలాన శలవు దొరకలేదు సరే ఇద్దరమే వెళ్దామని సిటీ బస్సుల నంబర్లు తెలుసుకొని బయలుదేరారు

లాల్‌బాగ్ చేరుకున్నారు- అంతా తిరిగి మధ్యాహ్నం వేళకు అలసి ఒక చెట్టు క్రిందకు చేరారు కామేశ్వరరావు తినడానికి ఏదో తెచ్చాడు తింటూ కూర్చున్నారు

ఏమండీ' ఇవన్నీ తిరగాలని ఎప్పుడు అనుకునేదాన్ని - కాని నా ఆశ తీరుతుందని గత 10 రోజుల వరకు తెలియలేదండి - మీ డిపార్ట్‌మెంటు వారు ఎంత మంచివారండి

ఏమండి' వివాహం అయినప్పటి నుంచి జీవితంలో ఏ కొరత లేకుండా చూచారు - ఈ కొరత ఉండింది ఇప్పుడు ఇది కూడా తీరింది




ఇంకొక కొరత ఉందిగా'- నేను ఆఫీసరు కాకపోవడం- కాసేపాగి అన్నాడు కామేశ్వరరావు

పోనిద్దురూ' తీరిన కోర్కెలు చాలు అన్ని బాధ్యతలు నెరవేర్చారు పిల్లలు ప్రయోజకు లయ్యారు - మనకేం తక్కువ మన యిల్లనే సామ్రాజ్యానికి మీరు ఆఫీసరు, నేను హెడ్ గుమాస్తా-

# ఈ·వేమన·పద్యాలు






కుళ్ళబోతువద్ద కూడి మాటాడిన
గొప్ప మర్మములను జెప్పరాదు
పేరు సేయ దెల్పు నూరెల్ల ముట్టించు
విశ్వదాభిరామ వినురవేమ.

## ఆనందం పంచని అభ్యున్నతి

రెండు కావస్తోంది బయలుదేరుదామా మ్యూజియం తీస్తారేమో బస్సులో వెళ్లాలి గదా లేచారు

బయట బస్సులు చాలా రద్దీగా తిరుగుతున్నాయి బస్సులు విసురుగా వచ్చి వెళుతున్నాయి ఓ బస్సు నంబరు చూచి ఎక్కాడు కామేశం శ్రీలక్ష్మి ఆడవాళ్లతో పాటు ముందర ఎక్కాలి ఎక్కుతున్న వారిని తోసుకుని లోనికి ఎక్కడం ఆమెకు చాతకాలేదు ఒక కాలు మొదటి మెట్టు మీద నుంచి జారింది అంతే క్రింద పడిపోయింది అందరూ హాహాకారాలు చేశారు వెనక నుంచి వచ్చిన బస్సు శ్రీలక్ష్మి మీదికి ఎక్కి ఆగిపోయింది అక్కడకక్కడే ప్రాణం విడిచింది శ్రీలక్ష్మి క్షణకాలంలో అంతా జరిగిపోయింది

కామేశ్వర్రావుకు కాళ్ళు చేతులు ఆడలేదు- మెదడు మొద్దుబారింది- ఏం జరిగిందో తెలుసుకొనే లోపలే అంతా జరిగి పోయింది 30 సం పాటు ఎంతో అన్యోన్యంగా సహజీవనం చేసిన తన భార్య తనకిక లేదనే ఆలోచన ఎంతో బయంకరంగా అనిపిస్తోంది

జన సమూహంలోంచి ఎవరో ముందుకు వచ్చి బాబు ఎవరు మీరు అని అడిగితే కొడుకు ఆఫీస్ టెలిఫోన్ నెంబరు ఇచ్చాడు- తరువాత కొడుకు వచ్చాడు శవాన్ని ఇంటికి చేర్చాడు- బెంగుళూర్ లోనే దహన సంస్కారాలు అన్నీ చేశారు-

కొద్ది రోజుల అనంతరం "ఇక వెళ్తాన్మరా శ్రీహరి అన్నాడు కామేశం-

ఒక్కరు అక్కడ ఏం చేస్తారు ఉద్యోగం రాజీనామా చేసి ఇక్కడనే ఉండండి అన్నాడు శ్రీహరి-

మీ అమ్మను పొట్టన పెట్టుకున్న ఈ ఊళ్ళో ఉండలేనురా నాయనా- అదిగాక ఖాళీగా ఉండి ఏమితోచక మీ అమ్మ జ్ఞాపకాలు నన్ను వెంటాడుతున్నాయి వూరెళ్ళితే ఆఫీసుకు వెళ్ళవచ్చు- పనిలో పడ్తే కొంత ఉపశమనంగా ఉంటుంది అని శ్రీహరికి నచ్చు చెప్పి వచ్చేశాడు- కామేశం

వచ్చాడే గాని స్థిమితం లేకపోయింది ఇంట్లో ప్రతి చోట శ్రీలక్ష్మి జ్ఞాపకాలే- పనిలో పడితే మరుపు వస్తుందని వచ్చాడే గాని 30 సం నీడలా వెంట ఉంది. అన్నిటికి చేదోడు వాదోడుగా ఉంటూ, జీవితంలో ఎన్నో మధుర స్మృతులు మిగిల్చి పోయిన భార్యను మరవడం అసాధ్యం అనిపించింది కామేశాన్కి ఆ స్మృతులలో కొట్టు మిట్టాడుతూ అలా రోజులు గడుపు కొస్తున్నాడు కామేశం

'సార్! అయ్యగారు పిలుస్తున్నారు ప్యూన్ చెప్పాడు లోపలికి వెళ్ళాడు కామేశం

కంగ్రాట్యులేషన్స్ కామేశం గారు! మీరు జనవరిలో వ్రాసిన పరీక్ష తాలూకు ఫలితాలు ఈవేళ పంపారు హెడ్ ఆఫీసు వాళ్ళు- మీరు సెలెక్ట్ అయ్యారు! రేపట్నుంచి మీరు ఆఫీసరు - కరచాలనం చేసాడు ఆఫీసరు- కామేశం సంతోషిస్తా డనుకున్నాడు ఆఫీసరు- కాని కామేశం కళ్ళ వెంట నీళ్ళు జలజలా రాలాయి వాట్ హాపెండ్ కామేశంగారు- ఎందుకు బాధపడు తున్నారు - ఖంగారుపడసాగారు ఆఫీసర్ గారు

కాసేపయ్యాక కామేశం తేరుకొని ఇంకొక రెండు మాసాల ముందు ఈ పలితాలు వచ్చుంటే నా బార్యకుండిన ఒక కోరికా తీరి ఉండేది సార్! నేను ఆఫీసర్ అయితే సంతోషించే మొట్టమొదటి వ్యక్తి నాకు లేకుండా పోయింది- నా ప్రమోషన్ చూచి హర్షించే వ్యక్తినే నేను పోగొట్టు కున్నప్పుడు ఈ ప్రమోషన్ నాకెందుకు సార్! నేను ఈ ప్రమోషన్ వద్దని వ్రాస్తే నా తర్వాత వ్యక్తి కయినా యిస్తారు- కనీసం అతని బార్య అయినా సంతోషిస్తుంది- మీరు కుర్రవాళ్ళు కోరక కోరక కోరిన కోరికను తీర్చి సంతోష పెడితే బార్యలో కలిగే అవ్యాజమైన ఆనందం మీకు ఇంకా తెలియదు-

నాకు ప్రమోషన్ వద్దని కాగితం వ్రాసి ఇస్తాను హెడ్డాఫీసుకు ఇవాళే పంపండి సార్!! స్థిర చిత్తంతో అన్నాడు కామేశం-

నిజమే! మన ఉన్నతిని, అభివృద్ధిని చూచి హర్షించే అతి ముఖ్యమైన వ్యక్తి లేనప్పుడు ఆ ఉన్నతి గాని, అభివృద్ధి గాని మనకు ఏ ఆనందాన్నీ పంచి ఇవ్వజాలవు □

# చిత్రలహరి

NaniBob


















సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

బ్రష్ చేసుకోటానికెళ్ళబోతూ ఫోన్ మోగుతుంటే ఆగిపోయాడు విజయ్

అక్కడికి రాబోయిన పని కుర్రాడు విజయ్ ఫోన్ అందుకోటం చూసి వెనక్కెళ్ళిపోయాడు

హలో! డి ఎస్ పి స్పీకింగ్ అన్నాడు విజయ్

నమస్తే, నేను సుధని అన్నది అవతలి స్వరం

చెప్పండి నిరుత్సాహం కంఠంలో ధ్వనించకుండా జాగ్రత్త పడుతూ అన్నాడతను

ఇప్పుడే నిద్ర లేచారా?

ఔను ఇంత ఉదయమే ఫోన్ చేశారెందుకు?

ఖాళీగా ఉన్నారేమోనని

ఆ విషయం పొద్దున్నే ఎలా తెలుస్తుంది? ఇంకా నేను ఆఫీసులో అడుగు పెట్టనే లేదు అక్కడెన్ని కంప్లయింట్లున్నాయో

అందులో అడుగు పెడితే ఇహ మూడ్‌లో ఉండరని

ఇలా ప్రతి ఉదయం ఫోన్ చేస్తూనే ఉంటారా?

ఏం? ఒద్దా?

ఒద్దు బాగోదు

మరెలా?

ఏమిటిలా? విసుగును అణుచుకోటం కష్టంగా ఉంది విజయ్‌కి చంద్రరావును దృష్టిలో పెట్టుకుని ఏమీ అనలేకపోతున్నాడు

ఇవతలి వ్యక్తి ఉల్లాసంగా ఉన్నాడనుకుంటోందా ఇలా హస్కు వేసుకోవడానికి?

మీరెప్పుడు తీరిగ్గా ఉంటారో నాకెలా తెలుస్తుంది

నేను ఫోన్ చేసి చెపుతానన్నాగా!

నమ్మమంటారా?

మీ ఇష్టం

కోపమొచ్చిందా?

అదేం లేదు మీరిలా ఫోన్ చెయ్యకండి ఖాళీగా ఉన్నప్పుడు తప్పకుండా నేనే చేస్తాను అంటూ ఫోన్ పెట్టేశాడు విజయ్, ఇహ ఆమె మాట్లాడే అవకాశమివ్వకుండా

ఏమంటాడు? అన్నది రాజ్యలక్ష్మి

తనే ఫోన్ చేస్తాట్ట నన్ను చెయ్యొద్దన్నాడు మొహం గంటు పెట్టుకుంటూ అన్నది సుధ

అవతలి వ్యక్తి మామూలు వాడు కాదు మీ ఆత్రుత మితి మీరితే వ్యవహారం బెడిసి కొడుతుంది అతను పదే పదే వచ్చి మనతో గడపటానికి వీలవదనే విషయాన్ని దృష్టిలో పెట్టుకోండి మీరు అసలు ప్లెయిన్‌గా నేనే అడిగేస్తానుండు అన్నాడు చంద్రరావు

ఒద్దొద్దు మనం ఎక్కడికెళ్ళాకే అడుగుదాం బంగారుగా అన్నది రాజ్యలక్ష్మి

ఎందుకీ ట్రిక్కులన్నీ?

మీరు మగవారు కొన్ని కొన్ని మీకు తెలియవు అవతలి వ్యక్తిని బట్టి మనం నడుచుకోవాలి

అదే నేనూ చెప్పేది అతని మీద ఇలాంటివి ప్లే చెయ్యటం మంచిది కాదు నిజాయితీగా అడిగెయ్యటమే బెటరు అదే స్ట్రెయిట్‌గా అవతలి వ్యక్తి మనస్తత్వానికి తగినట్లుగా ఉంటుంది

ఈ ఒక్కసారి ఇలా జరగనివ్వండి

నీ ఇష్టం

అంతకన్నా ఆమెను ప్రెస్ చేసి ఒప్పించటానికి ప్రయత్నించలేదు చంద్రరావు ఒకవేళ విజయ్ సుధను తిరస్కరిస్తే అది తన మీదుగా పోతుంది మీ తొందరపాటు వల్లే ఇలా జరిగింది నేను చెప్పినట్లు చేస్తే బావుండేది అని తనని సాధిస్తుంది రాజ్యలక్ష్మి

అలా ఆమెకు దొరికిపోవటం ఇష్టం లేదతనికి

* * *

ఒక రిక్షా వాడిచ్చిన కంప్లయింట్‌ను పరిశీలిస్తున్నాడు విజయ్

**జరిగిన కథ –4** చమన్‌లాల్ జాయలరీ షాపు దోపిడీ కేసులో విజయ్ నాగును అరెస్టు చేసి నగలు స్వాధీనం చేసుకుంటాడు నాగు తప్పించుకుని అడవిలోకి పారిపోగా వెంటాడిన విజయ్ నాగును పట్టుకోబోయేంతలో జీపు ఫెయిలయి విఫలమవుతాడు చంద్రరావు, రాజ్యలక్ష్మి విజయ్‌కి సుధనిచ్చి పెళ్ళి చేయాలనుకుంటారు సుధను పరిచయం చేస్తారు సుధ విజయ్‌ను ఎట్లాగైనా గెలుచుకోవాలనుకుంటుంది

తను బీసెంట్ రోడ్డులో పోతుండగా బీటు కానిస్టేబుల్ తన మీద జరిపిన దౌర్జన్యం గురించి కంప్లయింట్ చేశాడతను

రిక్షా వాళ్ళు ఒక్కోసారి తల తిక్కగా ప్రవర్తిస్తూ ఉంటారు రాంగ్ సైడున వెళ్ళటం పొడుగ్గా ఉండే ఇనప ఊచల్ని రిక్షాలో వేసుకుని రయ్యిన పోతూ ఇరుపక్కలా ఉండే వాహనాలకు మనుషులకు ఇబ్బందినీ ప్రమాదాన్ని కలిగించటం ఒక లారీ అక్కడ ఇంజన్ ఆప్ చెయ్యకుండా ఆగి ఉండగా దాన్ని ఒరుసుకుంటూ వెళ్ళటం రిక్షాని అడ్డుగా పెట్టటం ఇలాంటి పన్లు చేస్తుంటారు అప్పుడు తాత్కాలికమైన పనిష్మెంటుగా గాలి తీసెయ్యటం మందలించటం బెదిరించటం లాంటివి చెయ్యమంటాడు విజయ్

కానీ ఈ బీట్ కానిస్టేబుల్ అంతటితో ఊరుకోక ఉత్సాహంగా ఇంకో రెండడుగులు ముందు కేశాడు కంప్లయింటిచ్చినతని రిక్షా వంతెన మీదుగా పోతూ అటునుంచొచ్చిన లారీకి అడ్డం వచ్చాడని అతన్ని ఆపి, రిక్షా టైరు ట్యూబూ కూడా పీకి పక్కనే పారుతున్న కాలవలోకి విసిరేశాట్ట కానిస్టేబులు అవి ప్రవాహంలో కొట్టుకుపోయాయిట

ఇప్పుడవన్నీ కొనాలంటే నా దగ్గర డబ్బు లేదు రిక్షా వెయ్యటం ఆగిపోతే మేమంతా పస్తులుండాలి ఇది రిక్షాఅతని వాదన

ఆ ప్రాంతపు ఎస్ ఐ కి ఫోన్ చేసి ఆ టైంలో డ్యూటీలో ఉన్న బీటు కానిస్టేబుల్‌ని పంపమన్నాడు విజయ్

లారీకి అడ్డం వచ్చాడు కాస్తుంటే యాక్సిడెంటయేది నేను ఆపి మందలిస్తే పొగరుగా మాట్లాడాడు ఎంత మాటంటే అంత మాట విసిరేసరికి ఉద్రేకం ఆపుకోలేక అంటున్న కానిస్టేబుల్‌ని చివాట్లేసి, బెదిరించి పంపాడు విజయ్

అయితే కథ ఇక్కడితో ఆగలేదు

ఇలాంటి చిన్న చిన్న అవకాశాల కోసమే ఎదురు చూసే వర్గం ఒకటుందక్కడ వాళ్ళు కార్మికుల్ని, వాళ్ళ నాయకుల్ని కలిసి బాగా రెచ్చగొట్టారు

ఇవాళ ట్యూబ్ విసిరేసిన వాడు రేపొద్దున్న మిమ్మల్ని మాత్రం విసిరెయ్యడా? మీరిలా మెత్తగా ఊరుకుంటే పోలీసుల దౌర్జన్యాలు మితిమీరి పోతాయి అంటూ రెచ్చగొట్టారు

ఎక్కడెక్కడి కోరికలూ బయట కొచ్చేశాయి తమ కోర్కెల వినతి పత్రాన్ని డి ఎస్ పి కిచ్చారు తరవాత దాదాపు పదిహేను వందల మంది రిక్షా కార్మికులు తమ ఖాళీ రిక్షాలతో మున్సిపల్ గ్రౌండ్‌లోకి ఎం పోలీసులకి వ్యతిరేకంగా నినాదాలు మొదలు పెట్టారు పోలీస్ బలగం అక్కడికి చేరుకుంది దౌర్జన్యం జరక్కుండా చూడటానికి

ఆ రోజు దసరా పండుగ

ఎస్ ■ కి వాళ్ళని చూస్తుంటే మంటగావుంది వాళ్ళందర్నీ కట్టగట్టి చంపి పాతెయ్యాలనుంది

ఒక పండగాలేదు పబ్బమూలేదు హాయిగా నిశ్చింతగ్గా ఒక గంటసేపు పెళ్ళాం పిల్లలతో గడపటానికిలేదు మాముండాకొడుకులు తిని కూర్చుని తెగబలిసి ఏదో ఒకటి తెస్తారు కొంపమీదికి

వీడి రిక్షా లారీకి అడ్డంపెట్టి తెగనీలిగితే లేదుగానీ, టైరు విసిరేస్తే వచ్చింది పుసుకు అసలు వీడిని విసిరేస్తే పీడాపోయేది

లారీ కదిల్తే తుక్కుతుక్కయి చచ్చేవాడు అయినాసరే వాడు బీటుకానిస్టేబులు మాటను ఖాతరు చెయ్యడు! అందరూ అందరే!

ఈ నాయకులోకళ్ళు తమ కాలరెగరేసుకోటానికి పదిమందిలో పబ్లిసిటీ సంపాయించుకోటానికి ఏదో ఒక గొడవ జరుగుతుండాలి వీళ్ళకి దానికి వీళ్ళు నాయకత్వం వహించి ఇరుపక్షాల్నీ రెచ్చగొట్టాలి

నిజంగా కార్మికులకోసం పాటుబడి చచ్చే నాయకుడు వీళ్ళలో ఒక్కడంటే ఒక్కడు లేదు కార్మికులకూ పోలీసులకీ సంధికుదరబోతుంటే వీళ్ళు పడనివ్వరు తమ ప్రమేయంతో నే అది కుదరాలి

ఈ మూర్ఖపు ముండాకొడుకుల కిది తెలిచ్చావక తోకాడిస్తూ ఎవడు రెచ్చగొడితే వాడివెనక తిరుగుతుంటారు

అసలీపద్ధతంతా మారిపోవాలి ఆ నాయకుల తోకలు కత్తిరించి పారెయ్యాలి ప్రజ లో గొర్రెల మంద, ఎవడు మీటింగెట్టి వాగితే వాడికే చప్పట్లుకొట్టేస్తారు జైనేను అంటూ వంతపాడుతుంటారు

ఒక జేబు దొంగ నరెస్ట్ చేసి లాకప్‌లో పారేస్తే ఇరవైనాలుగంటల్లో కోర్టు ముందు హాజరుపరచలేదని లా పాయింటు లాగుతుంటారు వీళ్ళు కోర్టులో పెట్టగానే ఈ సన్నాసి నాయాళ్ళెవరో జామీనుండి వాడిని బయటకు లాక్కొస్తారు తరువాత కోర్టు ఫైనెయ్యటం అది కట్టేసి అంతకు రెట్టింపు డబ్బుకోసం ఇంకోడి జేబు కొట్టేయ్యటం మళ్ళీ కార్యక్రమం మొదలు

ఏం లాభం?

ఇలాంటి కొడుకుల్ని లాకప్‌లో పారేసి చితకబొడిచి ఒదిలిపెడితే కొన్నాళ్ళపాటయినా బుద్ధిగా బయంగా వుంటారు ఎప్పటిప్పటివో గుర్తుతెచ్చుకుని మరి తిడుతున్నాడు ఎస్ ఐ

పండక్కి పెద్దకూతుర్ని పుట్టింటికి తీసుకొచ్చాడాయన చాలా రోజుల తరవాత అందరూ సరదాగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ భోజనం చెయ్యబోతున్నారు దగ్గరే కూర్చుని భార్య వడ్డిస్తోంది

ఇంతలో ఈ గొడవ డ్యూటీ

తను వచ్చేస్తుంటే పిల్లల మొహాల్లో నూ భార్య మొహంలో నూ కనిపించిన నిరాశ నిస్పృహలు గుర్తొస్తుంటే వీళ్ళందర్నీ వరసబెట్టి కాల్చిపారేసి యింటి కెళ్ళిపోవాలనిపిస్తోం దాయనకు

తరువాత విజయ్ రిక్షా కార్మికుల నుద్దేశించి మాట్లాడుతూ ట్రాఫిక్ బద్రత



# కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్నీ మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ ''ప్రత్యేక'' సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి కాపీ కార్టూన్‌లు పంపరాదు

## డి.ఎస్.పి. విజయ్

ఎప్పుడూ కొన్నికొన్ని నిబంధనలు కఠినంగా పాటించకతప్పదు అతిగా ప్రవర్తించే పాలిసీల విషయంలో తగిన చర్య తీసుకుంటాం మీరుకూడా పోలీసులకి కోపరేట్ చేస్తుండాలి ఇరుపక్షాలవాళ్ళూ శత్రువుల్లా ప్రవర్తించ కూడదు రిక్షాల్లో పెద్దపెద్ద సామాన్లూ ఇనప ఊచలు, బీరువాలు లాంటి ట్రాఫిక్‌కు అంతరాయం కలిగించే వస్తువులు మినహా మిగిలిన సామాన్ల విషయంలో అభ్యంతరముండదు మీరు కోరినట్లే తీసుకెళ్ళొచ్చు రిక్షాస్టాండు ఏర్పాటుచేసే విషయంలో వెంటనే తగిన చర్యలు తీసుకుంటాం అంటూ వాళ్ళు కోరిన కోర్కెల్లో కొన్నిటికి తన అంగీకారం ప్రకటించటంతో ఆలజడి సద్దుమణిగింది

కార్మికనాయకుల ప్రసంగాలు కూడా పూర్తయ్యాక రిక్షావాళ్ళంతా ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు

ఈ తతంగమంతా పూర్తయ్యేసరికి రాత్రి తొమ్మిది గంటలయింది

కాళ్ళీడ్చుకుంటూ నీరసంగా ఇంట్లో అడుగు పెట్టాడు ఎస్ ఐ

పంతగ ఎటు పోయిందో!

"కొన్ని రోజులు సెలవు పెట్టకూడదూ" సానుభూతిగా అన్నది ఆయన భార్య

తరవాత కూడా ఇంతేగదా ప్రజలకి పోలీసులకీ మధ్య సామరస్యం ఎప్పుడు ఏర్పడుతుందో అప్పుడే ఇలాంటి గొడవలు లేకుండా ఉంటాయి ఈ వినాయకులు అంతా కలిసి దాన్ని ఏర్పడ నివ్వకుండా ఎప్పటికప్పుడు అడ్డుపడుతునే ఉంటారు లేకుంటే వాళ్ళ పబ్బం గడవదు పోనీలే వెధవ గొడవ, కాని వేడి నీళ్ళు పెట్టు స్నానం చేస్తేగాని ప్రాణం తేరుకోదు అన్నాడాయన

* * * * * *

ఒక పార్టీక అటెండయి తిరిగొస్తున్నాడు విజయ్ రాత్రి పొద్దు పోయింది

సీట్లో వెనక్కివాలి ఏదో ఆలోచనలో మునిగిఉన్న విజయ్ డ్రైవర్ గొంతులో నుంచి కీచుగా వెలువడ్డ భయంకరమైన కేకతో అదిరిపడి కళ్ళు విప్పాడు

ఎదురుగా వస్తున్న లారీని చూసి కారు పక్కకు తిప్పబోయాడు డ్రైవరు కానీ ఆ లారీ కూడా అదే సైడుకు రావటంతో ఒంగారుగా రోడ్డుమీద కొచ్చాడు తిరిగి ఆ లారీ అటే రాబోవటంతో వాళ్ళ ప్రయత్నం అర్థమై భయంతో అరిచి కారును పక్కకు కోశాడు

అప్పటికే ఆలస్యమయింది కారు చెట్టుకు గుద్దుకుంది డ్రైవరు అక్కడికక్కడే చనిపోయాడు వెనకడోర్ తెరుచుకుని ఆందోళనగా కిందికి దిగాడు విజయ్ కొన్ని అద్దం పెంకులతనికీ గుచ్చుకుని రక్తం ఓడుతున్నాయి లారీలో నుంచి నలుగురు మనుషులు దిగి నిదానంగా తొందర లేనట్లు విజయ్ వేపు నడిచి వచ్చారు వాళ్ళ కళ్ళలో క్రౌర్యం నవ్వులో హేళన చూస్తూ తాపీగా తనూ వాళ్ళవేపు నడిచాడు విజయ్

ఏం జరుగుతూందో తెలిసేలోపలే వాళ్ళలో ఇద్దరు నేలకు కరుచుకున్నారు అప్పటికి తమ అంచనాలో ఉన్న పొరపాటు వాళ్ళ కర్థమయింది వెంటనే ఎలర్ట్‌గా మారి విజయ్ మీదికి దూకారు

వాళ్ళు కూడా విజయ్‌కేం తీసి పోకుండా అన్ని మెలకువలూ తెలిసిన వాళ్ళే తాము నలుగురు అతనొక్కడు అనే నిర్లక్ష్యం వాళ్ళలో ఇద్దర్ని మట్టి కరిపించిందంతే

పోరు హోరంగా సాగుతోంది

పార్టీ జరిగింది ఊరికి దూరంగా ఉన్న కాలనీలో అక్కడ నుంచి ఊర్లోకి వచ్చేదాక ఎక్కువ రద్దీ ఉండదు కొంత దూరం వరకూ

తన ముందున్న వాడితో తలపడుతున్న విజయ్‌ని రెండో వాడు వెనకపాటుగా వచ్చి దొంగ దెబ్బ తియ్యబోతున్నాడు తళతళ లాడుతున్న కత్తితో సహా అతని కుడి చెయ్యి పైకి లేచింది ఆ గురికి తిరుగు లేదు అది సరిగ్గా విజయ్ వెన్నులో దిగబడుతుంది ముందున్న వాడు విజయ్‌ని ఊపిరి తిప్పుకో

నివ్వటం లేదు

కత్తి ఒక్క ఊపున విజయ్ వెన్ను దగ్గరకు రాబోతోంది అవి అతని ఆఖరు క్షణాలు

ఇంతలో ఎక్కడి నుంచో రివాల్వర్ పేలింది కత్తి గురితప్పి పక్కకు పడింది ఒక బుల్లెట్ అతని చేతిలో నుంచి దూసుకు వెళ్ళింది

హఠాత్తుగా ఆ ఇద్దరూ విజయ్‌ని తోసేసి తుప్పల చాటుకి పరుగెత్తారు మెరుపు వేగంతో వాళ్ళ వెనుక తనూ పరుగెత్తాడు విజయ్

వాళ్ళు దొరకలేదు అతి లాఘవంగా తప్పించుకున్నారు

వాళ్ళు దొరికినా తమ నీ పనికి ఉసి గొల్పిన వాడి గురించి ఒక్క ముక్క చెప్పరు చావనైనా చస్తారు గానీ అటువంటి వాళ్ళు యజమానికి ద్రోహం చెయ్యరు అన్నది ఇందాకటి యువతి

మీ రెవరు? చీకట్లో ఈ ప్రాంతాల కెందు కొచ్చారు? అన్నాడు విజయ్

నా పేరు వింధ్య మీలాగే నేనూ పార్టీకి అటెండయి వస్తున్నాను అన్నదామె

ఒంటరిగానా!

ఒంటరితన మేముంది? ఇది తోడుగా ఉందిగా? రివాల్వర్ చూపిస్తూ అన్నదామె

ఇద్దరూ కలిసి కారు దగ్గర కొచ్చారు

ఆ పరిధిలో ఉన్న పోలీస్ స్టేషన్ కెళ్ళి రిపోర్టిచ్చారు

మా ఇంటి కెడదాం రండి అన్నది వింధ్య

మిమ్మల్నింటి దగ్గర దిగబెట్టమని కానిస్టేబుల్‌కి చెపుతాను సారీ వింధ్యా ఇంకోసా రెప్పుడయినా వస్తాను అన్నాడు విజయ్

ప్లీజ్! రండి ఇంకోసారి వీలవుతుందో కాదో! జస్ట్ టీ తాగి వెళ్ళిపోదురు గాని అన్నది వింధ్య

ఆమె అభ్యర్థనను కాదనలేక పోయాడు విజయ్

కూర్చోండి ఒక్క క్షణంలో వచ్చేస్తాను అంటూ లోపలి కెళ్ళి అయిదే అయిదు నిమిషాల్లో బట్టలు మార్చుకుని టీ చేసి తీసుకొచ్చింది వింధ్య

ఇల్లంతా నీట్‌గా సింపుల్‌గా ఉంది

ఒక్కసారి పరిశీలనగా చూసి, టీపాయ్ మీదున్న పేపరందు కున్నాడు విజయ్

కప్పు అతని ముందుకు పెట్టి తీసుకోండి అంటూ తనో కప్పు అందుకుని పెదవుల దగ్గర పెట్టుకుంది వింధ్య

మీవారేం చేస్తున్నారు? అన్నాడు విజయ్

నా కింకా పెళ్ళి కాలేదు ఇక్కడ ఓ ఆఫీస్‌లో స్టెనోగా కొత్తగా అపాయింటయ్యాను అన్నది ఆమె

మీ గురించి చెప్పండి అన్నదామె

నా గురించేముంది చెప్పటానికి? నేనిక్కడ డి ఎస్ పి గా పని చేస్తున్నాను నాపేరు విజయ్ అన్నాడతను నవ్వుతూ

అది నాకూ తెలుసుగానీ ఇక్కడి ప్రజలకు మీరంటే చాలా ఇష్టం అనుకుంటాను

ఎందుకలా అనుకుంటున్నారు?

ఎవర్నడిగినా మీ గురించి తెగ పొగిడేస్తుంటారు

అవి పొగడ్తలని మీరే చెపుతున్నారుగా?

నా ఉద్దేశ్యం అది కాదు లెండి స్థానికంగా ఇంత మంచి పేరేలా సంపాయించారు మీరు?

అంత మంచి పేరు సంపాయించి ఉంటే నా మీద హత్యాప్రయత్న మెందుకు జరుగుతుంది?

అది వేరు పెద్ద పెద్ద నేరస్థులు హంతకులు అయిన వాళ్ళ దృష్టి ఎప్పుడూ పోలీసాఫీసర్ల మీద కేంద్రీకరింపబడి ఉంటుంది తమ ప్రయత్నాలకు నిరంతరం అడ్డుపడుతూ బందించి శిక్షపడేలా చేసే పోలీసులంటే వాళ్ళకి మంట దొరికితే వాళ్ళ అంతు చూడాలనే అనుకుంటారు వాళ్ళ పగకు కేంద్ర బిందువులుగా ఉండే పోలీసాఫీసర్ల జీవితా లేమంత సుఖప్రదమైనవి కావు అందరూ ఊహిస్తున్నట్టు వాళ్ళ లైఫ్ ఎప్పుడూ పదునైన కత్తి అంచుమీదే ప్రయాణం చేస్తుంటుంది

నేను అడిగేది నేరస్థుల గురించి కాదు స్థానికులైన ప్రజల గురించి

'ఏముంది? సింపుల్ ఉదాహరణకు ప్రజలందరూ నేరస్థులు కారు కదా! నూటికి పది మంది నేరస్థులుంటే వాళ్ళ విషయంలో అతి కఠినంగా ప్రవర్తిస్తుంటాను మిగిలిన తొంభై మంది విషయంలో సన్నిహితంగా మర్యాదగా వ్యవహరిస్తుంటాను రోడ్డు మీద ఇద్దరు స్కూటరు వాలాలు పోతుంటారు ఎదురెదురుగా ఇంద్రాపూర్‌లో ట్రాఫిక్ రద్దీ ఎంత హారిబుల్‌గా ఉంటుందో మీకూ తెలుసు గదా! అయినా వాళ్ళు మిగతా వాళ్ళ అసౌకర్యాన్ని గురించి పట్టించుకోకుండా ఒక కాలు రోడ్డు మీద ఆనించి ఆగిపోయి తీరికగా హస్కు వేసుకుంటారు. నేనా ప్రాంతంలో వెడుతుంటే ఆగి అక్కడేమయినా సరదాగా పెళ్ళి విశేషాల లాంటివి మాట్లాడు కుంటున్నారా? అందు కనువైన స్థలం ఇది కాదు వెంటనే ఇద్దరూ ఎవరిదారిన వారు వెళ్ళిపొండి అని హెచ్చరిస్తాను

ఇలా కూడా అనొచ్చు

ఏం? కళ్ళు నెత్తి కెక్కాయా? రోడ్డు మీ బాబుగాడి సొత్తను కున్నారా? ఇడియట్స్! వెంటనే ఎవరిదార్న వాళ్ళెళ్ళండి లేకుంటే బొక్కలో తోయిస్తాను




అనొచ్చు

కానీ నేను అనవసరమైన చోట్ల అధికారాన్ని, అహాన్ని ప్రదర్శించను

ప్రజలు నన్ను లైక్ చెయ్యటాని కిదో కారణం కావొచ్చు వాళ్ళకు సన్నిహితంగా ఉండి వాళ్ళ సమస్యలు విని వీలైనంత వరకూ పరిష్కరించ టానికి ప్రయత్నిస్తాను

ఇంతే నేను చేసేది

లారీల వాళ్ళు కూడా ఎదురెదురుగా వస్తూ ఆగిపోయి తీరికగా డ్రైవర్లిద్దరూ హస్కు వేసుకుంటారు వెనకొచ్చే బస్సులకు సైడివ్వకుండా అంత స్మూత్‌గా చెపితే వాళ్ళు వింటారా?

వినరు రఫ్‌గా ఉండేవాళ్ళతో నేనూ రఫ్‌గానే ఉంటాను అయినా ఏమిటి మీరు? పత్రికా విలేఖరిలా గుక్క తిప్పుకో నివ్వకుండా ఇన్ని ప్రశ్న లేస్తున్నారు? అన్నాడు విజయ్ వాచీ చూసుకుంటూ

సారీ మీ టైమ్‌ని కిల్ చేస్తున్నట్లున్నాను అన్నది వింధ్య లేచి నిలబడుతూ

అదేం లేదు లెండి మరి నేవస్తాను అన్నాడతను

ఇంటి కొచ్చాక అతనిహ వింధ్య గురించి ఆలోచించ లేదు

(ఇంకా ఉంది)

# అమ్మంటే అమ్మే

వేలూరి ఉషశ్రీ

అమ్మను చూసి చాలా కాలమై పోయినట్టుంది

అమ్మ ఎక్కడికి వెళ్లి ఉంటుంది? ఎక్కడ ఏ పరిస్థితులల్లో – ఎలా ఉందో? ఊహకే అందటం లేదు ఏమై ఉంటుంది? ఏం చేస్తే తెలుస్తుంది? – ఇంట్లోనే కూర్చుంటే బుర్ర వేడెక్కి పోతోంది

శ్రీరఘురామ చారుతులసీదళ రామ త్రిజగన్నుత శౌర్యలలామ తరువాత గుర్తురావట్లేదు నాన్నా – శౌర్య రమాలలామ తరువాతేంటి నాన్నా? పాప – స్కూలుకి వెళ్లలేదు దగ్గరగా వచ్చి అడుగుతోంది – ఏం తోచక తిరుగుతోంది

చెప్పు నాన్నా చెయ్యి పట్టుకుని ఊపుతూ అడిగింది మళ్లీ –

ఏం చెప్పనమ్మా దగ్గరగా తీసుకుని అడిగాను

పద్యం నాన్నా – తరువాతేంటి?

తరువాత అదే తెలిస్తే ప్చ్ తెలియదు విసుగ్గా ఉంది బాధగానూ ఉంది

ఏమోనమ్మా అన్నాను

నీకు రాదా నాన్నా – నానమ్మకైతే వస్తుంది!

నాన్నా – పోనీ నీకు రాముడి కథయినా వచ్చా–?

ఊఁహూఁ!

ఊఁహూఁ ఏంటి నాన్నా? నాన్నమ్మని పంపించేసి పేద్ద! నా కెవరూ కథల్చెప్పట్లేదు పద్యాలు చెప్పట్లేదు నాకేం బాలేదు అసలు నానమ్మెప్పుడు వస్తుంది నిన్న స్కూల్లో యీ పద్యం వింటే – నానమ్మే గుర్తొచ్చింది – నానమ్మ వస్తే బాగుండును

నిజమే – అమ్మ ఎప్పుడు వస్తుంది? తెలియదు నాకూ తెలియదు – కృష్ణ వస్తే ఏమైనా తెలియాలి–

చిన్ని చేతులతో చెంపలు రాస్తూ – నాన్నా! అలా ఉన్నావేం నీ కళ్ళు ఎంత ఎర్రగా ఉన్నాయో జ్వరం వచ్చిందా? పసి వెలుగు దాని కళ్లలో ఉంది అదలా అడుగుతుంటే ఆ పసి స్పర్శతో కళ్ళు చెమరుస్తున్నాయి

'నాన్నా ఎందుకూ ఏడుస్తున్నావ్? పాప అడిగింది

అవును ఎందుకూ ఏడుస్తున్నాను – ఆప్యాయతకు దూరమై పోతున్నాననా? అవునేమో తెలియలేదు

నాన్నా! నీకూ నానమ్మ వస్తేనే బావుంటుంది కదూ!

–నిజంగానే పసిపిల్లల్లో దేవుడుంటాడా? లేకపోతే ఆలోచనలు చదవటం ఆ చిన్ని మేదకీ తెలుసా?–

నాన్నా! పోనీ మమ్మీకి ఫోన్ చేద్దామా – నీకు జ్వరం వచ్చిందని

–జానకి – ఏ క్లబ్బులో ఏ చర్చల్లో ఏ స్నేహితులనబడే హిపోక్రిట్స్ మధ్యనో ఏ ఆనందంలో ఉందో – భర్త పిల్లలు యిల్లూ – సొసైటీలో కేవలం స్టేటస్ చిహ్నాలుగా తప్ప – మరే అనుబంధానికీ అర్థం తెలియని – సొసైటీ లేడీ – తనకి నేను ఎందుకు? – ప్చ్– అక్కర్లేదు –

వద్దమ్మా వద్దు

ఫోన్లే నాన్నా – మమ్మీ వస్తే ఊర్కే అరుస్తుంది! నేనూ నీ దగ్గరే కూచుంటాను

పాప తల రాస్తూ – కూర్చున్నాను

నాన్నా! ఇది జనవరి నెల కదా–

అవునమ్మా!

మరయితే నానమ్మ కృష్ణ బాబాయ్ దగ్గర్నుంచి రాలేదేం?

–అమ్మ రాలేదు – నిజమే ఎందుకు రాలేదు – చాలా కలతగా ఉంది

నాన్నా! నాన్నమ్మ వస్తే ఎంచక్కా రాముడి కథ చెప్పుకోవాలి రాముడూ వాళ్ళు అడవికి వెళ్లటం వరకూ చెప్పిందప్పుడెప్పుడో! ఆ తరువాత చెప్పమని అడుగుతా – నాన్నమ్మ రాగానే!

–గుమ్మం దగ్గర ఏదో అలికిడి–

ఒళ్లో నుంచి చెంగున దూకి పాప పరుగెత్తింది– బాబాయ్ వచ్చాడంటూ

కృష్ణ వచ్చాడు – వాడి ప్రక్కన అమ్మ లేదు – అంటే–?

–అన్నయ్యా ఏమిటి అర్జంటుగా రమ్మన్నావుట నువ్వు ఫోన్ చేసేసరికి నేనూ లేను అమ్మ గురించి అడిగావుట

అవున్రా – అమ్మ నీ దగ్గర్నుంచి యింకా రాలేదని – ఆరోగ్యం గానీ బాగా లేదేమోనని నీకు ఫోన్ చేశాను నీ దగ్గరా అమ్మ లేదుట – మీ ఆఫీసులో ఎవరో రామారావుట చెప్పాడు!!

అమ్మ యిక్కడికి రాలేదా?

రాలేదురా!

అదేమిటి – నేను పద్నాలుగో తారీకునే రైలెక్కించాను ఇవాళప్పుడే ఇరవై అయిదో తారీకు! – ఇంకా ఇక్కడికి చేరలేదంటే – ఏమై ఉంటుందన్నయ్యా?

– అదే నాకూ అర్థం కావట్లేదు–

చిన్నన్నయ్య దగ్గరికి వెళ్లి ఉంటుందంటావా?

లేదురా – వాడూ తన దగ్గరికి రాలేదన్నాడు – ఫోన్ చేస్తే

మరి?

క్షణం ఆగి – అన్నయ్య – పోలీసు రిపోర్టిచ్చావా?

పోలీసు రిపోర్టు యింత ఆలస్యంగా యిస్తే మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది

ఇంకా ఇలా నానుస్తూ కూచో కన్నయ్యా – పద – లే – వెళ్దాం – ఏదో కనుక్కోవాలి కదా!

లేచి – షర్టు తొడుక్కున్నానే కానీ – శరీరమంతా శక్తిని కోల్పోయినంత నిస్త్రాణగా ఉంది

పోలీస్ స్టేషన్లో రిపోర్టు మీద సంతకం పెట్టి వాళ్ళు ఫొటో అడిగితే, నన్నక్కడే ఉండమని వాడు యింటికి వెళ్లాడు

అక్కడే కూర్చున్నాను – ఆకాశం వైపు చూస్తూ –

–ఏ మూల ఏ బాధలు పడుతున్నావమ్మా! ఎవరి మోసానికైనా గురై దిగులుగా ఉంది!

అమ్మ – ఏ ఏక్సిడెంటులోనైనా? – మనసు ద్రవించి కన్నీళ్ళు కారుతుంటే – అమ్మే కన్పిస్తోంది!–

అమ్మ! – వస్తే బాగుండును! క్షేమంగా ఉంటే బాగుండును!–

* * * *

అన్నయ్యా! అన్నయ్యా– కుదుపుకి కళ్ళు తెరిచాను – కంటి నీరు క్రిందికి జారింది

నా భుజం మీద చేయి వేసి – అమ్మ – ఉత్తరం వ్రాసింది అన్నయ్యా–

అమ్మ – ఉత్తరం వ్రాయడమేమిటి?– ఎక్కడ్నించి?

అలుక్కుపోతున్న అక్షరాలు చూస్తూ కళ్ళు తుడుచుకుంటూ– అమ్మ వ్రాసిన ఉత్తరంలోకి చూస్తుంటే–

22వ తేదీ–

హైదరాబాదు–

బాబూ! రాముడూ–

నిన్నూ కోడలినీ పిల్లలనీ ఆశీర్వదించి వ్రాయునది

నాక్షేమాన్ని గురించి కంగారు పడతావని, వీలు చూసుకుని వెంటనే ఉత్తరం వ్రాస్తున్నాను జనవరినాటికి నీదగ్గరికి రావలసిన నేను – రాకుండా

ఉండటం, కృష్ణుడు నీకు ఉత్తరం వ్రాయడం – పంపించమని వ్రాయడం– యివన్నీ క్రమంగా జరిగేవే కదా– అందుకని ముందుగానే ఉత్తరం వ్రాద్దామనుకున్నా– ఇక్కడ స్థిమితపడే సరికి – ఆలస్యం అయింది

బాబూ! యింతకాలం – నాయిల్లు – నాభర్త– నా పిల్లలు అన్న చక్రభ్రమణంలోనే బతికాను మహారాజు – ఆయన వెళ్లిపోయారు పిల్లలెవరికీ అన్యాయం జరగకూడదని ఆస్తి సంపాదన అంతా పిల్లల క్షేమం కోసం – వాళ్ల చదువు సంధ్యలకోసం ఖర్చు చేసినా – అందుకు ఆయనా– బాధపడలేదు నేనూ అనుకోలేదు

'మా పిల్లల'ని ఈ ప్రపంచంలోకి తీసుకు వచ్చాక, వాళ్ల కాళ్ల మీద వాళ్ళు నిలబడటం కంటే– తలిదండ్రులుగా మాకు మాత్రం కావలసినదేముంది!

పెద్దతనంలో – ఎలాగడుస్తుంది? అని – ఊళ్లో వాళ్ళు మీనాన్నని నిలదీస్తే– ఆయన ఎంత నిండుగా సమాదానం చెప్పేవారో తెలుసా బాబూ– "నా పిల్లల కేవండీ– మాణిక్యాలు! వాళ్లకాంతిలో ఈ జీవితం తెల్లవారిపోవడం కంటే నాకేం కావాలి? – నా పిల్లలు చదువుకుంటున్నారు– మంచి పేరు తెచ్చుకుంటున్నారు 'నాన్నా' అని పిలిచే వాళ్ల పిలుపు, ఆ పుత్రగాత్ర పరిష్వంగ సుఖం అవి చాలవూ! నేను నాలుగిళ్ళు ముష్టెత్తుకున్నా – గడచిపోతుంది– నా పెద్దతనం! అందుకూ నేను దిగులు పడను! అంత నిండుగానూ ఆయన వెళ్లిపోయారు!

కానీ బాబూ నలభై యేళ్ల ఆయన సాహచర్యంలో నేను తెలుసుకోలేనిది, చూడనిది – ఏడాది తిరిగి వచ్చే సరికి అనుభవం లోకి వచ్చిందిప్పుడు!

నా కడుపునే పుట్టిన నా నలుగురు పిల్లలూ నాలుగు రకాలు! ఎవరినీ తప్పు పట్టను నాయనా – పెద్ద బిడ్డవి– రాముడని పేరు పెట్టుకున్నందుకు – నువ్వూ రాముడిలా అశాంతినే అనుభవిస్తున్నావని తెలియలేదురా– కలిగిన ఇంటినుంచి వచ్చిన నీ భార్య జానకి – క్లబ్బులు, మహిళాసంఘాలు అని తనకు నచ్చిన దారిన నడుస్తుంటే – ఆ పిల్లలకి తల్లిప్రేమ అనేదే తెలియడం లేదు– పిల్లలని తల్లిప్రేమకి దూరం చేస్తూ, నేను చేరిక చేశానని – 'ముసలి వాసన వేస్తున్నారని' కదూ అంది బాదపడినా – ఒక నిజం తెలుసుకున్నాను బాబూ– జీవితానికి ఏర్పడుతున్న . కొత్త విలువలివి! అలవాటు పడటానికి –మా తరానికి కొంత సమయం పడుతుంది!

రెండో వాడినీ దగ్గరగా చూశాక– ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటూ – డాక్టర్లుగా నాలుగు చేతులుకాక– మరో నాలుగుజతల చేతులుంటే బాగుండుననుకుంటూ– స్టాటస్ సింబల్సుట– యివి అమర్చుకోవడానికి వాళ్ళు పడేతాపత్రయం – ఇదంతా చూస్తుంటే – చాలా బాదన్పించిందిరా రాముడూ! వృత్తికి అన్యాయం చేస్తూ – పేదవాళ్లని యీసడించుకుంటూ ఉంటే – తల్లిగా చూస్తూ ఊర్కోలేక – వారించలేక – గడిపాన్రా– ఆ మూడు నెలలూ! నిజమే– అడ్డాలనాడు పిల్లలు! ఇప్పుడు ఇంకేం చెప్పను'

లెక్చరరుగా శివం, విద్యని వ్యాపారానికి పెడ్తే – అనుక్షణం –మీనాన్నే గుర్తు వచ్చేవారు! ఎందరో విద్యార్థులు ఆయన దగ్గర చదువుకుని పెద్దవాళ్లయ్యారు ఏనాడూ ఎవరి దగ్గరా ఆయన ఒక్క రూపాయి కూడా తీసుకోలేదు! ఆయన బిడ్డగా వాడు ప్ప–' మంచి ఆలోచనలు కల్గించమని' ఈ దేవుడికి దణ్ణం పెట్టుకుంటున్నా! ఇక నే చేయగలిగిందింతే!

అందరూ– నీ కేవమ్మా– నలుగురు మగ పిల్లల తల్లివి! వాళ్లేనాకు ఆస్తి! అంటే – నిజమే– పిల్లలే నాకు సంపదనుకున్నాను! ఆదివారాలూ, సోమవారాలూ, నాగుల చవితులూ చేశాను! నా పిల్లలు ఆయురారోగ్యాలతో క్షేమంగా ఉండాలనే కోరుకునేదాన్ని! అన్నట్టు బాబూ– రాముడూ – నీ తమ్ముడు – నాలుగోవాడు– వాడి ఆనందానికి పిల్లలు బారంట! తన జీవితం తను 'అనుభవించ' డానికేనట! – వాడు చదువుకున్న చదువు నేర్పినది – యిదేనా? –అన్పించి కళ్ళు తడిశాయిరా!

–అసలు విషయం చెప్పాలని – చాలా అనవసరంగా అన్నీ వెళ్లబోసుకున్నట్టున్నాను– మీరంతా పెద్దవాళ్లయ్యారు! ఎవరికి తోచినట్టు – వాళ్ళు – మీ జీవితాలు మీవి! –నేనూ బ్రతకాలికదా! బ్రతకాలనే ఉంది– ఆయన పిలిచేవరకూ! – కృష్ణుడు రైలెక్కించాడు– నిజానికి నీ దగ్గరికే గావాలి– దార్లో విశ్వం కన్పించక పోతే!

–అన్నట్టు విశ్వం గుర్తున్నాడా? నాన్నదగ్గర చదువు కున్నాడు నీ యీడువాడే! ఇక్కడే హైదరాబాదులో లెక్చరరుగా చేస్తున్నాడు ఆ అబ్బాయి బార్య వసుద! ఆ అమ్మాయి ఎమ్మే వరకూ చదువుకుంది! పాపం – ఆ అమ్మాయికి కళ్ళులేవు అయినా– యింట్లో ఉన్న అనుక్షణం ఆప్యాయంగా తిరిగే ఆ జంటను చూస్తుంటే– ఎంత హాయిగా ఉందనుకున్నావ్! – తన యింటికి తీసుకు వచ్చి పెద్దదిక్కుగా వాళ్లయింట్లో ఉండిపొమ్మన్నాడు విశ్వం! తల్లి కాబోతున్న వసుదకి తోడుగా ఉండమన్నాడు– నా చేతుల మీదుగా పురుడు పోయిస్తే – తన యింటి దీపం వెలుస్తుందన్నాడు!–

–ఆలోచిస్తే– ఆ అబ్బాయి అడిగిన దానిలో తప్పేం లేదన్పించింది! వాళ్లకి ఒక పెద్ద దిక్కు కావాలి కళ్ళులేని ■ అమ్మాయికి ఒక ఆసరా





కావాలి'

–నాకూ ఒక సత్కాలక్షేపం కావాలి అంటే– పరస్పరం ఒకరి సహాయం మరొకరికి కావాలి' వాళ్ళకి నేను 'భారాన్ని' కాదు నాకూ– వాళ్ళకి సహాయపడుతున్నాననే 'తృప్తి' ఉంది' – ఇది చాలదూ– వాళ్ళతో ఉండిపోవడానికి'

ఇదంతా చదివి బాధపడకు బాబూ – నా పిల్లలతో చెప్పుకుంటే ఇదో తృప్తి' అందుకే అంతా వివరంగా వ్రాశాను

బాబూ– మీ నలుగురిలో ఎవరి మీదా నాకు కోపం లేదు' తల్లికి – పిల్లల మీద కోపం రాదునాన్నా'

## అమ్మంటే.. అమ్మే!

చిరునామా వ్రాస్తున్నా– వీలు చూసుకుని క్షేమసమాచారాలు తెలియజేయండి – అప్పుడప్పుడూ నన్ను యిక్కడ్నుంచి కదిలించే ప్రయత్నం మాత్రం చేయకండి బాబూ'

పాపకి బుజ్జికి – జానకికి ఆశీస్సులు–

ఆశీర్వదిస్తూ – అమ్మ

అమ్మ – అక్షరాల్లో కనిపిస్తోంది ఎంత సంఘర్షణకు లోనై అమ్మ ఈ నిర్ణయానికి వచ్చిందో'

# త్వరలో ప్రారంభం!

## కొత్త శీర్షిక




# చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి వైద్య సలహాలు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకి ఆరోగ్య సంబంధమైన సమస్యలపై ప్రసిద్ధ ఆయుర్వేద ఔషధాల తయారీ సంస్థ చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వైద్య నిపుణులు సమాధానాలు ఇస్తారు పాఠకులు తమ ప్రశ్నలని "చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి వైద్య సలహాలు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003 అనే చిరునామాకి ఈ కింద ఇచ్చిన కూపన్ జతపరిచి పంపవచ్చును ఒక కూపన్‌తో ఒక ప్రశ్నని మాత్రమే పంపాలి

కూపన్

ఆంధ్ర సచిత్ర వార పత్రిక




చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి

వైద్య సలహాలు

ప్రశ్న



పంపినవారి పేరు

పూర్తి చిరునామా

## నలభై ఏళ్ల స్వాతంత్ర్యం

మళ్ళీ వచ్చింది జాతీయ పండుగ
పెద్దలకు, పిల్లలకు సెలవు దండిగ
నాయకులూ వినాయకులూ
నేడు చేస్తారు ప్రసంగాలు మెండుగ
అంతా బాగున్నదని, అభివృద్ధి
జరిగిందనీ చెప్తారు నోరు నిండుగ
వంచన దగా మోసం
పెంచుకుంటున్నాం
నదీ జలాలు సరిహద్దుల
తగాదాలు పరిష్కరించలేని
కమిషన్లు, పెంచుతున్నాయి
ఏంబిషన్లు (ఆశలు)
పరస్పర సహాయం, అవగాహన
మంచితనం కరవైంది
40 ఏళ్ల స్వాతంత్ర్యం
ఏమున్నది గర్వకారణం?
అధికారులకు లేదు
అధికారం బలహీనత
ఉదాశీనత, ఉపేక్ష
దేశం అంతటా
రాజకీయ రంగంలో
విదేశీ గండం స్విస్ బ్యాంకులూ
బోఫోర్సులు జలాంతర్గాములూ
నాయకులకు నోట శుద్ధి లేదు
అసభ్య ప్రసంగాలు అధికమైనాయి

★ ★ ★

అందరికీ ఆశారేఖ
కొత్త రాష్ట్రపతి రాక
ఏం చేస్తారో ఏమిటో
వేచి చూడాలి ఇక

-ఎం ఎస్ ఎం

నోరారా 'రాముడూ' అని పిలిచే అమ్మ – అలా ఎక్కడో కానిచోట ఉండిపోతున్నా ఏం చేయలేక పోతున్నాను' మా అందరినీ క్షుణ్ణంగా అర్థం చేసుకున్న అమ్మని – ఇంక ఏమని మభ్య పెట్టగలను?

ఎక్కడ ఉన్నా – క్షేమంగా ఉందని సరిపెట్టుకోవాలి – కాగితం మడిచి జేబులో పెట్టుకున్నాను

లేచి – పదరా, కృష్ణా అని వాడివెంట బయటికి నడిచాను

అన్నయ్యా' అడ్రసుందికదా – ఎలాగా వచ్చాను ఒకసారి హైదరాబాదెళ్లి అమ్మను చూసి వద్దామా? అడిగాడు కృష్ణ

అమ్మకి మనం 'చేయ'వలసిన వాళ్ళం 'చూసి' రావడానికి వెళ్లాలి' అలాగే – వెళ్దాం– అన్నాను గొంతులో తడి అడ్డం పడుతుంటే 

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## మహిళా పాఠకులకి మరో కొత్త శీర్షిక!

# ఈ కాలం పెళ్లిళ్లు










**మన సంస్కృతిలో వివాహానికి అత్యంత ప్రాముఖ్యం, ఎంతో పవిత్రత ఉన్నాయి. ప్రతి వ్యక్తి జీవితంలో పెళ్లి అన్నది అతి ముఖ్యమైన మలుపు. స్త్రీ పురుషుల జీవితాలలో అది ఒక మధురమైన దివ్యానుభూతి, నూరేళ్ల పంటగా నిలిచే పవిత్ర బంధం.**

మారుతున్న నేటి సమాజంలో పెళ్లిళ్లు ఎలా జరుగుతున్నాయి? వివాహాల విషయంలో ఎలాంటి సమస్యలు ఎదురవుతున్నాయి? మొదలైన విషయాలని చర్చిస్తూ ఈ కింద పేర్కొన్న అంశాలపై లేదా వాటిలో కొన్నిటిని గురించి కానీ వ్యాసాలు రాసి పంపవచ్చును.











1 మారుతున్న సామాజిక పరిస్థితులు
2 విడాకులు పునర్ వివాహాలు
3 భార్యల సంపాదనలు ఉద్యోగాలు
4 కట్నం
5 సమిష్టి కుటుంబం
6 వివాహంలో వ్యభిచారం సెక్స్
7 కులాంతర వివాహాలు
■ వివిధ కులాలలో వివాహ వ్యవస్థ
9 మతాంతర వివాహాలు
10 ఇంకా రాబోయే మార్పులు
11. సినిమాల పత్రికల ప్రభావం
12 భర్తలని హింసించే భార్యలు

## నిబంధనలు :

- ★ రచనలు ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉండాలి
- ★ ఆడవారి రచనలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది
- ★ రచనతో పాటు రాసినవారి ఫొటో పంపవచ్చు
- ★ రచనలు కాగితానికి ఒక వైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి
- ★ వ్యాసాలు రెండు అర తావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది
- ★ వ్రాత ప్రతి మీద వ్యాసం రాసిన వారి పేరు, పూర్తి చిరునామా ఉండాలి
- ★ ప్రతి రచనతో ఈ పేజీలో ఇచ్చిన కూపన్ జతపరచి పంపాలి కూపన్ జత పరచకుండా పంపిన వ్యాసాలు పరిశీలింపబడవు
- ★ ప్రచురించిన ప్రతి రచనకీ రు 50/- పారితోషికం ఇస్తాము
- ★ ప్రచురణకి స్వీకరించని వ్యాసాలని, ఫొటోలని తిప్పి పంపగోరేవారు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు
- ★ ప్రచురణకి స్వీకరించిన రచనల విషయం ఆయా రచయిత్రులకి తెలియ చేయటం జరుగుతుంది
- ★ పరిశీలనకి పంపే వ్యాసాలని 'ఈ కాలం పెళ్లిళ్లు'' శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అనే చిరునామాకి పంపాలి

–సంపాదకుడు

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### ఈ కాలం పెళ్లిళ్లు

పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## "ఉచిత విద్య చెప్పించాలి"

"చెప్పురా వెధవ - రాముని చావబాదుతున్నారు రైల్వే పోలీసులు

"రైలుబండెక్కి టిక్కెట్టుపీ తియ్యకుండానే తిరుగుతున్నారు యింకా అది చాలనట్టు, దొంగతనాలు ఒకటి. పద జొక్కలో తోసేస్తే గాని.. మీవని యిక లాభం లేదు"

కన్నీళ్ళు కారుతుండే, విలవిల ఏడుస్తున్నాడు రాము అసలే ఆకలితో ఉన్నాడు ఆరు రోజుల నుంచీ

అనకాపల్లి నుండి, అమ్మ కొడితే భయపడి రైలుబండెక్కి 'వచ్చే' శాడు నాన్నలేడు డబ్బు తేవటాన్కి

అమ్మే అన్నను జ్వరంతో కూలీ కెళ్ళలేని అమ్మ అన్నమెలా తేగలదు ?

కాని అన్నమే కావాలని ఏడ్చాడు రాము

అవును - మరి అర్ధాకలీ కాకుండా అసలు భోజనమే చెయ్యకుండా ఎన్నాళ్ళుండగలదా పసికందు

ఆ క్షణంలో అమ్మ మీది కోపంతో రైలు బండెక్కే శాడు ఆకలి వేస్తుంటే అప్పుడూమ నీళ్ళు తాగాడు

కాని ఎంత కాలమలా బ్రతక గలడు

పదేళ్ళ వయసులో పచ్చి మంచి నీరుతో ఎన్నాళ్ళు గడప గలడు?

స్టేషన్లో . రొట్టిలమ్మే వాడలా తలతిప్పగానే రొట్టిలు దొంగిలించాడు పరుగు లంకించుకున్నాడు

అమ్మో ఆ మధ్య తరగతి రొట్టిలమ్మేవాడూరుకొంటాడా? రామును వెంబడించి పట్టుకున్నారు పోలీసుల కప్పగించాడు

వాళ్ళు రాముని "నీదేవూరు? ఎందుకిలా తిరుగుతున్నావ్?" అనేక ప్రశ్నలు వేస్తున్నారు తనని సొంత ఇంటికి అప్పజెప్పాలని చెప్తే అమ్మ వద్దకి తీసుకు పోతారు అన్నం వుండదు చెప్పకపోతే చావబాదినా కాస్తంతా బువ్వైనా పెడ్తారు అందువలనే ఆ పసికందు అయోమయంగా ఏడుస్తున్నాడు

పోలీసులూరుకొంటారా? అతన్ని నేరుగా బాలనేరస్థుల శిక్షణాలయాన్కి పంపివేశారు

యిలా బాలనేరస్థుల శిక్షణాలయానికి వెళ్ళే పసిబాలల సంఖ్య మన దేశంలో రోజురోజుకీ పెరుగుతోంది

దీనంతటికీ కారణం ఏమిటి?

పెరుగుతున్న జనాభా తరుగుతున్న మానవత్వం సమసిపోతున్న సమానత్వం ప్రతిదినం పీడించే పేదరికం

తండ్రి తాగుబోతై మంచి వాడైనా మంచిగా వుండనీయని సమాజం దురలవాట్లు ఆర్థికంగా చితికి పోయిన బ్రతుకులు యివన్నీ చిన్నారి బాలల జీవితాలు దీనగాథలుగా మారడాన్కి దోహదం చేస్తున్నాయి

వీటిని నివారించటమెలా?

దీనికోసం ప్రభుత్వం ఎంతగానో కృషి చెయ్యాలి పసి బాలలందరి ఉచిత భోజన వసతితో విద్య చెప్పించాలి వారి కుటుంబ



సమస్యలు వారి భావి జీవితాలపై ప్రభావం చూపకూడదు

అనాడే దేశంలో సుభిక్షం సౌభాగ్యం !

–ఎమ్. వి. జె. భువనేశ్వరరావు,
గవరపాలెం, అనకాపల్లి



* * *

## వినూత్న మార్గాలు కనిపెట్టాలి!

జీవితం అంటే ఏమిటో తెలీనివాళ్ళు ఎంతో జీవితాన్ని అనుభవించాల్సిన వాళ్ళు, మోసానికి ద్వేషానికి నిర్వచనం తెలియని ఐదా రేడుల చిన్నారి బాలలూ మనకు నడి రోడ్డుమీద నేరస్తులుగానో, బిచ్చగాళ్ళు గానో మోయరాని బరువులు మోసే చేయలేని చేయరాని పనులు చేసే వాళ్ళుగానో దర్శన మిచ్చినప్పుడు హృదయం తరుక్కుపోతుంది కన్నీళ్ళు కాలవలై పోతాయ్

శ్రమ శిక్షణ సున్నితంగా సూదిలా ఉండాలి తప్ప కర్కశంగా గొడ్డలిలా ఉండ కూడదు ఈ విషయాన్ని విస్మరించిన ఒ అన్నగారు తన తమ్ముణ్ణి రోజూ చదువు విషయమై విపరీతంగా బాద పెట్టేవాడు దీపంతో చెవిని కాల్చేవాడు తలకాయను గోడకేసి బాదేవాడు చివరికా తమ్ముడు చదువును గాలిలో వదిలేసి రైలెక్కి ఎటో వెళ్ళి పోయాడు

తల్లి తండ్రుల విపరీత గారాబం విపరీత నిర్లక్ష్యం దరిద్రం చెడు సావాసాలు చూసే సినీమాలూ. ఇలాంటి వన్నీ కలగలిసి పాలవంటి చిన్నారి మనసుల్ని పసి బ్రతుకుల్ని విష పూరితం చేసి బవిష్యత్తును అందకార బంధురం చేస్తున్నాయి

తమ సొంత పిల్లల్ని చెరువులు కాలువల దగ్గరకు వెళ్ళనివ్వని వాళ్ళు పసి పిల్లల్ని పంపించి నీళ్ళు మోయించు కోవడానికీ, బట్టలు ఉతికించుకోవడానికీ సంకోచించరు

నీళ్ళ కోసం వెళ్ళిన ఓ పసిపాప దుర్మరణాన్ని కళ్ళారా చూసిన నేను, జరిగి ఎన్నాళ్ళో అయినా ఇప్పటికీ మరిచి పోలేక పోతున్నాను

ఇంకా హోటళ్ళలో, దుకాణాలలో, ఫాక్టరీలలో ఎక్కడబడితే అక్కడ చిన్నారి బాలల శ్రమ మనకు సాక్షాత్కరిస్తూనే ఉంటుంది శ్రమకు తగ్గ ప్రతిఫలమా? అంటే అదీ ఉండదు బ్రతుకు ఎండలో మాడిపోయే చిన్నారి

(ఫొటో మాస్టర్ రమణ)



బాలల్ని కనీసం ఏ చెట్టు నీడకయినా చేర్చవలసిన మానవతా బాధ్యత మనకుండాలి చట్టాన్ని అతిక్రమించి బాలల శ్రమను దోచుకునే వాళ్ళను శిక్షించాలి పేదరికం ప్రాతిపదికగా ఊబిలో దిగే అవకాశం ఉంది గనుక సామాన్య బాలల కోసం ప్రభుత్వం సంక్షేమ పథకాలను విరివిగా ప్రవేశపెట్టి సఫలీకృతం చెయ్యాలి బాలల మనో వికాసానికి వినూత్న మార్గాలను కనిపెట్టాలి నేటి బాలలు రేపటి పౌరులు . అనే దాన్ని రేపటి ఉత్తమ పౌరులు అని మార్చి రాయాలి

– అడబాల సత్యనారాయణ,
పెద్దమడ

* * *

# బాలలు అభ్యుదయ జ్వాలలు కావాలి!

చిన్నారి బాలల దీనగాథలు చూస్తున్నప్పుడు, వింటున్నప్పుడు కన్నీరు జాలువారుతుంది వారి బాధలు మనసును జాలితో నింపుతాయి చిన్నారి బాలల దీనగాథలు రకరకాలుగా ఉంటాయి. అక్రమ సంబంధంగా పుట్టిన శిశువులను తల్లిదండ్రులే కావాలని దూరం చేసుకుంటారు అలాంటి శిశువులు పశువుల కన్నా హీనమైన, దీనమైన పరిస్థితుల్లో పెరుగుతారు కన్నవారి ప్రేమకు నోచుకోక అనాథ శరణాలయాల పాలై అభాగ్యులుగా పెంప బడతారు సమాజం వారిని చిన్న చూపు చూస్తుంటుంది అది వారిలో కసిని, ద్వేషాన్ని పెంచుతుంది కొందరి విషయంలో బాలల పెంపకంపై తల్లిదండ్రులు తగిన శ్రద్ధ చూపనందు వల్ల కూడా వారు అనారోగ్య వంతులు గాను, సోమరులు గాను తయారవుతారు అందుకు బాధ్యత కన్నవారే వహించాల్సి ఉంటుంది అయితే ఈ విషయంలో ప్రభుత్వం కూడా తీవ్రంగా ఆలోచించి తగిన పథకాలు అమలు చేయాలి అనాథ బాలలకు అన్ని వసతులు కల్పించి వారిలోని అసంతృప్తిని పోగొట్టి వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దుటకు తగిన చర్యలు గైకొనాలి అంగ వైకల్యం పొందిన బాలలకు ప్రత్యేక వసతులు, శిక్షణ కల్పించి వారి జీవితాలకు ఆధారం చూపించాలి వారిలో ఆత్మ విశ్వాసం పెంపొందించాలి అంతేకాక అంగన్‌వాడి, బాల్వాడి, శిశు సంరక్షణ పథకాల ద్వారా బాలల సంక్షేమానికి అధిక ప్రాధాన్యత ఇవ్వాలి స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా బాలల అభ్యున్నతికి, మానసిక వికాసానికి తగిన కార్యక్రమాలు చేపట్టాలి సమాజంలోని ప్రజలు కూడా బాలల పట్ల ఆదరాభిమానాలు ప్రదర్శించాలి కానీ వారిపై నిర్దయను, నిరాదరణను చూపటం




మానవత్వం అనిపించుకోదు వారి లేత హృదయాలపై ఎలాంటి అవాంఛనీయ ముద్రలు వేసినా అవి మొత్తం సమాజంపై ప్రభావాన్ని చూపుతాయి కనుక జాతి భవిష్యత్తు బాలల మీదనే ఆధారపడి వుంటుంది కాబట్టి వారి శ్రేయస్సు సమాజ శ్రేయస్సు, దేశ శ్రేయస్సుగా భావించి ప్రతి ఒక్కరూ తమ వంతు పాత్రను నిర్వర్తించాలి పాపలు మమతా సమతల రూపాలుగా, మానవతా దీపాలుగా వెలగాలి కానీ సృష్టికే శాపాలుగా మారకూడదు



బాలలు నలుగురిలో బేలలు కాకూడదు అభ్యుదయ జ్వాలలుగా నిలవాలి అప్పుడే జాతికి, సంస్కృతికి మేలు జరుగుతుంది

– బొగ్గరపు ఇందిరాకృష్ణ,
పామూరు (ప్రకాశం)

* * *

# అభిరుచిని గుర్తించాలి!

తమ పిల్లలు పెద్ద చదువులు చదివి ఉన్నత పదవుల నధిరోహించాలనీ, కీర్తి ప్రతిష్ఠల నార్జించాలనీ ప్రతి తల్లి తండ్రి కోరుకోవడంలో తప్పులేదు కాని చాలామంది తల్లిదండ్రులు వారి పిల్లల మానసిక స్థాయిని గమనించరు వారిలో గల తెలివితేటలను వెలికి తెచ్చి పెంపొందింపజేసే ప్రయత్నాలు చేయరు ఒకేసారి వారి పిల్లల్ని అన్ని చదువులు చదివేయాలనీ, సకల కళా ప్రవీణులు కావాలనీ నిముషం కూడా వారిని ఖాళీగా ఉండనీయక, వారి వయస్సును కూడా గమనించక ఆ ట్యూషన్, ఈ ట్యూషన్ అంటూ పంపిస్తుంటారు నిముషం కూడా వాళ్ళను ఖాళీగా వదలకుంటే పిల్లలకు చదువుపట్ల మానసిక విముఖత కలుగవచ్చు పదే పదే చదువమంటుంటే చదువంటేనే భయం, విసుగు పుట్టడానికి అవకాశాలు లేకపోలేదు . చదివే సమయంలో చదువుకోమని చెప్పాలి ఆడుకోడానికి అవకాశమివ్వాలి అంతేగాని వాళ్ళని నిర్బంధంగా చదివించాలని ప్రయత్నించాలని ప్రయత్నించ కూడదు వాళ్ళకై వాళ్ళకు చదువు పట్ల శ్రద్ధ కలిగేలా చేయాలి, అప్పుడే వాళ్ళు తమ తమ చదువులను సక్రమంగా కొన సాగించగల్గుతారు ఇదేగాక పిల్లలకు ఏ విషయం, ఏ కళ పట్ల అభిరుచి వుందో గమనించి మరీ ప్రోత్సహించాలి వారి అభిరుచులను గమనించక నీవు ఫలానా కోర్స్' చదవాలని నిర్బంధించ కూడదు ఇలాంటి నిర్బంధపు చదువుల మూలంగా వాళ్ళు 'రెంటికీ చెడిన రేవడి'గా మారిపోవడానికి అవకాశముంటుంది




కనుక పిల్లల తల్లిదండ్రులు తమ పిల్లల మానసిక స్థాయిని, అభిరుచులను బట్టి వారిని చదివించాలే గాని గొప్పలకు పోయి, తమ ఇష్టాలను బలవంతంగా వారిపై రుద్దాలనుకోవడం మంచిదికాదు పిల్లల అభీష్టాల కనుగుణంగా వారిని ప్రోత్సహిస్తూ సక్రమమయిన మార్గంలో వారిని నడిపించగలిగితే తామాశించిన గమ్యాన్ని తమ పిల్లలు తప్పకుండా చేరగల్గుతారు అనడంలో సందేహంలేదు

- ఇలపావులూరి
శారదాప్రియదర్శిని
ఇలపావులూరు (ప్రకాశం) □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్

# వారఫలం

## 21-8-1987 శుక్రవారం మొదలు 27-8-1987 గురువారం వరకు

★ **మేషం** రాజకీయంగా మీకు మేలు జరుగుతుంది కానివర్గ మున్నది గ్రహించారా? వృత్తియందు అనుకూలం పగపట్టి సాదించాలనే వారున్నారు. గ్రహించండి ఆదాయానికి లోటు రాదు వ్యాపారం యదాతదం స్త్రీలకు కృషి లోపం లేకుంటే అంతా మేలే

★ **వృషభం** మీ యింట శుభం జరుగుతుంది వస్తు సేకరణకు అనుకూల సమయం చాల మంది దూర ప్రాంతాలకు పోగల అవకాశా లున్నాయి అనుకూల వార్తా శ్రవణం వృత్తి యందు మెరుగున్నది స్త్రీలకు స్థితిగతు లందు మెరుగు శుభ వార్తా శ్రవణం

★ **మిధునం** ముఖ్య బందువులను కలసి కొంటారు ప్రత్యర్థు లున్నారు, అసూయాగ్రస్తు లున్నారు ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మేలు. సుఖ శాంతులకు లోపం లేదు గాని, అదిక వ్యయమున్న వారం ఎలా తట్టుకొంటారో! స్త్రీలకు వృత్తియందు మెరుగు, రాజకీయాలందు అనుకూలం

★ **కర్కాటకం** వ్యవహారరీత్యా అనుకూలం పరిస్థితులందు మెరుగు నూతనోత్సాహం విద్యా విషయంగా పెంపు. అనుకొన్న వ్యవహారాలు ఆనందంగా నెరవేరుతాయి కళారంగాన మెరుగు కనిపిస్తుంది స్త్రీలకు రాజకీయాల్లో తల దూర్చి, కొందరు యిబ్బంది పడుతారు

★ **సింహం** గ్రహించారుగా! శని వ్యతిరేక పలమే యిస్తాడు అదికార మందు వృద్ధి చెప్పవచ్చు నూతన మిత్ర సంపద, అదికారుల ఆదరణ దనాదాయం నూతన వ్యవహారాలందు ప్రగతి, ఆనందం స్త్రీలకు కృషితో నాస్తి దుర్భిక్షమ్ అని తెలిసికో గలుగుతారు ప్రత్యర్థు లున్నారు జాగ్రత్త!

★ **కన్య** దన విషయంలో మీకు ఎలాంటి లోపం లేదు శని అనుకూలుడు రాజకీయంగా మేలైన సమయం అందుకో దలచిన కొమ్మను అందుకొన్నారుగా! ఇకనేం? ప్రజా సేవ చేయండి అనుకొన్న విదంగా మేలున్నది నూతన వస్తు సేకరణకు అవకాశం గలవారం స్త్రీలకు వస్తు సేకరణ, నగలు కొనుగోలు చేయుటకు అనుకూల వారం

★ **తుల** రాజకీయాల జోలికి పోకండి ఆ వైపు కూడా చూడకండి అనుకూలం గాదు కోర్టు వ్యవహారాలు అంతకన్న మేలుగాదు నూతనోత్సాహానికి యిది సమయం స్త్రీలకు అనుకూలం, ఆనందం స్థితి మార్పు ఉద్యోగ లాభం

★ **వృశ్చికం** క్రమంగా మి స్థితియందు అబివృద్ధి కనిపిస్తున్నది ఆదాయమందు వృద్ధి యున్నది వ్యాపారం అనుకూలం వృత్తి యందు చెప్ప దగిన మార్పులు రానున్నవి అనుకూల వ్యక్తుల సాంగత్యం, ఆదాయంలో మెరుగు, చుట్టు ప్రక్కల వారి వలన లాభం స్త్రీలకు ఇంకా చికాకులు తొలగ లేదు, శని వేద, బాదలు ఉన్నాయిగా!

★ **ధనుస్సు** ఇంటా బయటా యిబ్బందులే శని అనుకూలుడు గాడు అదిక శ్రమకు గురి అయ్యే సమయం మీ మాట వినే వారెందరో, వినని వారెందరో! తెలిసికోలేక బాద పడుతారు ఆరోగ్య మందు పెంపు స్త్రీలకు కృషి లోపం లేకుంటే, అన్ని విదాలా మేలే! లాబమే

★ **మకరం** ఏది ముందు చేయాలో, ఏది వెనుకో తెలియక తికమక పడుతారు వ్యర్థపు టాలోచన లుంటాయి కోర్టు కచేరీ వ్యవహారాలందు కొంత తటపటాయింపు, అనానుకూలత చికాకు, చెప్పదగిన సమయం అట్టి గ్రహ స్థితి యున్నది స్త్రీలకు శుభవార్తా శ్రవణం ఉద్యోగ మందు మెరుగు

★ **కుంభం** ఏం మీరు వ్యాపారం చేయాలను కొన్నారా? తొందర పడకండి వృత్తి యందు లోపం ఏర్పడిందని ఆవేదనా? తొలగి పోతుంది రాజకీయాలందు మీ కృషి చాలదు ఈ ప్రయత్నమూ అనుకూలం గాదు స్త్రీలకు రాజకీయ, వృత్తి, వ్యాపారం ఉద్యోగాలందు యింకా కృషి అవసరం

★ **మీనం** ఆదాయం గల సమయం అనుకూల మిత్రులు చేరుతారు వృత్తియందు పెంపు చేకూరుట నిశ్చయం మాటకు విలువ పెరుగుతుంది సాదు సజ్జన సాంగత్య మున్నది మతిమరపుఅదికం అలా యిలా తిరుగుతూ వస్తువులు పోగొట్టు కొంటారేమో! జాగ్రత్త! స్త్రీలకు విద్యా వ్యవహార వ్యాపారాదు లందు అనుకూల వారమే

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# రాములన్న తెలివి

లక్ష్మయ్య పెద్దన్న రాములు కూతురు బుజ్జమ్మ పెళ్ళి ఏర్పాట్ల హడావిడి జరుగుతుంటుంది అంతలోనే వెంకన్న బాబాయి అక్కడికి వస్తాడు

























R K SWAMY/NIA/2977/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి, లేదా ఏజెంటును కలవండి.



న్యూ ఇండియా ఎష్యూరెన్స్

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

# ప్రేమసాగరమథనం

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



సీరియల్

(గత సంచిక తరువాయి)

దీప్, విలూ ఎక్కిన ఐ టి డి సి బస్ స్నేక్ పార్క్ దగ్గర ఆగింది యాత్రికులను తీసుకుని గైడ్ పార్క్ లోపలకు వెళ్ళాడు కొండ చిలువ మొదలుకొని త్రాచు పాము వరకు రకరకాల పాములను వాటికి సహజమైన వాతావరణంలో పెంచుతున్నారు పార్క్‌లో ఒక చోట ఇనపమెష్ ఎన్‌క్లోషర్ లోపల ఒకతను త్రాచు విషం పిండటం ఎలానో డెమాన్‌స్ట్రేట్ చేస్తున్నాడు

అడుగో నాగరాజు అంది విలాసిని ఉలికి పడి చుట్టూ చూసాడు దీప్!

ఎక్కడ? అని అడిగాడు

అదిగో అక్కడ! అని ఎన్‌క్లోజర్‌లో చూపింది

ఎన్‌క్లోజర్‌లో పరీక్షగా చూసి

ఏదీ కనపడటం లేదే? అని అడిగాడు దీప్ కిలకిల నవ్వుతూ ఉత్తర దేశపు అబ్బాయికి పుస్తకాల్లో రాసిన తెలుగే వచ్చు! వాడుక తెలుగు రాదు అంది విలాసిని

ఏం?

నాగరాజు అంటే త్రాచుపాము అన్నమాట అదుగో విషం కక్కటానికి సిద్ధంగా వుందే అదే నాగరాజు! అంది చిరునవ్వులు చిలుకరిస్తూ!

అంతేగదా! నేనింకా నీ మేనమామ నీ మీద ప్రేమతో మనల్ని వెంటాడుతూ స్నేక్ పార్క్‌లో కొచ్చాడేమో అని బయపడ్డాను

అడుగో కోటిగాడు! దీప్ కంఠంలో వొలికిన ఆదుర్దాకు వులికి పడింది విలూ చుట్టూ చూసి కోటి కనపడక పోయే సరికి

ఎక్కడ? అని అడిగింది

కనుక్కో చూద్దాం?

మళ్ళీ చుట్టూరా చూసి కోటి కనపడక పోయే సరికి

చెప్పు దీప్! నాక్కనపడటం లేదే? అంది విలూ

అడుగో అక్కడ! చెతివేలితో ఫెన్సింగ్ లోపలకు చూపాడు దీప్

ఏపుగా పెరిగిన వేపచెట్టు మొదలుకు చుట్టుకుని వున్నది పెద్ద కొండ చిలువ!

దానిని చూస్తునే కంపరం పుట్టింది విలూకు

ఎంత బయంకరంగా వుంది! అంది విలూ

ఇంతకంటే బయం కరమైనది మరొకటి వున్నది!

ఏది! ఎక్కడ?

కిరాయి కోటిగాడు కొండచిలువకంటే బయంకరమైన వాడు!

కొండచిలువ వున్న చోటు నుండి ఎక్కువ దూరం పోలేదు! దగ్గరకు వచ్చిన వాళ్ళను మింగుతుంది

కోటిగాడు కిరాయి డబ్బుల కోసం విజయవాడ నుండి మద్రాసు వచ్చాడు! అన్నాడు దీప్

విలూ మాట్లాడక పోయే సరికి

ఏమిటి విలూ? ఏమంటావు? అంటూ ఆమె వైపుకు తల తిప్పిన దీప్‌కు విలూ ముఖం తెల్లగా పాలిపోయి వుండటం కనపడింది

విలూ! ఆదుర్దాగా పిలిచాడు దీప్! పాలిపోయిన విలూ ముఖం మీద చెమటబిందువులు ముత్యాల వరుసల్లా నిలిచాయి

కోటి! అస్పష్టంగా గొణిగింది విలూ! మరుక్షణమే స్పృహ తప్పి పడిపోతున్న విలూని రెండు చేతులతో పొదవి పట్టుకుని పక్కనున్న బెంచీ మీద పడుకో బెట్టాడు దీప్

ఆమె ముఖం మీద నీళ్ళు చిలుకరిద్దామని చుట్టూరా చూసాడు

అప్పుడు గాని దీప్‌కు విలూకి స్పృహ తప్పి పోవటానికి కారణం తెలిసి రాలేదు!

* * * * * * * * * *

మెయిన్ రోడ్డున పది గజాలు పరుగెత్తిన తర్వాత గాని కోటికి అర్థం గాలేదు– మహాబలిపురం వెళ్ళే బస్సును అందుకోవాలంటే రోడ్డు మీద పరుగెత్తటం మార్గం కాదని

హోటల్ రూంలో వున్న అనుచరులకు ఫోన్ చేసి పిలిపించి వాళ్ళు వచ్చాక టాక్సలలో వెంబడించి బస్సును జేరుకుని ఆ తర్వాత అందులో వున్న దీప్‌ను హతమార్చాలని అనుకున్నాడు

ఎవర్రా మాట్లాడేది? దర్పంగా ఫోన్‌లో అడిగాడు కోటి

నేను నాగరాజును!

మీరాసార్! సార్! గుడ్‌న్యూస్! పెద్దమ్మాయి, ఉత్తరాది వాడు మహాబలిపురం బస్సెక్కి వెళ్ళారుసార్! నేను కళ్ళారా చూసాను!

ఆ! నిజంగా!

అవున్సార్! వెంటనే మనం టాక్సీల్లో బయల్దేరి వెడదాం! నేను ఐ టి డి సి ఆఫీసుకు ఫర్లాంగ్ దూరంలో వున్న పబ్లిక్ కాల్ ఆఫీస్ నుండి మాట్లాడుతున్నాను

సరే! అక్కడేవుండు బయల్దేరి వస్తున్నా!

**జరిగిన కథ – 12** మద్రాసు చేరిన సందీప్, విలాసినిల కోసం కింగ్‌కాంగ్ నాగరాజు, టైగర్ ఎవరి ప్రయోజనాల కోసం వాళ్ళు తీవ్రంగా వేట మొదలు పెడతారు తమ కోసం అన్ని మురాలు పొంచి ఉండగా విలాసిని, సందీప్‌లు ఒక స్నేహితుని ఇంట్లో బస చేస్తారు షీలాను కలుసుకున్న నాగరాజు విలాసిని అక్కడికి రాలేదని తెలుసుకుంటాడు కింగ్‌కాంగ్ వేటలో బాగంగా అర్ముగాన్ని సాయం కోరుతాడు అర్ముగం తరఫున విజయ రాఘవన్ వేట ప్రారంబించి, సందీప్ ఆచూకీ తెలుసుకుంటాడు సందీప్ విలాసిని మళ్ళీ తప్పించు కుంటారు కోటికి కూడ సందీప్ కనబడతాడు

సార్' ఎందుకైనా మంచిది' మన వాళ్ళందర్నీ రమ్మనండి'

అలాగే' అంటూ ఫోన్ పెట్టేసాడు నాగరాజు కోరల నిండా విషం నింపుకున్న త్రాచుపాము బుసపెట్టినట్లు విషపునవ్వు నవ్వాడు తను'

కోటి, నాగరాజు అనుచరులతో సహా రెండు టాక్సీలలో బయల్దేరారు ఐ టి డి సి ఆఫీస్ నుండి

'తొందరగా పోనీ' తొందరగా పోనీ' అంటూ డ్రైవర్‌ను హడావిడి చేయసాగాడు కోటి

'ఎక్కడకు పోనీయ్ మంటావ్' అన్నట్లు చూసాడు డ్రైవర్

"ఇంతకు ముందే మహాబలిపురం వెళ్ళింది ఐ టి డి సి బస్సు' దాన్నందుకోవాలి' అన్నాడు కోటి'

'ఆమ'" అంటూ ఏక్సిలరేటర్ మీద కాలు నొక్క సాగాడు డ్రైవరు

స్పీడో మీటర్ ముల్లు వందకిలో మీటర్లు దాటి నూటపది నూట యిరవై కిలో మీటర్ల మధ్య డాన్స్ చేయసాగింది

"ఇంకా త్వరగా పోనీ' ఈ సారి డ్రైవర్‌ను తొందర చేయటం నాగరాజు వంతయింది

విలూని లేవదీసుకు వచ్చిన వాడిని సఫా చేసి విలూని స్వాధీనం చేసుకుని తిరుపతి వెళ్ళి ఆమెను వివాహం చేసుకుని ఆమెతో ఉత్తరదేశం హనీ మూన్‌కు వెళ్తున్నట్లు పగటి కలలు కంటున్న నాగరాజు మనసుతో శరవేగంతో పయనిస్తున్న టాక్సీ పోటీ పడలేక పోయింది'

అందుకే అతను టాక్సీ డ్రైవర్‌ను యింకా తొందర చేయసాగాడు

ఏక్సిలరేటర్ మీద నుండి కాలు తీసి బ్రేక్ పెడల్ మీద బలంగా తొక్కాడు డ్రైవర్' వంద కిలో మీటర్లను మించిన వేగంతో పయనిస్తున్న కారు ఆగటానికి బ్రేక్ పెడల్ ఎంత బలంగా తొక్కినా యాభై గజాల పైనే రోడ్డును రాసుకుంటూ క్రీక్‌మని శబ్దం చేస్తూ పయనించింది టాక్సీ ఆకస్మికంగా ఆగిన కుదుపుకు వెనుక సీటులో కూర్చున్న నాగరాజు తల ముందు కూర్చున్న కోటి వీపును బలంగా వచ్చి తాకింది

తల బొప్పి కట్టిన నాగరాజు

'రేయ్' సడన్ బ్రేకేసావెందుకురా' అంటూ అరిచాడు డ్రైవర్ మీద



## ప్రేమసాగర మథనం

తలుపు తెరుచుకుని కిందకు దిగి వచ్చిన దిశగా నడువసాగాడు ట్యాక్సీ డ్రైవర్!

రేయ్! నీకేమైనా పిచ్చెక్కిందా? అంటూ అతను వెళ్ళిన వైపుగా పరిగెడుతూ అరిచాడు కోటి

సమాధానంగా చూపుడు వేలుతో రోడ్డు మీద పార్కు చేసిన బస్ చూపించాడు టాక్సీ డ్రైవర్

కోపంతో ఎరుపెక్కిన కోటి కళ్ళు ఆనందంతో తళతళ మెరిసాయి!

కాని బస్ నిర్మానుష్యంగా వుందేమిటి? అని క్షణం నిరుత్సాహపడ్డాడు

టూరిస్టులు స్నేక్ పార్కు చూడబోతిరి! కాళీబస్ ఇక్కడదా ఆగును! అన్నాడు టాక్సీ డ్రైవర్

అప్పుడు చూచాడు కోటి రోడ్డు వారన 'స్నేక్ పార్కు' అని వున్న బోర్డును

వెనకవున్న నాగరాజును అనుచరులను రమ్మని సైగ చేసాడు

చిచ్చు బుడ్డిలా వెలిగి పోతున్న కోటి ముఖం చూసి పరుగెత్తుకు వచ్చారతని అనుచరులు. అందరికంటే ముందు వచ్చాడు నాగరాజు రొప్పుకుంటూ

అమ్మాయి వుత్తరాది వాడూ స్నేక్‌పార్కు చూట్టానికి వెళ్లారు పళ్ళికిలిస్తూ అన్నాడు కోటి!

పద! ఇంకోక్షణం ఆలస్యం చేయ గూడదు అంటూ పార్కు దిశగా పరిగెత్తాడు నాగరాజు

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

దీప్ మాటలు వింటూ యదాలాపంగా వెనుదిరిగి చూసిన విలూకి తమ దిశగా పరుగెత్తుకు వస్తున్న కోటి,నాగరాజు వాళ్ళ అనుచరులు కనపడ్డారు

అందుకే ఆమెకు భయంతో కళ్ళు తిరిగినయ్! మరుక్షణం స్పృహ కోల్పోయిందామె!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రేయ్! కోటిని తప్పించుకుని పోగలవురా! ఏడు సముద్రాలు దాటి పారిపోయినా వెంటాడి సఫా చేస్తా! భయంకరంగా అరుస్తూ దీప్ మీదకు వచ్చాడు కోటి

అతని చేతిలోని ఎడిబాకు ఎండలో తళతళ మెరవసాగింది

స్పృహ తప్పిన విలూ వంక క్షణం చూసాడు దీప్! మరుక్షణం కోటిని ఎదుర్కోటానికి సమాయత్తుడై వెనుదిరిగాడు!

బలంగా బాకు పైకెత్తి దీప్ గుండెల్లో గుచ్చటానికి కుడి చేయి దించసాగాడు కోటి

మెలుకువగా తప్పుకుని ఎడమపాదంతో కోటి కుడి మోకాలు మీద తన్నాడు దీప్

మోకాలి చిప్ప పైన వున్న నరాలు చెదిరి అబ్బా! అంటూ ముందున్న ఫెన్సింగ్ మీద పడి పోయాడు కోటి

రేయ్! ఇప్పుడెక్కడికి పోతావ్‌రా! అంటూ దీప్‌ను చుట్టు ముట్టారు కోటి అనుచరులు వాళ్ళకు క్షణం కూడా అవకాశం యివ్వకుండా ఎదురుగా వున్న వాళ్ళిద్దర్నీ ముష్టి ఘాతాలతో మట్టి కరిపించి పక్కనున్న అతన్ని పాదంతో తన్ని ఎగిరి ఫెన్సింగ్ లోపలకు దూకాడు దీప్!

కిందపడ్డ వాళ్ళు కిందపడగా మిగిలిన వాళ్ళు ఫెన్సింగ్ దూకి దీప్ వెంట బడ్డారు

రేయ్! ఎవర్రా మీరు! ఫెన్సింగ్ దూకగూడదు! లోపల కొండ చిలువ లున్నాయి!

రేయ్! ఆగండిరా! అంటూ అరుస్తూ పరుగెత్తుకు వస్తున్న గార్డ్ డొక్కలో పిడి కిలితో గుద్ది అతను కిందపడగానే తనూ ఫెన్సింగ్ దూకి ముందుకు పరిగెత్తాడు కోటి

వేపచెట్టు కింద వున్న దీప్‌ను చుట్టు ముట్టారు కోటి అనుచరులు

అందరి చేతుల్లోను సైకిల్ చైనులున్నాయి! వీధి పోరాటాలకు క్షణంలో సమాయత్తమవటానికి వీలుగా వాళ్ళ జేబుల్లో ఎప్పుడూ వుంటాయవి

సైకిల్ చైనులు గిరగిర తిప్పుతూ వలయాకారంగా దీప్‌ను చుట్టు ముట్టసాగారు వాళ్ళు క్షణ క్షణం దగ్గరవుతున్న కోటి అనుచరులను తప్పుకోటం ఎలానో పాలుపోలేదు దీప్‌కు

పైనున్న వేపకొమ్మను అందుకుందామని పైకెగిరి కొమ్మను అందుకున్నాడు దీప్

ఫెళఫెళమని విరిగి చేతిలో కొచ్చింది వేప కొమ్మ! కొమ్మను గిరగిర తిప్పుతూ కోటి అనుచరుల మీద విజృంభించాడు దీప్

వలయాకారంగా దీప్ చుట్టూ తిరుగుతున్న వేపకొమ్మను తప్పుకుని అతని దగ్గరకు జేరడం ఎలానో అర్థం కాలేదు కోటి అనుచరులకు

వాళ్ళు తటపటాయించటం చూసిన దీప్ రెట్టించిన ఉత్సాహంతో వేపకొమ్మను వేగంగా తన చుట్టూ తిప్పసాగాడు

కొమ్మ కొనలు తగిలి సైకిల్ చైనులు ఎగిరి అవతలపడిపోసాగాయి ముంజేతుల మీదా, చాతీ మీద కొమ్మ కొన తగిలి బాధతో గిలగిలలాడుతూ కింద చతికిలబడి పోసాగారు కోటి అనుచరులు అయిదు నిముషాల వ్యవధిలో వాళ్లందరూ నేల మీద పడి మూల్గుతూ వుండిపోయారు

ప్రత్యర్థులు నేల గరవడంతో వేపకొమ్మ పడవేసి వాళ్ళ ముందుకు దూకి ఎడాపెడా తంతూ లేచి నుల్చున్న వాళ్ళను ముష్టి ఘాతాలతో బాదిస్తున్న దీప్‌ను చూచి భయంతో పారిపోసాగారు భయంకరంగా అరుస్తూ బూతులు తిడుతూ ముందుకురికాడు కోటి

అతని రెండు చేతుల్లోను రెండు పిడిబాకులు మెరుస్తూ వున్నాయి

పిశాచ హాసం చేస్తూ ముందు కురుకుతున్న కోటిని ఎలా లొంగదీసుకోవాలా అని దీప్ ఆలోచిస్తుండగానే అతను దగ్గరకు వచ్చేసాడు

ఆలోచనకు వ్యవధి లేకపోవడంతో చప్పున పక్కన వున్న వేపచెట్టు వెనక్కు వెళ్ళాడు దీప్!

హోరయ్యోయ్! ఆ వేప చెట్టు దగ్గర కెళ్ళకు సెట్టు నీడన కొండ

# రచయిత



# జవాబులు

పి. మైథిలి, చేబ్రోలు

ప్ర మానవున కతి ముఖ్యమైన వస్తువేది? ఒకరు ప్రేమించిన వ్యక్తిని మరొకరు ద్వేషిస్తారెందుకు?

■ మనిషి మనసును బట్టి అతనికి కావలసిన వస్తువు మారుతుంటుంది. ప్రేమ ద్వేషం వ్యక్తిగత విషయాలు – వస్తుగతంగా (ఆబ్జెక్టివ్‌గా) వాటిని సమర్థించలేము లేదా వ్యతిరేకించలేము.

దొంతమాల వాసంతి, సత్తుపల్లి

ప్ర నవలకు శైలి ముఖ్యమా కథ ముఖ్యమా?

■ రెండూ ముఖ్యమే! కథను బట్టి శైలి మారితే బాగుంటుంది.

సీతశ్రీ, గుంటూరు

ప్ర వర్తమాన రచయితలలో సాహిత్యావగాహన లేదు– ఏమంటారు?

జ వర్తమాన రచయితల రచనలన్నీ చదువకుండా వారందరితో పరిచయం లేకుండా అంత స్వీపింగ్ స్టేట్‌మెంట్ యివ్వలేను.

దేవిచైతన్య, విజయవాడ

ప్ర నేటి సాహిత్యానికి 'స్పృహ' లేదంటాను?

జ మీ యిష్టం వచ్చినట్టనుకునే స్వేచ్ఛ మీకుంది.

ఎ. గంగాధరరెడ్డి, తెనాలి

ప్ర మీ పాత్రను ఏ నవలలోనైనా సృష్టించారా?

■ లేదు.

కె. రామశేషు, జువ్వలపాలెం

ప్ర నవలలో రాసిన సంఘటన జీవితంలో ఎదురయితే?

జ థ్రిల్లుండదు!

జి. పార్వతీగోపాల్, అంబర్‌నాద్ (మహారాష్ట్ర)

ప్ర రోడ్డుపై పైసలు కనపడితే వంగి తీసుకుంటారు. మనిషి పడివుంటే తిరిగి చూడరు!

జ కాసు మీద ఆశ – ధన మూల మిదం జగత్తన్నారు. వెనుక మానవ సేవే మాధవ సేవ అన్న విషయం గుర్తుండదు ఎక్కువ మందికి.

## ఉత్తమ ప్రశ్న

టి. శశిధరకుమార్, తిరువూరు

ప్ర మీకంటే బాగా రాసే రచయితలున్నారని మీరనుకుంటున్నారా? వారి పేర్లను చెప్పగలరా? సాటి రచయితలను ఎలా గౌరవిస్తారు. వయసును బట్టా? పాపులారిటీని బట్టా? నవల పూర్తిగా రాస్తారా, బిట్స్‌గానా?

జ నాకంటే బాగా రాసే రచయితలు లేరని అహంకరించటం మొదలైన క్షణమే అధోముఖ ప్రయాణానికి సిద్ధమవుతానన్నది నా ప్రగాఢ విశ్వాసం. సమకాలీన తెలుగు రచయితల రచనలన్నీ నేను చదువలేదు. గనుక గొప్ప రచయితల పేర్లు యిప్పటికిప్పుడు రాయలేను.

మీ ప్రశ్నలో రెండో పేరాకి సమాధానం యిదివరలో యిచ్చాను.

నవలను పూర్తిగానే వ్రాసి యిస్తాను– అరుదుగా మాత్రం ఇన్‌స్టాల్‌మెంట్స్ వ్రాసి యిస్తాను.

ఎన్. రమేష్, వేంకటేశ్వరరావు, అమ్మాపాలెం

ప్ర విద్యతో పాటు సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా?

జ సెక్స్ స్పెషలిస్ట్‌ల పేరుతో కుహనా వైద్యులు పెచ్చు మీరే కంటే విద్యతో పాటు సెక్స్ ఎడ్యుకేషన్ వుండటం మంచిది.

కె. శ్రీదేవి, వైజాగ్

ప్ర మొన్నటి దాకా సుశ్రుత నర్సింగ్ హోం రన్ చేసి అంతటితో ఆగక ప్రేమ సాగర మథనం సృష్టించారు! ఇందులో సంకెళ్ళెవరికి?

■ చివరకంటా చదివితే గాని అర్థంకాదు!

ఆర్. భవాని, అల్లూరు

ప్ర పాఠకుని విమర్శను ఎలా స్వీకరిస్తారు?

జ రచయిత ఎదగటానికి సద్విమర్శ ఎంతైనా అవసరం.

బి. భారతి, రాయవరం

ప్ర డాక్టరుగా మీ విధినిర్వహణలో రచనల ప్రభావం వుంటుందా?

జ వుండదు.

వి. సుబ్రహ్మణ్యం, కోటనందూరు

ప్ర రచనలకు సెన్సార్ వస్తే ఎలా వుంటుంది?

■ సినిమాలకు సెన్సార్ వలన ఎంతమేలు గాని కీడుగాని జరిగిందో అంతకు పదింతలు కీడు, మేలు, రచనల సెన్సార్ వలన జరుగుతుంది.

పి. శ్రీరంగశాయి, చిలకలూరిపేట

ప్ర రచయితలు రచనలలో జీవితాలను గూర్చి అంతబాగా ఎలారాయగలరు? ప్రతి సంఘటన యథార్థమా అన్నట్టు ఎలారాయగలరు.

■ రవిగాంచనిచో కవిగాంచును అన్నారందుకే! రచనలలోని పాత్రల మనసులలోనికి చొచ్చుకొని పోయి తద్వారా తనకు కలిగే అనుభూతులను రచనలో వ్యక్తీకరించినప్పుడు సహజత్వం ప్రతిబింబిస్తుంది.

వాస్తవ నైజం చిత్రీకరణ వలన పాఠకుల మనసు రంజింప జేయివచ్చు.

మనుష్యులను మనసులను సరిగా అర్థం చేసుకోగల వాడే ఉత్తమ రచయిత. □

---

శిలువలున్నయ్!" అని అరిచాడు గార్డు పెన్స్‌దగ్గర వుండి.

క్షణాలలో రౌడీలు విచ్చలవిడిగా ప్రవర్తించి యుద్ధం చేయటంతో మతిపోయిందతనికి. కాని అతనికి అంతలో కొండ చిలువలు ఆహారం మేసి మత్తుగా వేప చెట్టు మొదట్లో పడుకుని వున్నవని గుర్తొచ్చింది.

దీప్ వేపచెట్టు వెనక్కు వెళ్తుండడం చూసిన కోటి కసితో చేతుల్లో వున్న పిడి బాకులను అతని మీదకు విసిరాడు.

బాకులు చెట్టును చుట్టుకున్న కొండ చిలువ పొట్టలో దిగబడి నిద్రిస్తున్న దాన్ని లేపాయి! నిద్రమత్తు పోయి కోపంతో బుస బుస మంటూ శబ్దం చేస్తూ వేప చెట్టు చుట్టూ వున్న మహాకాయాన్ని గట్టిగా విదిల్చింది. కొండచిలువ శరీరంలో దిగబడ్డ గత్తులు గుచ్చుకుని కలుక్కుమని కొండ చిలువ బాధతో గిలగిల లాడి నోరు పెద్దగా తెరిచి గాలి విడుస్తూ భయంకరంగా శబ్దం చేయసాగింది.

దీప్ చెట్టు చాటున వున్నాడు. అతన్ని సఫా చేస్తే నాగరాజు కోరిన బహుమతి యిస్తాడు అన్న ఆశతో ముందు కురుకుతూ

రేయ్! కోటిని తప్పించుకు పోదామని చూస్తావురా అని అరిచాడు కోటి.

పైకెత్తిన అతని కుడి పాదాన్ని మృత్యుగహ్వరం లాంటి తన నోటితో మింగింది కొండ చిలువ.

కొండ చిలువ దవడల మధ్య పడిన కోటి పాదంలోని ఎముకలు పెళ పెళ విరిగి విపరీతమైన బాధతో భయంకరంగా కేకలు వేయసాగాడు కోటి. జీవితంలో అనేక మందిని నిర్దాక్షిణ్యంగా వధించి, ఎంతో మందిని చిత్రహింసలకు గురి జేసిన భయంకర రౌడీ కోటి బాధ కోర్చుకోలేక హృదయ విదారకంగా

రక్షించండి! రక్షించండి! అని అరుస్తూ కేకలు వేయసాగాడు.

పెన్స్ దగ్గర వున్న టూరిస్టులలో కొందరు పరుగెత్తుకు వెళ్ళబోయారు గాని మిగిలిన వాళ్ళు వెళ్ళకండి లోపల లెక్క లేనన్ని పాములూ, కొండ చిలువలూ వున్నాయనగానే ఆ ప్రయత్నం విరమించుకుని నిస్సహాయంగా వుండిపోయారు.

వేపచెట్టు అవతల వున్న దీప్ కోటి ఆర్తనాదాలు విని అతని దగ్గరకు రాబోయాడు గాని విలూ

దీప్! దీప్! అని ఎలుగెత్తి అరవడం వినిపించి పరిగెత్తుకుని విలూ గొంతు వినపడ్డ దిశగా వెళ్ళాడు.

కొద్ది నిముషాలలో కోటిని మొత్తం మింగిన కొండ చిలువ తన మహాకాయాన్ని వేప బోదెకు చుట్టుకుని భుక్తాయాసంతో బొగర్చసాగింది!

* * * *

విలూ!"

తన పేరు నాగరాజు కంఠం నుండి ఉచ్చరించబడుతుండడం వినపడింది.

## ధర్మపథం

# పరిశుభ్రత



"ఇల్లు చూచి యిల్లాలిని చూడవచ్చు' నవే లోకోక్తి ఉన్నది ఇంటిని చూస్తేనే యిల్లాలి సంగతి తెలిసిపోతుందని దాని అర్థం గృహిణి పరిశుభ్రతను పాటిస్తూ ప్రశాంత స్వభావం, నిర్మలమైన హృదయం కలిగి ఉన్నప్పుడు, ఆమె యింటిని చక్కగా ఉంచుకుంటుంది ఆలాటి యింట్లో లక్ష్మీదేవి తాండవమాడుతూ ఉంటుంది ఆలాటి యిళ్ళు చూడ ముచ్చటగా ఉంటాయి ఇతర గృహిణులకు ఆదర్శప్రాయంగా కూడా ఉంటుంది

గృహ యజమానురాలు దానికి విరుద్ధంగా ఉంటే, అది దరిద్ర దేవతకు నిలయమై ఉంటుందని అంటారు

దేవాలయం కూడా గృహం వంటిదే! అది విగ్రహ రూపంలో ఉన్న భగవంతునికి నివాస గృహం ఆ దేవాలయం, దాని పరిసర ప్రదేశాలు ఎంతో పరిశుభ్రంగా ఉండాలి భక్తులు పరిశుభ్రంగా స్నానం చేసి, మడుగు వస్త్రాలు ధరించి, పూజా ద్రవ్యాలు పట్టుకొని భగవద్దర్శనానికి దేవాలయానికి వెళ్తారు గుడి, దాని పరిసరాలు పరిశుభ్రంగా లేకపోతే వారికి అసంతృప్తి కలుగుతుంది గర్భగుడికి చుట్టూ అయినా శుభ్రంగా ఉండాలి గర్భగుడికి ప్రదక్షిణం చెయ్యడంతో, ఆ పరిశుభ్రతా పర్యవేక్షణ కూడా ఒక భాగమే అని అనుకున్నా అనుకోవచ్చు. అక్కడి వాతావరణం కలుషితం కాకుండా ఉండడానికి దేవునికి సమర్పించే కర్పూర హారతి ఎంతో సహకరిస్తుంది.

సరియైన భక్తి కలవారు భగవద్దర్శనానికి దేవాలయానికి వెళ్లలేకపోయినా, వారికి కొరత అనిపించదు

పరిశుద్ధమైన హృదయమే అతనికి దేవాలయం అందులో స్థిరంగా నిలిపి ఉంచిన భగవత్ స్వరూపమే భక్తునికి ఆరాధ్యమైనది పూజకు వేరే పుష్పాలు అవసరం లేదు సర్వ సమానభావం, సర్వభూతహిత చింత, శాంతం మొదలైన ఉత్తమ గుణాలే పుష్పాలు మామూలు పుష్పాలు వాడిపోతాయి కాని, వీటికి వాడిపోవడం ఉండదు

శరీర పరిశుభ్రత, దుస్తుల పరిశుభ్రత ఉన్నంత మాత్రాన ప్రయోజనం ఉండదు మనస్సు పరిశుభ్రంగా ఉండాలి అప్పుడే ఆధ్యాత్మిక చింతకు అవకాశం ఉంటుంది గట్టిగా భగవత్ స్తోత్రాలు పఠిస్తూ ఉన్నా మనస్సు దాని పయి లగ్నం కాకపోతే మిగిలేది కంఠశోష మాత్రమే!

మనస్సు పరిశుద్ధంగా లేనప్పుడు చెడు ఆలోచనలు కలుగుతూ ఉంటాయి పరిశుద్ధమైన మనస్సులో ఉదారమైన ఆశయాలు చోటు చేసుకుంటాయి వాటి వల్ల తనకు మేలు కలుగుతుంది ఇతరులకు మేలు చేయాలన్న అభిప్రాయమూ కలుగుతుంది

—బులుసు వేంకటరమణయ్య

## ప్రేమసాగర మథనం

స్పృహ వచ్చిన విలాసినికి

పళ్ళంతా గగుర్పొడిచి భయ విహ్వల అయిందామె

రావే బంగారు 'విలూ' మేనమామ కొడుకు దొరికాడు గదా అని పాత నేస్తాన్ని వదిలేస్తే ఎలానే? అంటూన్న నాగరాజు మాటలు వింటూనే లేచి కూర్చుంది ఆమె

రా విలూ! అంటూ చేయి పుచ్చుకోబోతున్న నాగరాజు చెంప మీద యీడ్చి లెంపకాయ వేసింది విలూ!

తత్తరపాటుతో క్షణం పాటు నిశ్చేష్టుడయిన నాగరాజును తప్పుకుని ముందుకు పరిగెత్తింది విలూ విపరీతమైన భయంతో వణికి పోతూ దీప్! దీప్ అని ఎలుగెత్తి అరిచిందామె

ఎటు పోతున్నదీ దిక్కు తెలియకుండా పరిగెడుతూ త్రాచు పాములను వుంచిన ఎన్‌క్లోషర్ లోపలకు వెళ్ళిపోయింది

భయవిహ్వల అయిన విలూకు బుస పెడుతున్న కోడె త్రాచులు బుస్ మని చేస్తున్న శబ్దం వినపడలేదు

విలాసినిని వెంటాడుతూ వచ్చిన కామాతురుడు నాగరాజుకి ఆ శబ్దం వినపడలేదు

నాగో దౌన్ రహస్యం సన్నీగాడికి చెప్పి ఎనిమిది లక్షలు తీసుకుని బ్యాంక్‌లో వేసుకుని ఢిల్లీ నుండి మేనమామ కొడుకు రాంగానే వాడితో కలసి సిగ్గు లేకుండా యిక్కడకు పారిపోయి వస్తావా!

నిన్ను ఏం చేస్తానో చూడు! అంటూ ముందుకు వస్తున్న నాగరాజు భీకర రూపం చూచి మరలా దీప్! అంటూ అరిచింది విలాసిని

పకపక నవ్వుతూ రెండు చేతులతో విలాసినిని తన కౌగిట్లో బంధించిన నాగరాజు ముఖం క్షణంలో నల్లబడిపోయింది విలూ చుట్టూ వున్న అతని చేతులు శక్తిహీనములైపోయి కౌగిలి పట్టు సడలింది నాగరాజును పక్కకు నెట్టి పరిగెత్తుకుని బయటకు వచ్చింది విలూ!

తన ఆవరణలోకి వచ్చాడన్న కసి కొద్దీ నాగరాజును కాటేసిన నల్ల త్రాచు మూలకు వెళ్ళి ముడుచుకు పడుకుంది!

(ఇంకా ఉంది)

# తొలగిన మేఘం

## కె.వి.యస్.యస్.మూర్తి.

ఉదయం పది గంటలవుతోంది

నరసావధానిగారి యింటి ముందు గుర్రపు బండి ఆగింది బండిలోంచి కామశాస్త్రిగారూ, ఆయన భార్యా అప్సరసమ్మా క్రిందకు దిగారు రెండు నిముషాల తరువాత శాస్త్రిగారి కుమారుడు అబ్బున్నా దిగాడు

వారిని లోపలకు ఆహ్వానించటానికి నరసావదానిగారు బయటకు వచ్చారు

అంతలో చేలో పనేరిస్తున్నాను ఆలస్యం అయింది అంటూ ఆ గ్రామ మాజీ కరణమూ, అవదానిగారి ప్రాణమిత్రుడూ సుబ్బయ్యగారు వురకలు పరుగులమీద అక్కడకు వచ్చాడు

పరిచయాలయినాయి

పెళ్లివారిని హాలు మధ్య కూర్చోపెట్టి కాఫీ ఫలహారాలు అందించారు

మరో పది నిముషాలలో అవదానిగారి ఆఖరి అమ్మాయి గాయత్రిని అలంకరించి తీసుకువచ్చారు

పిల్ల నచ్చింది తర్వాత కట్నకానుకలూ, లాంఛనాలూ యిచ్చిపుచ్చుకోవడాలూ అన్నీ సుబ్బయ్యగారి మధ్యవర్తిత్వంలో జరిగిపోయాయి

ముహూర్తం చూసి కబురు చెయ్యండి అంటూ పైకి లేచాడు కామశాస్త్రి

అలానే బావగారూ అంటూ సంతోషంతో తలాడించారు అవదాని

కామశాస్త్రి బయటకు నడవబోయాడు

అంతలో అవదానిగార్కి ఏదో అనుమానం వచ్చింది అయ్యా క్షమించాలి తమ గోత్రం అహ మీరు చూసుకునే వచ్చారనుకుంటాను పురోహితులు చెప్పలేదు అన్నాడు

కాశ్యపస

అవదానిగార్కి ఒక్క క్షణం గుండె కొట్టుకోవటం ఆగిపోయింది అయ్యో! యిలా జరిగిందేమిటి? మనం సగోత్రీయులం అన్నాడు

ఆ! దాందేముందండీ! కన్నె దార మరెవరి చేతయినా పోయించండి అన్నాడు శాస్త్రి

అన్నన్న! ఎంత మాట! ముక్కుమీద వేలేసుకున్నాడు అవదానిగారు అయ్యా! తమకు తెలియనిదేముంది? మన హిందూ దర్మశాస్త్ర ప్రకారం, సగోత్ర, సప్రవర వివాహాలు నిషిద్ధం దీన్ని మను స్మృతీ, యజ్ఞవల్క్య స్మృతులూ కూడ వివరించాయి దీనికిగాను చంద్రాయణ ప్రాయశ్చిత్తం- అదే పెళ్లంటూ జరిగితే- తర్వాత అబ్బాయి అమ్మాయిని చెల్లిగానో అమ్మగానో భావించాలి బ్రాహ్మలమయి వుండి మనమే స్మృతులను గౌరవించకపోతే ఎలా చెప్పండి అన్నాడు

అవునవును మీరు చెప్పిందీ సబబే! అంటూ కామశాస్త్రి తనవాళ్లను తీసుకుని బయటకు వెళ్లిపోయాడు

వాళ్ళు అలా వెళ్లారో లేదో సుబ్బయ్యగారు విశ్వరూపం దరించారు అవధానిగారి మీద విరుచుకపడ్డారు ఒరేయ్ నరసూ! దానికి పెళ్లి చెయ్యటం యిష్టం లేకపోతే పీక నులిమి బయట పడెయ్యి అంతేగాని దానిచేత మానసిక వ్యబిచారం



చేయించకు ఎందుకురా నీకింత చాదస్తం? ఇప్పటికి యిరవై సంబంధాలు చెడగొట్టావు గోత్రం అంటావు ప్రవర అంటావు శాఖ అంటావు లేకపోతే అబ్బాయి వేలు విడిచిన మేనత్త ఎవరితోనో లేచిపోయింది అంటావు పోనీ డబ్బు దండిగా ఖర్చు పెట్టగలవా అంటే అదీ లేదు మా పుండరీకానికి ఏం తక్కువ చెప్పు. శుభ్రంగా కాలేజీ లెక్చరర్ నీకల్లుడు కావటానికి వాడికి అభ్యంతరం లేదు అన్నాడు

ఒరేయ్ మీరు నియోగులు, మేము వెలనాట్లం మళ్ళీ మాట్లాడితే నాలక కోసేస్తాను ఒంటి కాలిమీద లేచిపోయాడు అవదానిగారు.

ఒరేయ్ కులాలే పోతున్న ఈ రోజుల్లో యింకా శాఖలేమిట్రా? మనం మారాలిరా శాఖ మార్పిడితో చిన్న ప్రయోగం చేయాలి నీలాంటి తక్షకులున్నంత కాలం నాకుగా నేను కుల మార్పిడి చెయ్యలేను ఎవరయినా చేస్తానంటే మాత్రం వెన్నుతట్టి ప్రోత్సహిస్తాను అన్నాడు సుబ్బయ్య

ఇలాంటి అప్రాచ్యాలు చేయబట్టే బ్రాహ్మల గతి యిలా పట్టింది అవదానిగారి మొహంలో చీత్కారం

ఎందుకురా వెధవ భేషజం నీకన్నా మన యానాది రంగయ్య ఎంతో మేలు అసలు కులం ఎక్కడ నుండి వచ్చిందిరా? వృత్తి నుండి నీ వృత్తేమిటి? పౌరోహిత్యం అది నీకు అవసరంలేదు కులం మాత్రం కావాలి మీ తాత యిచ్చిన వందెకరాలను యిలాంటి వెదవ భేషజాలకు పోయి తగలేసి ఓ యిరవై నీ చేతికిచ్చాడు మీ నాన్న నువ్వు దాన్ని రెండు చేసుకు కూర్చున్నావు చదువుతాను మొర్రో అంటోన్నా వినకుండా నీ కొడుకు వెంకన్నను యింట్లో కూర్చో పెట్టుకున్నావు వాడు ప్రయోజకుడు కాబట్టి పంచాయితీ ఆపీసులో గుమాస్తా గిరీ సంపాదించాడు ఒరేయ్ తినేసి కూర్చుంటే కొండలయినా ఆగవు అంటూ విసవిసా బయటకు వెళ్ళిపోయాడు సుబ్బయ్య

సుబ్బయ్యగారి మాటలు అవదానిగారి మీద బాగానే పనిచేశాయి

సోమయారాజుగారి బియ్యపు మిల్లులో చిన్న పని సంపాదించాడు అవదానిగారు తాను సంపాదించానన్న సంతోషంతో తలమునకలయి

## తొలగిన మేఘం

పోయిందతనికి ఆయన ప్రవర్తనలో కూడా చాలా మార్పు వచ్చింది ఆయనలో యిదివరకటి హుషారు లేదు ఉదయాన్నే లేవటం, సంధ్య వార్చటం మిల్లుకు వెళ్ళటం మధ్యాహ్నం బోజనం – రాత్రి బాగవత పఠనం మనిషి ప్రయోజకుడయ్యాడులే! అని మొదట్లో సంతోషించినా ప్రయోజకుడయితే మనిషిలో హుషారు పెరగాలి గానీ, వీడేమిటి యిలా అయిపోతున్నాడు? అని బాధపడి అవదానిగార్ని డాక్టరుకు చూపించాడు సుబ్బయ్యగారు

రోగం ఏమీ లేదని బలానికి మందులు రాసిచ్చాడు డాక్టర్

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది ఎండలు మండిపోతున్నాయి

అవదానిగారు మిల్లులో పనికట్టిపెట్టి బోజనానికి యింటికి బయలుదేరారు వంటి గంట దాటితేగాని బోజనానికి బయలుదేరని అవదానిగారు ఆ రోజు గంట ముందుగా పనిలోంచి లేచారు ఈ మధ్య కాలంలో ఆయన నియమం తప్పటం అది మొదటిసారి కానీ అదే ఆయన కళ్ళు తెరిపించింది అజ్ఞాన తిమిరంలోంచి అవదానిగార్ని బయట పడేసింది

అలసటగా యిల్లు చేరుకున్న అవదానిగార్కి గొడ్ల సావడి దగ్గర నుండి చిన్నగా మాటలు వినిపించాయి ఎవరయినా వింటేగాని వినపడనంత మంద్రస్థాయిలో జరుగుతోంది వారి సంబాషణ

ఏమేవ్! అని తన సహజ దోరణిలో అరవబోయి చావడిలో జరుగుతోన్న సంబాషణను వినగోరి నూతి గట్టు ప్రక్కకు తప్పుకున్నారు అవదానిగారు

ఈసారి కూడా సంబందం చెడిపోయిందిటగా? అది కిట్టిగాడి గొంతు అతడు యానాది రంగయ్య కొడుకు ఐ ఏ ఎస్ పాసయ్యాడు

వారు సగోత్రీయులు నాన్న ఒప్పుకోలేదు గాయత్రి సమాదానం

అవదానిగారు కొంచెం ముందుకు జరిగి కూర్చున్నారు ఈసారి మాటలు స్పష్టంగా వినవచ్చాయి

ఇలా ఎన్ని సంబందాలు వదులుకుంటారు?

ఏదో నాగదోషం వుందట మామయ్య చెప్పాడు

ఎవరు?? ఆ పుల్లేటి కుర్రు పంతులా? సరేలే! నాకు ఎవరితోనో ఎవరికో సమాంతర స్థితి రావాలన్నాడు అది వచ్చేదాకా ఏ వుద్యోగం రాదన్నాడు అలా చెప్పిన మూడో రోజే ఐ ఏ ఎస్ లో సెలెక్టయినట్టు యింటిమేషన్ వచ్చింది

అవునూ! మరి నువ్వు ట్రయినింగ్‌కు ఎప్పుడు వెళతావ్? మాట మార్చింది గాయత్రి

ఈవాళే వెళుతున్నాను మాట మార్చటానికి ప్రయత్నించకు నిన్ను నేను ఒకటి సూటిగా అడుగుతాను నువ్వూ సూటిగానే సమాదానం చెప్పాలి కోప్పడకూడదు

అడుగు

పుండరీకం అదే కరణం సుబ్బయ్యగారి అబ్బాయి మీద నీ అభిప్రాయం ఏమిటి?

గాయత్రి మౌనం వహించింది

మీ పెళ్ళికి అటు వయిపు నుండి అంతా ఓ కె ఇటు మీ నాన్నగారే ఆటంకాలు చెపుతోన్నారు అలాంటిది పుండరీకం ధైర్యంచేసి నిన్ను పెళ్ళి చేసుకోవచ్చుగా?

అంటే? మామయ్యని నువ్వు అంత తక్కువగా అంచనా వేసేవన్న మాట ఆయన తలచుకుంటే ఏమయినా చెయ్యగలరు కానీ నాన్న మనసు నొప్పించటం ఆయనకు యిష్టంలేదు

అలా అనకు మీ నాన్నగార్ని ఎదిరించే ధైర్యం నాకు లేదు ఇలానే కూర్చుంటే, పెళ్ళీ పెటాకులూ లేకుండా నువ్వు ముసలిదానివై కూర్చుంటావే అందుకు నువ్వో పని చెయ్యి నాకు ఏం తక్కువ చెప్పు నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను మనని ఎవ్వరూ ఏమీ అనరు

లేపుకుపోతానంటావ్ నువ్వు యింత కుసంస్కారివి అనుకోలేదు క్రిష్ణా నాకు కులం పట్టింపులేదు నిన్ను భర్తగా భరించటం నాకు సంతోషమే నాన్నగారిమాట కాదన్టం నాకు యిష్టం వుండదు ఆయన నిప్పుల్లో దూకమన్నా దూకటానికి సిద్ధమే అంతేకాని ఆయన మనసు నొప్పించే పనిని దేనినీ నేను చెయ్యలేను అయినా [illegible]నాల్సినంత అవసరంగాని వంటి కొవ్వుగాని నాకు లేదు దయ వుంచి అటువంటి ప్రస్తావన నా దగ్గర తేకు నా స్నేహితుడిగా నీకు ఎప్పుడూ గౌరవం వుంటుంది

# మన పూర్వీకులు ఏం తినేవాళ్ళు?



మన పూర్వీకుల ఆహారపుటలవాట్లు ఎలా ఉండేవి? ఆయా కాలాలలో పాలించిన రాజ వంశాల గురించి, జరిగిన యుద్ధాల గురించి, విలసిల్లిన సంస్కృతి గురించి, సాగిన సామాజిక జీవనం గురించి తెలిసినంతగా మనకు ఆయా కాలాల ప్రజల ఆహారపుటలవాట్ల గురించి తెలియదు మధ్య యుంగాలకూ, ఆదునిక కాలానికీ ప్రజల అన్నపానాదులలో వచ్చిన తేడాల గురించి చర్చించేందుకు ఈ మధ్య పశ్చిమ జర్మనీలోని గీసెన్ విశ్వవిద్యాలయంలో ఒక గోష్ఠి జరిగింది దానిలో ఏడు విశ్వవిద్యాలయాలకు చెందిన పన్నెండు శాస్త్ర విబాగాలకు చెందినటువంటి మేధావులు పాల్గొన్నారు వీరిలో జర్మన్ అధ్యయనాల నిపుణులు, చరిత్రకారులు, ఆహార శాస్త్రవేత్తలు, వైద్యులు, రసాయన శాస్త్రవేత్తలు ఉన్నారు గీసెన్ విశ్వవిద్యాలయంలో జర్మన్ అద్యయనాల నిపుణురాలు ప్రొఫెసర్ క్రీనియా నాన్ ఎర్ట్జ్ డార్ఫ్ – కుఫెర్, బాన్‌లో జర్మన్ అధ్యయనాల లెక్చరర్ ట్రూడ్ ఎహ్లెర్ట్‌లు గీసెన్ విశ్వవిద్యాలయంలోని ఆహార శాస్త్ర శాఖకు చెందినటువంటి ఇర్మ్‌గార్డ్ బిట్స్‌ుతో కలిసి ఈ గోష్ఠి నిర్వహించారు

ఆయా కాలాలలో ప్రజలు ఏ ఆహారాన్ని తీసుకున్నారనేది కేవలం ఆ కాలపు బౌతిక పరిస్థితి పైననే ఆదారపడి లేదు ఆహారపుటలవాట్లు రూపొందడంలో మత, నైతిక, ఆహార శాస్త్ర పరమైన నిబందనలెన్నో ప్రభావం చూపిస్తాయి అని కుఫెర్ అన్నారు

ఈ గోష్ఠిలో శాంతి కాలాలలో మిత్రులతో జరిపిన ఉత్సవాల ఆహారం నుంచి అత్యవసరమైన స్థితిలో ఎలుకలను, చిట్టెలుకలను తినే దాకా ఉన్న అన్నిరకాల అలవాట్లను చర్చించారు మధ్య యుగాలలో జీర్ణవ్యవస్థకు పునాదిగా ఉన్నటువంటి మానసిక, శారరక లక్షణాలు, 'ప్రాచీన అరబ్బులలో ఆహారపుటలవాట్లు' వంటి అంశాలు కూడా ఇక్కడ చర్చకు వచ్చాయి

మన పూర్వీకులు ఏమి తినేవారో మనం కచ్చితంగా కనిపెట్ట లేకపోయినప్పటికీ వాళ్ళు చాలా ఎక్కువగా తినే వాళ్ళని మాత్రం చెప్పవచ్చునని నిపుణులు అభిప్రాయపడ్డారు ఉన్నత వర్గాల వారు మాంసాహారం, చేపలు, వేట మాంసం ఎక్కువగా తినేవారు వాటిలో మసాలా దినుసులు చాలా ఎక్కువగా వాడేవారు మసాలా దినుసుల ఖరీదు ఎక్కువగా ఉండేది తూర్పుదేశాల నుంచి దిగుమతి చేసుకోవలసినటువంటి ఈ దినుసులు ప్రతిష్ఠకు చిహ్నంగా ఉండేవి

సాధారణ ప్రజానీకం కాయదాన్యాలు, పప్పులు, దుంపలు, తమ స్వంత పశుగణం నుంచి కొంచెం మాంసాహారం తీసుకునే వాళ్ళు ఆ కాలంలో స్పూన్లు, ఫోర్కులు ఉండేవి కావు అందరూ చేతులతోనే తినే వాళ్ళు. కేవలం అతిథుల కోసం మాంసాన్ని ప్రత్యేకంగా ముక్కలు కోసి పెట్టడానికి సేవకులుండే వాళ్ళు ఉన్నత వర్గాలలో మాత్రమే విందులుండేవి

ఈ అన్ని విషయాల మీద సైద్ధాంతిక చర్చలతో మాత్రమే ఆగిపోకుండా ఈ నిపుణులందరూ కూడా ఒక పూట ప్రత్యేకంగా మద్యయుగాల ఆహారం వండించుకుని తిన్నారు ఈ గోష్ఠిలో ఉపన్యాసాలు, మధ్యయుగాల ఆహారం తయారు చేసే పద్ధతులతో ప్రొఫెసర్ ట్రూడ్ ఎహ్లెర్ట్ ఒక పుస్తకం ప్రచురించ నున్నారు □

---

మొదట సౌమ్యంగా మొదలయిన గాయత్రి ఉపన్యాసం చివరకు కటువుగా మారిపోయింది

నన్ను క్షమించు గాయత్రీ అంటూ బయటకు వెళ్ళిపోయాడు క్రిష్ణ

రెండు నిముషాలు అక్కడే నిలబడి లోపలకు వెళ్ళింది గాయత్రి

అవధానిగారి మనసంతా పాడయిపోయింది నిస్త్రాణగా తను కూర్చున్న చోటే చతికిలబడి పోయాడు అతడి గుండెలకు గాయత్రి మాటలు శూలాల్లా తగిలాయి.

అలా ఎంతసేపు కూర్చున్నాడో అవధానిగారికే తెలియదు

గాయత్రిలో వైరాగ్యం చోటు చేసుకుంటోందని గ్రహించిన అతడి మనసు విలవిల్లాడిపోయింది

నెమ్మదిగా లేచి లోపలకు వెళ్ళాడు

బోజనం అయిదనిపించి, రెండు నిముషాలు నడుం వాల్చాడు తరువాత బట్టలు వేసుకుని సుబ్బయ్యగారింటికి బయలుదేరారు

సుబ్బయ్యగారు అటక మీది నుండి పుగాకు కట్టను దింపిస్తున్నారు ఆయన అవధానిగారిని చూసి రారా! రా! బహుకాల దర్శనం అంటూ హాల్లో వున్న ఉయ్యాల బల్ల దగ్గరకు దారితీశాడు

నరసావధానిగారు మంత్రం వేసినట్లు అతడిని అనుసరించారు

మిత్రుడి పక్కనే బల్లమీద కూర్చుని "ఒరేయ్ నరసూ! ఏమిట్రా, యిలా చిక్కిపోయావు?" అన్నాడు

అవదానిగారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి

ఆ నీటిని చూసి కరణంగారు చలించిపోయారు

చ! ఛ! ఏమిట్రా యిది? మేరు పర్వతంలాంటి మనిషివి భీరువై మంచులా కరిగిపోతావా? నేను లేనూ ఛ వూరుకో! నీకు ఏం కష్టం వచ్చిందో చెప్పరా అన్నాడు

మిత్రుని ఓదార్పుతో నర్సావధానిగారు చిన్న పిల్లాడిలా బోరుమన్నారు రెండు నిముషాలు పోయాక తేరుకున్నారు

అప్పటివరకూ తలుపు చాటున నిలబడ్డ సుబ్బయ్యగారి బార్య బావున్నారా అన్నయ్యగారూ" అంటూ వెండి మరచెంబుతో అక్కడకు వచ్చింది

బావున్నానమ్మా!" అంటూ అవధానిగారు చెంబందుకున్నారు మండువా దగ్గరకు వెళ్ళారు కొన్ని నీళ్ళతో మొహం కడుక్కుని, పుక్కిలించి వుమ్మారు మిగతా నీళ్ళను గడగడా తాగేశారు పై తుండుతో మొహం తుడుచుకుంటూ మళ్ళీ బల్ల దగ్గరకు వచ్చారు సుబ్బయ్యగారి పక్కన కూర్చున్నారు.

ఇప్పుడు చెప్పు! అన్నారు సుబ్బయ్యగారు

"ఒరేయ్! గాయత్రికి పెళ్ళి చేసేద్దామను కుంటున్నాను యింతకాలం ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను అన్నారు

"పోనీలే దాని అదృష్టం బాగుంది"

'వచ్చే మాఘ శుద్ధ దశమి మంచి ది'

శుభస్య శీఘ్రం! నువ్వు డబ్బుకు తడుముకోకు అసలు నువ్వు కుర్చీ మీద కూర్చో నేనూ, వెంకన్నా మిగతా పనులు చూసుకుంటాం అన్నాడు సుబ్బయ్య

అవధానిగారు మిత్రుడిని ఆప్యాయంగా చూశారు

ఇంతకీ ఆ అదృష్టవంతుడు ఎవర్రా? అడిగారు సుబ్బయ్యగారు

అవధానిగారు అతడి మాటకు సమాధానం చెప్పకుండా 'మాఘంలో మన పుండరీకానికి శెలవు దొరుకుతుందా? అన్నారు

'దీని పెళ్ళయితే మధ్యన వాడికి సెలవెందుకురా? అన్నారు సుబ్బయ్యగారు ఆయనకు చూచాయగా అర్ధమయిందిగానీ సరదాగా మిత్రుడి ఆట పట్టించాలనుకున్నాడు

'చాల్లే వెధవ బెట్లు నువ్వూను అయినా ఆమాత్రం బెట్టుండాల్లే ఎంతయినా మగపిల్ల వాడివి గదా! తప్పులేదు కాబట్టి అడుగుతున్నాను పుండరీకానికి కాళ్ళు కడిగి మా గాయత్రిని వాడికిచ్చి చేస్తాన్రా!" అన్నారు అవధానిగారు

సుబ్బయ్యగారు మిత్రుడిని ఆప్యాయంగా కౌగలించుకున్నారు

గీతాచార్యులు చెప్పినట్లు నాలో వున్న అజ్ఞానం అంతా జ్ఞానమనే ఆయుధంచే ఖండించబడింది – అనుకుంటూ హాయిగా వూపిరి పీల్చారు నరసావధానిగారు

సరిగ్గా అప్పుడే సూర్యుడికి అడ్డంగా వున్న నల్లటి మేఘం ఒకటి ప్రక్కకు తప్పుకుంది సూర్యకాంతి పడి అవధానిగారి మొహం స్ఫటికంలా మెరిసిపోయింది □



# దూరదర్శనం

లత

## బాల రామాయణం

విశ్వామిత్రుడితో వెళ్ళి అహల్యా శాపవిమోచనం చేశారు. అనంతరం సీత హైద్రబాద్‌లో వీధి వీధికీ ఉండే పోచమ్మ గుడిలో పూజ చేసి వస్తూ రాముడిని చూసి కొంచెం వెకిలిగా నవ్వి స్వయంవర మంటపంలో శివధనుస్సు ఎత్తలేని వాళ్ళని చూసి మరి కొంచెం వెకిలిగా నవ్వింది పాపం. అనంతరం కైకకి మంథర దుర్బోధ– మంథరకి ఇందులో కైకతో సమానంగా మేకప్ చేశారు. రాముడికి మంథర నార చీరలు ఇస్తుంది. ఇదో కొత్త కథ. ఏ మాత్రం బాగులేదు ఈ రచన. రామాయణాన్ని విమర్శించ లేని రామభక్తురాల్ని నేను. కాని ఈ బాల రామాయణం బహు ఘోరంగా రసాభాసం అయింది. ఏమిటో ఆంధ్రుల కర్మ – అటు హిందీ రామాయణం అంత గొప్పగా వస్తున్నప్పుడే ఇది ప్రసారం చేయాలా? దాన్నీ దీన్నీ పోల్చక తప్పదుమరి.

## చహరే

సీరియల్‌లో మత్స్య కన్య జగదీశ్ చేలర్ కథ ఆధారంగా నాటిక. సరోజహసన్ ఇంట్లో ఉందని ఊరిపె... పంచాయితీ చేస్తారు. ఆమె మొదటి భర్త ...వాడు. పంచాయితీలో నోటమాట రాదు. స...జ ఆకోపంతో భర్తతో పోట్లాడ పంచాయితీని అసహ్యించు కొంటుంది. అది అట్లా ఉంచి పల్లె వాళ్ళకి మత్స్య కన్య వచ్చింది తమ తీరప్రాంతానికి అనే పుకారు వచ్చింది. కొందరు 'చూశారు కూడా' – ఆ ఉత్సవ సంతోషంలో భర్తని చూడటానికి వెళ్ళిన సరోజ సముద్రంలోపడి మరణిస్తుంది. ఇదీ మత్స్య కన్య అయిన సరోజ పంచాయితీ కథ– మలయాళంలో ఈ కథామూలం ఉందని అనుకుంటాను. రచయిత పేరు పైన వ్రాసినది కాక పోవచ్చును. టైటిల్సు చదవడం చాలా కష్టం అని మనవి చేశాను. పల్లె వాళ్ళ కథలు ప్రతి భాషలోనూ ఉన్నాయి కథ బాగుంది.

## స్వరరాగసుధ

రెండు వారాలుగా రాని ఈ సుధ ప్రేక్షకుల్ని చాలా నిరుత్సాహ పరిచింది. తిరిగి ఇది రావటం ముదావహం. శ్రీ బాలమురళి కంఠం ఆంధ్రులకు పెరట పెరిగిన తంగేటి జున్ను – ఆయన గానం ఆగిందంటే విచారమేమరి – ఈ నాడు తోడి రాగం – రాగ లక్షణాల్ని వివరించారు మురళిగారు. ఆయన తోడిరాగం పాడటంలో ప్రసిద్ధులు. భక్తికీ ప్రేమకీ ఇది చక్కగా సరిపోతుంది – తరువాత వచ్చిన పాట బాలసుబ్రహ్మణ్యం పాడిన పాట. బాలూ గొంతుక మురళి గారి గొంతులానే ఉంటుంది. తరువాత ఘంటసాల పాడిన పాట హాయిమనిపించింది.

## అమృత

మఖన్‌లాల్ చతుర్వేది – హిందీలో కవి. స్వరాజ్యం కోసం శ్రమించిన వీరుడు గొప్ప దేశభక్తుడు – అతని రచనల్లో రసం చిప్పిలుతుందని హిందీ సాహిత్య చరిత్ర (తెలుగు) మనకు చెపుతున్నది కావచ్చును – ఈ కార్యక్రమం సంగీత సాహిత్యాలు సరస్వతీక్షీరాలు అని మనకు చెపుతున్నది. సమర్పణ ఆశాభోన్స్లే అయితే నాకొక సందేహం ఇది ఒక హిందీకే పరిమితమా? గుర్తింపబడిన మిగతా భాషల్లో కూడా మహాకవులు ఉన్నారు. వారి సంగతేమిటి? అమృత సుధ అన్ని భాషలలోనూ ఉంది. సుప్రసిద్ధ టి. వి. విమర్శకురాలు అమితా మాలిక్ ఈ విషయాన్ని ఇంకా ఆలోచించినట్లు లేదు. మిగతా ప్రాంతీయ టి. వి. లు మేలుకొని దేశభాషల సౌందర్యం హిందీకి తీసిపోదని చెప్పాలి. జీతాలు ఒస్తున్నాయనుకుంటే చాలదు. ఒక్క తెలుగులోనే ఎంతో మంది మహాకవులు ఉన్నారు – వాళ్ళని మనం చూపించ లేకపోతే అగౌరవం. ప్రిస్టేజి ఇష్యూ ఇది. హైద్రాబాద్ దిక్కుమాలిన డాన్సులు తీసేసి సంగీతకారుల సహాయంతో సాహిత్యాన్ని ఆవిష్కరించాలి. అమృతలో ఇంత వరకూ ఆ కవులు రచించిన గీతాలు ఏభై ఏళ్ళ కిందటివి. అయినా నేటి బొంబాయి వీధుల్లో కనపడే అరాచక యువతీయువకుల్ని అటూ ఇటూ తిప్పి మహాకవుల గీతాలకి వీళ్ళే వ్యాఖ్యానం అనటం ఎబ్బెట్టుగా ఉంది. కవి హృదయంలో ఈ బాబ్డ్ హెయిర్సూ జీన్ పాంట్సూ ఉండి ఉండవు – అప్పటికి లేవు కనక. ఆశాభోన్స్లే ఈ మోడల్ పిల్లలే కవి యొక్క కావ్య నాయికా నాయకులనటం అనౌచిత్యం పోనీ వాళ్ళకే వేషం మార్చచ్చును. తెలుగు టి. వి. ఈ పొరపాటు చేయకుండా తీస్తుందని ఆశిద్దాం.

శుక్రవారం

## వెన్నెల వేట

కిరాతరావ్ అనే డిటెక్టిక్ పాత్ర ప్రవేశించింది – వాళ్ళు జమీందారు జీవిత చరిత్రలో అందర్నీ గురించి వ్రాస్తున్నాడు అని ఎవరో ఒకతను చెప్పి అది మాయం చేయమంటాడు. అతడిని పంపించి ఈ కిరాతకరావు ఆ జీవిత చరిత్ర తామే కాజేసి అందర్నీ బ్లాక్ మెయిల్ చేద్దాం అని నిర్ణయించు కుంటాడు. జర్నలిస్టులే కాక డిటెక్టివ్‌లు కూడా నిజాయితీ లేని వారంటే హాస్యం కాబోలు. ఇంత అర్థరహిత నాటకం హైద్రాబాద్ టి. వి. ప్రత్యేకత.

## జాబులు – జవాబులు

మన తెలుగు భాష జ్ఞానపీఠ అవార్డు వరకూ ఎదిగింది అన్నారు ఓలేటి పార్వతీశం గారు. ఇతర భాషలు జ్ఞానపీఠ అవార్డులు పొంద లేదా? నేను మర్చి పోయినానా? కొన్ని పరిశ్రమల మీద డాక్యుమెంటరీ తీయమని కహారావు గారు వ్రాశారు. మీ బాధ అర్థమయింది కహారావు గారూ! అలాగే చేస్తాం అని సమాధానం.

మీరు కుడి చెయ్యి కదల్చటం అసహ్యంగా ఉంది అని ఉత్తరం వస్తే– అలాగేనండి అంటూ కుడిచేయి ఆడిస్తూనే మన జవాబుల నవాబు చెప్పారు. ఏమయినా ఇది మంచి హాస్య కార్యక్రమం. కాని అలా చెప్పక తప్పదని నా స్వానుభవం. సరదాకి వ్రాస్తున్నానంతే! □



"జిందగి"లో సుప్రియా పాఠక్, షర్మిలా టాగూర్

## వి. పి. సింగ్ అవినీతి నిర్మూలన యాత్ర:

ఇందిరా కాంగ్రెస్ నుంచి బహిష్కృతుడైన కేంద్ర ప్రభుత్వ మాజీ ఆర్థిక శాఖామంత్రి శ్రీ విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ తన అవినీతి నిర్మూలన యాత్రలో భాగంగా హైదరాబాద్‌లో జులై 30 31లలో పెక్కు సభలలో ప్రసంగించారు 30వ తేదీ సాయంకాలం నిజాం కళాశాల మైదానంలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో ప్రసంగిస్తూ ఉన్నత పదవులలో జరిగే అవినీతిని నిర్మూలించడంలో తాను ప్రారంభించిన ధర్మ యుద్ధానికి ప్రజలు తోడ్పడాలని కోరారు సామాన్య మానవుడు చిన్న కరెంటు బిల్లులను చెల్లించకపోతే అదనంగా దండనకు గురి అవుతున్నాడని ఆర్థికమైన నేరాలు చేసే వారు ఎలాటి శిక్షలూ లేకుండా స్వేచ్ఛగా విలాస భోగాలు అనుభవిస్తున్నారని ఆయన అన్నారు బోఫోర్స్ ఆయుధాల సరఫరా వ్యవహారంపై కేంద్ర ప్రభుత్వం స్వీడన్ ప్రభుత్వంతో పూర్తిగా ఆడిట్ జరిపించాలి అలా ఆడిట్ జరిపిస్తే ఆ కంపెనీ కమిషన్ తీసుకొన్న వారి పేర్లు బయట పెట్టవలసి వుంటుందని స్వీడన్ విదేశాంగ మంత్రి నాతో అన్నారు దేశం విచ్ఛిన్న మవుతుందని ఇందిరా కాంగ్రెస్ లేనిపోని భయాలు సృష్టిస్తుంది ఇది ప్రజలను పెడదారి పట్టించడం బోఫోర్స్ కంపెనీ తన నుంచి కమిషన్ తీసుకొన్న వారి కొందరి పేర్లను ఆ జాబితా నుంచి తొలగించింది ఆ కంపెని తర్వాత ఆ ఆధారంతో మన దేశంపై దుష్ప్రచారం చేయవచ్చు అది దేశ విచ్ఛిన్నానికి కారణం కావచ్చు అలాటి చర్యలు దేశ విచ్ఛిత్తికర చర్యలు కావచ్చు కాని అవినీతి నిర్మూలనకు నేను చేస్తున్న ధర్మయుద్ధం విచ్ఛిన్నకరం కాదు మన దేశ పరిపాలన రాజకీయ రంగం పెద్ద శ్రీమంతుల చెప్పు చేతల్లో వుంది న్యాయశాఖ కూడ ధనవంతుల ధనబలానికి తలవంచుతున్నట్లు తోస్తుంది- అని ఆయన అన్నారు శ్రీ విశ్వనాథ్‌ప్రతాప్ సింగ్ వెంట వచ్చిన శ్రీ ఆరీఫ్ మహమ్మద్‌ఖాన్ ప్రసంగిస్తూ దేశం స్వాతంత్ర్య సమర యోధుల మహా త్యాగాలతో స్వతంత్రమైందని, ఆ స్వాతంత్ర్యం నీతి నియమాలు లేని కొందరు రాజనీతిజ్ఞుల స్వార్థపరతతో విచ్ఛిన్నమయ్యే ప్రమాదం వుందని స్వాతంత్ర్యాన్నే కాక దేశ ప్రజల ధన మాన, ప్రాణాలను రక్షించడం ప్రభుత్వ కర్తవ్యమని అన్నారు అంతకు ముందు శ్రీ సింగ్ హైకోర్టు న్యాయవాదుల సమావేశంలో ప్రసంగిస్తూ నేటికిగాని మరి కొంత కాలానికిగాని ప్రజల సంకల్పమే జయిస్తుందని అన్నారు పెద్ద పెద్ద రాజ్యాలే ప్రజల ఒత్తిడికి తలవంచుతాయని చరిత్ర చెబుతున్నది ఇప్పటి సమస్యలు జాతీయ మైనవి ఒక్క వి పి సింగే వీటిని ప్రజలకు చెప్పనక్కరలేదు ఏ దేశ భక్తుడైన పౌరుడైనా చెప్పవచ్చు ఈ విషయంలో ఎవరైనా నాతో సహకరించవచ్చు వారు నా వద్దకు వినయ విధేయతలతో రానక్కరలేదు నేనే వారి వద్దకు వెళ్తాను- అన్నారు శ్రీ సింగ్ లేక్‌వ్యూ అతిథి

# హైదరాబాదు నోట్‌బుక్

గృహంలో పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ రాజకీయ పార్టీలలో ప్రజాస్వామ్య పద్ధతులపై ఎన్నికలు జరగాలని సూచించారు దేశం ప్రస్తుతం క్లిష్ట పరిస్థితులలో వుందని ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకోవాలని అన్నారు శ్రీ సింగ్‌కు 30వ తేదీ ఉదయం విమానాశ్రయంలో హైదరాబాద్ సిటిజన్స్ కమిటీ, జనతాపార్టీ నాయకులు శ్రీయుతులు జైపాల్‌రెడ్డి, ఎ బాబులురెడ్డి, సిటిజన్స్ కమిటీ కన్వీనర్ శ్రీ కె రామచంద్రారెడ్డి ముఖ్యమంత్రి పక్షాన పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ శ్రీ రామచంద్రరావు ముఖ్యమంత్రి ప్రైవేటు సెక్రటరీ శ్రీ హేమచంద్ర ప్రసాద్ మున్నగు వారు స్వాగతమిచ్చారు వివిధ పక్షాల నాయకులు శ్రీ సింగ్‌తో లేక్‌వ్యూలో ముచ్చటించారు శ్రీ సింగ్ జులై 31వ తేదీ ఉదయం ప్రెస్‌క్లబ్‌లో హైదరాబాద్ జర్నలిస్ట్ యూనియన్ ఏర్పాటు చేసిన సమావేశంలో ప్రసంగిస్తూ పార్లమెంటుకు మధ్యంతర ఎన్నికలు జరపాలనే ప్రతిపక్షాల ప్రతిపాదనను సమర్థించారు ప్రస్తుత పరిస్థితులలో అదే పరిశుద్ధమైన పద్ధతి అని ఆయన అన్నారు శ్రీ సింగ్ పత్రికా రచయితల ప్రశ్నల వర్షానికి సమాధానమిచ్చారు మీకు కాంగ్రెస్ (ఐ) శత్రువులైన శ్రీ ఎన్ టి రామారావు శ్రీ దేవీలాల్ శ్రీమతి నందియాలకు పొత్తు ఎట్లా కుదురుతుంది అని ప్రశ్నించగా ప్రధాన సమస్యలు మా పొత్తుకు కారణమని అన్నారు ఎంతో అపకీర్తి పాలయిన శ్రీ అరుణ్‌నెహ్రూ శ్రీ వి సి శుక్లా వంటి వారు మీతో పాటు వుండడం సముచితమా అని ప్రశ్నించగా మంచి చెడ్డలకు యోగ్యతా పత్రాలు ఇవ్వడానికి నేనెవణ్ని? నేను నూటికి నూరుపాళ్ళు మంచివాడినా? సమస్యలపై ఏకాభిప్రాయం ముఖ్యమని అన్నారు శ్రీ వి పి సింగ్ ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు టాగోర్ ఆడిటోరియంలో ఏర్పాటు చేసిన సమావేశంలో ప్రసంగిస్తూ రాజకీయవాదులు విద్యార్థుల బలాన్ని దుర్వినియోగపరుస్తున్నందుకు విచారపడ్డారు యువకులే భవిష్యత్తుకు ఆశ అని, వారి బలమే తనకు విశ్వాసం చేకూర్చుతున్నదని అన్నారు ప్రస్తుత విద్యా విధానం విద్యార్థులకు మార్గదర్శకం కావడం లేదు ఖాన్ అబ్దుల్‌గఫార్‌ఖాన్ అన్నట్లు విద్య మానవుణ్ని తయారు చేయాలి అధికారానికి ధనానికి వెంపరలాడని మానవులను సృష్టించాలి నేటి యువతరం వారు నూతన ఆశకు ఎదురు చూస్తున్నారు- అన్నారు సింగ్ శ్రీ ఆరిఫ్ మహమద్‌ఖాన్ ప్రసంగిస్తూ తమ ఉద్యమానికి ప్రజలలో ఉత్సాహం అపరిమితంగా ఉన్నదని శ్రీ వి పి సింగ్ లేవెత్తించిన సమస్యలు దేశంలో పెద్ద దుమారాన్ని లేపిందని పరిపాలకులు తప్పు పనులు చేస్తున్నందున వారిపై ప్రజలకు విశ్వాసం పోయిందని భారత దేశం అంధకారమయిన సమయాలలో సరైన నాయకులను ప్రసాదించిందని వి పి సింగ్ అలాటివారిలో ఒకరని శ్రీ ఖాన్ అన్నారు ఆయన ప్రారంభించిన అవినీతి కుల తత్త్వ నిర్మూలనోద్యమం కొనసాగుతుందని ఆయన అన్నారు శ్రీ వి పి సింగ్ హైదరాబాద్ విశ్వవిద్యాలయం విద్యార్థుల సమావేశంలో ప్రసంగిస్తూ దేశంలో సాంఘికార్థిక రూపాంతర పరిణామానికై తమ శక్తులను క్రమబద్ధం చేయాలన్నారు రాజకీయ నాయకులు విద్యార్థులను తమ స్వార్థానికి వినియోగిస్తున్నారు విద్యార్థులు దానిని తీవ్రంగా భావించి దేశంలో సాంఘికార్థిక రూపాంతర పరిణామం ఏర్పడడానికి కృషి చేయాలి యువశక్తి మహత్తరమైనది దానిని ఎవరూ అణచజాలరు మహాత్మాగాంధి జవహర్‌లాల్ నెహ్రూ సుభాష్ చంద్రబోస్ విద్యార్థి దశలోనే జాతి ప్రయోజనాల కోసం పోరాడారు నేడు దేశంలో మానవత్వపు మూల్యాలే నశించిపోతున్నాయి ప్రజల గొప్పదనం వారి భౌతిక అభివృద్ధిని బట్టే

( 74వ పేజీ చూడండి)

హైదరాబాదు నిజాం కళాశాల ఆవరణలో జూలై 30న జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తున్న కేంద్ర రక్షణశాఖ మాజీమంత్రి శ్రీ వి పి సింగ్



# విదేశములలో గిరాకీ, స్వదేశములో ఆదరణలేని మన క్రీడా పరికరాలు

క్రీడాభివృద్ధికి అనువైన ఆట స్థలములతో పాటు క్రీడా పరికరములు కూడా ఎంతో అవసరము. మన దేశములో ప్రస్తుత పరిస్థితిలో క్రీడాకారుల వినియోగమునకు కావలసినంతగా సామాన్యునికి అందుబాటు దరలో అవి లభించుట లేదు దీనికి కారణము దేశములో ఒక్క రాష్ట్రములోనే క్రీడా పరికరముల ఉత్పత్తి జీవనాధారముగా వ్యాపారముగా యున్నది అనేక మంది అగ్రగామి క్రీడాకారులను రూపొందించిన పంజాబ్ నేడు క్రీడా సామగ్రి ఉత్పత్తిలో కూడా అగ్రగామిగా యున్నది. అంతేగాక విదేశములకు ఎగుమతి చేసి విదేశ మారక ద్రవ్యము సంపాదించి పెడుతున్నది నేడు మన దేశములో 700కు పైగా క్రీడా సామగ్రి తయారు చేయు కేంద్రాలు యున్నవి కొన్నివేల గృహ పరిశ్రమలు యున్నవి

దేశ స్వాతంత్ర్యమునకు ముందు సైల్‌కోట క్రీడాసామగ్రి తయారీలో పేరు పొందింది అప్పుడు మన దేశములో ఆటల యందు యిప్పటిలాగ అంత ఆసక్తి లేదు కొన్ని పట్టణములలో నగరములలో పాశ్చాత్య క్రీడలు ఆడేవారు దేశ విభజన తర్వాత మత కలహములు చెలరేగి అనేక మంది హిందువులు భారత దేశమునకు తరలి వచ్చారు వారిలో క్రీడా సామగ్రి ఉత్పత్తి కార్ఖానాలలో పని చేయుచున్న హిందువులు కూడా వచ్చి పంజాబు ఢిల్లీ ప్రాంతములలో స్థిర పడ్డారు ఎంతో కాలము అనుభవము నైపుణ్యము క్రీడారంగ పరిచయ మున్నవారు వారిలో ఉన్నారు వారిలో కె ఎస్ బలసాడా ఒకరు బలసాడా క్రీడా సామగ్రి తయారు చేయు కార్ఖానాకు జలందర్‌ను ఎన్నుకొన్నారు కాని కార్ఖానా తయారై ఉత్పత్తి మొదలు పెట్టే సమయానికి అతను చనిపోయాడు కాని బలసాడా జలందర్‌లో వేసిన పునాది అనేక మందికి ఆసక్తి కలిగించింది నేడు జలందర్ మన దేశములో క్రీడా సామగ్రి తయారీలో ప్రథమ స్థానములో యున్నది జలందర్‌లో నాణ్యమైన క్రీడా సామగ్రి తయారవుతుందని పేరు పొందింది అనేక రకములైన క్రీడలకు కావలసిన సామగ్రి యిక్కడ లభించు చున్నది నైపుణ్యము ఓర్పు గల కార్మిక శక్తి యిక్కడ కలదు క్రికెట్ బంతి హాకీబంతి తయారీలో యంత్రముల కన్న మానవ శక్తి ఎంతో కావాలి ఇది లభించక పాశ్చాత్య దేశములు అంతగా క్రికెట్ హాకీ బంతి తయారీలో ఆసక్తి చూపుట లేదు



32 ముక్కలు చేర్చి ఫుట్‌బాల్ తయారు చేయుట

మన దేశంలో తయారయ్యే క్రీడా సామగ్రిలో 70 శాతం జలందర్‌లోనే రూపొందించబడు చున్నది 1958లో యిక్కడ నుండి 27 లక్షల క్రీడా సామగ్రి విదేశములకు ఎగుమతి కాగా, 1976లో 16 కోట్లు 1978 నాటికి 18 కోట్లు నేడు 30 కోట్ల వరకు పెరిగినది విదేశీ క్రీడా సామగ్రి యందు వ్యామోహము కొద్దీ లండన్ డిపార్ట్‌మెంటల్ స్టోర్సులలో గ్లవుస్ లెగ్‌గార్డులు కొన్న మన జాతీయ క్రికెటర్లు అవి జలందర్‌లో తయారు అయినవి అని తెలుసుకొని ఆశ్చర్య పడ్డారట అంతేగాక మన దేశములో తయారయే క్రీడా సామగ్రి అంటే మన క్రీడాకారులకు చులకన స్వదేశములో కొనుగోలు సంవత్సరమునకు అయిదు శాతం పెరగగా విదేశములకు ఎగుమతి ముప్పై శాతం వరకు ఉంటుంది క్రీడా సామగ్రి తయారీకి కావలసిన ముడి సరకు విదేశముల నుండి దిగుమతి చేసుకో వలసి యున్నది క్రీడా పరికరములుగా తయారు చేసి విదేశములకు తిరిగి ఎగుమతి చేస్తే యీడు రెట్లు ధర లభించి లాభముగా ఉన్నది అదే సరకు స్వదేశములో అమ్మగా కనీసము ఉత్పత్తి ధర లభించుట కష్టముగా యున్నది మన దేశములో ఎక్కువ టీమ్ గేమ్స్ సామగ్రి అమ్మకము జరుగును విదేశము మార్కెట్లులో బంతులు, హాకీ ప్రొటక్టర్స్ బంతులు బ్యాట్లు లెగ్‌గార్డ్స్ గ్లవుసులు టెన్నిస్ రాకెట్లు వాలీబాల్ హాండ్‌బాల్స్ బాక్సింగ్ గ్లవుసులు కప్పులు మెడల్సుకి గిరాకీ ఉన్నది

క్రీడా సామగ్రి తయారీలో జలంధర్ మీరట్ ఢిల్లీ అల్హాబాద్ మురాదాబాద్ ముఖ్య కేంద్రాలు మన దేశములో గల సుమారు 700 యూనిట్లలో ఏడు పెద్ద ఫ్యాక్టరీలు 400 వరకు చిన్న కర్మాగారాలు ఒక్క జలంధర్‌లో కలవు జలంధర్‌లో ఎక్కువ



గ్లవుస్ నాజూకుగా చేతితో కుట్టాలి



క్రికెట్ బంతి తయారు చేయుటలో ఆఖరి దశ బంతిని చేతితో కుట్టాలి



క్రికెట్ బ్యాట్స్ తయారు చేయుటలో పాల్గొన్న కుటుంబము



హాకీ బంతిని తయారు చేయుటలో పాల్గొంటున్న మహిళ



కర్ర ముక్కల భాగాలు చేర్చి హాకీ స్టిక్ రూపొందిస్తున్న కార్మికులు

ఉత్పత్తి జరుగుటకు కారణము హర్యానా నుండి బంతులు తయారీకి కావలసిన చర్మము, కాశ్మీర్ నుండి స్టిక్స్, రాకెట్లు, బ్యాట్లు తయారు చేయుటకు ప్రత్యేక కర్ర, కార్క్, ఉన్ని ముడిసరుకు లూథియానాలో లభించుట వలన ప్రపంచ క్రీడా సామగ్రి ఉత్పత్తిలో మన దేశం 16 శాతం మాత్రమేనని లెక్కలు తెల్పు చున్నవి ప్రపంచ నలుమూలల నుండి ప్రతి రోజు మన దేశానికి క్రీడా సామాగ్రికై ఆర్డర్లు వస్తూ ఉన్నాయి కాని గిరాకీకి తగినంత ఉత్పత్తి జరుగటం లేదు

ప్రపంచములో క్రీడా సామగ్రిలో బంతులకు మంచి గిరాకీ లేదు కావలసినంత సరుకు లభించక పోవుటచే నేడు సింథటిక్ బంతులు రూపొందించ వలసి వచ్చినది

జలంధర్‌లో వివిధ క్రీడా సామగ్రి తయారి చూడటానికి చాలా సరదాగా ఉంటుంది 32 ముక్కలు చేర్చి ఫుట్‌బాల్ తయారు చేయుట మహిళలు హాకీ, క్రికెట్ బంతులు తయారు చేయుట, నాజూకుగా వికెట్ కీపర్, బ్యాట్స్‌మెన్ గ్లౌవుసులు కుట్టుట హాకి, టెన్నిసు రాకెట్లకై కర్రలను వంచి ఆకారము తెచ్చుట ఆసక్తి కరముగా ఉంటుంది నేడు అనేక కుటుంబముల వారు యీ వృత్తిలో ఉన్నారు పెద్దల నుండి పిన్నల వరకు ఏదో ఒక క్రీడా సామగ్రి తయారీలో ప్రత్యేకత కలిగి యుంటారు

1958లో 'స్పోర్ట్స్ గూడ్స్ ఎక్స్‌పోర్ట్ ప్రమోషన్ కౌన్సిల్ స్థాపించుట ఎంతో లాభించినది విదేశములలో మన సామగ్రి గురించి యీ సంస్థ ప్రచారము చేసి, ఆర్డర్లు సేకరించి సహకరించు చున్నది నేడు ప్రపంచ క్రీడా సామగ్రి ఉత్పత్తి దారుల సమాఖ్యలు గల 12 దేశములలో మనకు స్థానము కలదు ఫ్రాన్స్, జర్మనీ, బ్రిటన్, హాంగ్‌కాంగ్, జపాన్, మెక్సికో నెదర్లాండ్స్, తైవాన్, స్పెయిన్, స్వీడన్, యు ఎస్ ఎ లతో కలసి మన దేశం యీ సమాఖ్యలో కలదు ఇంట లభించ నటువంటి ఆదరణ బయట విదేశములలో మన క్రీడా సామాగ్రికి లభిస్తున్నది పాశ్చాత్య నాగరికత మోజులో యున్న మన సమాజం సరుకు యొక్క నాణ్యత కన్న విదేశములో తయారు చేసిన సరుకుకే ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నది క్రీడా సామగ్రి విషయంలో కూడా అదే విధముగా యున్నది అడిడాస్ లాంటి పెద్ద సంస్థలతో పోటీ చేయగల సంస్థలు మనకు లేకపోయినా మన సరుకు నాణ్యతలో తక్కువ కాదు మన దేశం క్రీడా సామగ్రిని ఆదరించలేక పోవుట దురదృష్టకరము

— ముకరమ్




ఇటీవల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు స్టాఫ్ రిక్రియేషన్ క్లబ్ హైదరాబాదువారి వార్షికోత్సవ సందర్భంగా త్యాగరాయ గాన సభలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమంలోని ఒక దృశ్యం

నిర్ణయించడం జరుగుతూంది మూల్యానికి ప్రాదాన్యమిచ్చే పద్ధతి ఎక్కడపోయింది? నేను దేశమంతటా తిరిగి అవినీతికీ, నల్ల బజారుకు విరుద్ధంగా పోరాడుతాను నల్ల దనం నిరుడు మాత్రమే 40వేల కోట్ల రూపాయల మేర ఉత్పత్తి అయింది దీనిలో సగంతో, ఇరవై వేల కోట్లతో పరిశ్రమలు స్థాపించినా కొన్ని లక్షల మంది యువకులకు వృత్తి కల్పించవచ్చు ఇక స్వీడన్‌లో ఉన్న మన దనం కొన్ని సహస్ర కోట్లు దాని వివరాలు తెలుసుకొనడానికి మనకు సంపూర్ణమైన అదికారం వుంది ఆర్థికమైన నేరాలు కనిపెట్టడానికి అమెరికా గూడచారి సంస్థ సహాయం పొందడం తప్పు కాదు స్విస్ బ్యాంకులలో అపారంగా వున్న భారతీయ పారిశ్రామికవేత్తల వ్యాపారుల రహస్య దనం బారత దేశానికి రహస్యమెలా అవుతుంది బారత ప్రభుత్వం జనరల్ వైద్య హత్య రహస్యాలను తెలుసుకొనడానికి అమెరికన్ గూడచారి సంస్థ సహాయం తీసుకుంది ఈ రహస్య దనం విషయంలో సహాయం పొందడం తప్పు కాదు- అని ఆయన అన్నారు శ్రీ ఆరీఫ్ మహమద్‌ఖాన్ ప్రసంగిస్తూ మత దౌర్జన్యాలు జరుపుతున్న వారిపై సకల విదమైన ఆంక్షలు విదించాలన్నారు మత,దృష్టిగల ఎన్నికల పద్ధతిని ప్రభుత్వం మానుకోవాలని ఆయన అన్నారు ఈలాటి సమావేశాన్ని ఏర్పాటు

## హైదరాబాద్ నోట్‌బుక్

( 71 వ పేజీ తరువాయి)

చేసినందుకు శ్రీ సింగ్, శ్రీ ఖాన్ విద్యార్థులను ప్రశంసించాయి విద్యార్థి సంఘం అద్యక్షుడు శ్రీ సుబ్బయ్య చౌదురీ దన్యవాదాలు చెబుతూ, తమ సంఘానికి రాజకీయాలతో సంబంధం లేదని అన్నారు శ్రీ సింగ్ రవీంద్రబారతిలో జరిగిన రాజస్థానీ సంఘం సమావేశంలోను ప్రసంగించారు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు తమ బసలో గురువారం రాత్రి శ్రీ వి పి సింగ్‌కు, హర్యానా ముఖ్యమంత్రి శ్రీ దేవీలాల్‌కు, బి జె పి ఉపాధ్యక్షురాలు శ్రీమతి విజయారాజే సింధియాకు విందు చేశారు ఈ సందర్భంలో రెండు గంటలపాటు మంతనాలు జరిగాయి శ్రీ సింగ్ సమావేశాలన్నీ జనంతో క్రిక్కిరిసిపోయాయి

**ఉపశ్రుతి :**

ఏం సార్! మీరు శ్రీ వి పి సింగ్‌తో కలుస్తున్నారా?- అనడిగాను ఒక వివిద రాజకీయ పార్టీల మాజీ నాయకుణ్ని శ్రీ సింగే తాను ఏ పార్టీవాణ్నీ కాదంటున్నప్పుడు మరొకరు ఆయనతో చేరే ప్రశ్నేముంది?- అన్నారు మా మాటలు వింటున్న మరొక రాజనీతిజ్ఞుడు

-తిరుమల రామచంద్ర

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

### సీరియల్స్

డి ఎస్ పి విజయ్ కొత్త సీరియల్ చదువుతున్నంత సేపు సంఘటనలు కళ్ళకు కట్టినట్లుగా, సినీమా చూస్తున్న మాదిరిగా ఉంది ఈ సీరియల్ అందిస్తున్నందుకు కృతజ్ఞతలు తెలియ చేస్తున్నాను

–వి వెంకటేశ్వరరావు, బొద్దూరు(శ్రీకాకుళం)

★ ★ ★

డి ఎస్ పి విజయ్ సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది ప్రత్యూష పవనాలు ముగింపు చాల బాగుంది

–ఎస్ ఎ తాజుద్దీన్, తెనాలి

★ ★ ★

ప్రత్యూష పవనాలు సీరియల్ మాయింటిల్లి పాదిని ఆకర్షించింది అప్పుడే ముగింపా! అని ఆశ్చర్యం, బాద కలిగింది రచయిత్రి బవానీ లక్ష్మమూర్తి గారికి మా దన్యవాదాలు

–బమిడిపల్లి సావిత్రి, సుషమ, అమలాపురం

★ ★ ★

ప్రత్యూష పవనాలు ముగింపు ఎంతో బాగుంది డి ఎస్ పి విజయ్ సీరియల్ ప్రారంభంలోనే ఆకట్టుకుంది –ఆర్ రవికుమార్, అనంతపురం

### కథలు

పూర్ణిమ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పైడిపాల గారి లాహిరి లాహిరి లాహిరిలో కథ వాస్తవికతకి అద్దం పట్టింది

ఈ కథని చదివి కొంత మంది యువకులు మారినా రచయిత ధ్యేయం నెరవేరినట్టే!

–ప్రతాప వెంకటసుబ్బారాయుడు, హైదరాబాదు

★ ★ ★

లాహిరి లాహిరి కథలో నెలలు నిండిన ఇల్లాలు సినిమా క్యూలో నిలబడటం, నొప్పులు రావటం వాస్తవంగా లేదు నేటి జనాబాకు గల సినిమా వ్యామోహాన్ని కావాలని భూతద్దంలో చూపించినట్లుగా వుంది

'స్నేహితుడు', 'ప్రిన్సిపుల్' కథలు పరిమాణంలో చిన్నవైనా 'ప్రమాణం'లో ఉన్నతంగా వున్నాయి. 'సమదృష్టి', 'వలస' కథలు పరవాలేదు

–వక్కలంక రామారావు, మానేపల్లి

### శీర్షికలు

పూర్ణిమ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా బాగుంది ఇందులో సుమలత సమాధానాలు మరింత బాగున్నాయి

–దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ ☐

Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor. M. Madhava Rao, Chief Editor S. Radhakrishna.
Phones Business: 61247, 61248, 75569 Editorial · 75667